అరి...మంబు- అరి=శత్రువులనియెడు, హంస=హంసలయొక్క, సంసత్=సమూహమునకు, అభ్రాగమంబు - అభ్ర=మేఘములయొక్క, ఆగమంబు=కాలమును, (వర్షర్తు వనుట), మార్గ...సంబు - మార్గణ=యాచకులయొక్క, [illegible] పులనియెడు, పిక=కోయిలలకు, మధుమాస=వసంతమాసముయొక్క, దినసరాజి దినములవంటివాఁడును, గుణరత్నరోహణశిఖరము-గుణ=గుణములనియెడు, రత్న=మణులకు, రోహణశిఖరి ధరము=రోహణపర్వతమైనవాఁడును, బాంధ...హేళి - బాంధవ[illegible] బంధుసమూహమనెడి, పద్మవనీ=కమలవనమునకు, హేళి=సూర్యుఁడును, కారు...శత్రుఁడు- కారుణ్యరస=కరుణయనునుదకమునకు, నిమ్నగాశత్రుఁడు- నదీభర్తయగుసముద్రుఁడును, అనన్=అనఁగా, ధర...ఁడు- ధరణీధర=రాజులచేత, దత్త=ఈఁబడిన, వివిధ=పలుతెగలగు, ఉపదా=కానుకలయొక్క, విధా=ప్రకారములచేత, సమార్జిత=సంపాదింపఁబడిన, శ్రీ=సంపదచేత, వినిర్జిత=జయింపఁబడిన, స్వర్గాలయా=స్వర్గమునకు, ఈశ్వరుఁడు=ప్రభువగునింద్రుఁడునుగల, తిమ్మభూపాలయీశ్వరుండు తిమ్మభూపాలపుత్రుఁ డగునీశ్వరదేవరాయఁడు, జగంబులన్=జగత్తులయందు, మిగులన్=అతిశయించునట్లు, ప్రఖ్యాతిఁగాంచెన్=కీర్తిఁబొందెను.

తా. తిమ్మదేవరాయలకుమారుఁ డగునీశ్వరదేవరాయఁడు రాజులవలని కప్పంబులచే నధికసంపద గలవాఁడయి తనయైశ్వర్యముచే నింద్రుని జయించుచుఁ దనభుజము నాశ్రయించినభూమికి వజ్రకవచం బన దుష్టజను లను పాములను [illegible] వానివలెఁ జెండాడుచును, మిగుల సొగసగువాఁడు గావున మగువలమనంబులఁ దన చక్కఁదనంబుచే నాకర్షించుచు వానకాలము హంసలను దఱిమినట్లు శత్రువులను దఱుముచుఁ గోయిలలకు వసంతఋతువట్లు యాచకులకుఁ దాను సంతోషకరుఁడై రత్నంబులు రోహణపర్వతంబునందుంబలె గుణంబులు దనయందు నెలకొనఁగ సూర్యునిఁ గాంచినపద్మవనంబుచందంబునఁ దన్నుం గాంచి చుట్టంబులు సంతసింపం బొదల సముద్రంబున నెడఁబడనిజలంబట్లు తనహృదయంబునఁ గారుణ్యరసము [illegible] నెలుచున్నాఁ డని లోకంబులందు విఖ్యాతి వహించెను.

క. ఆయీశ్వరనృపతికిఁ బు, ణ్యాయతమతి యైనబుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితులుదయించిరి, ధీయుతులగునారసింహతిమ్మనరేంద్రుల్.

టీ. ఆయీశ్వరనృపతికిన్ = ఆయీశ్వరదేవరాయలకును, పుణ్యాయతమతి యైన=పుణ్యములయందు విశాలమగు మనస్సుగల, బుక్కమాంబకున్=బుక్కమ్మగారికిని, తేజ...తులు- తేజః=తేజముచేతను, తోయజహితులు=సూర్యులును, ధీయుతులు=బుద్ధిమంతులును, అగు=అయిన, నారసింహతిమ్మనరేంద్రుల్=నరసింహదేవరాయలును తిమ్మదేవరాయలును, ఉదయించిరి=జననమందిరి. ఈపద్యమున రెండవచరణమందు

బుక్కమాంబ యనుచోట నంబాశబ్దఘన మైనయమ్మ యనునది తేలఁబలికిన నమ యై నది గనుక బుక్కమ యని యుండఁగా దానిపైని మరల నంబాశబ్దము ప్రయోగించి నందునఁ బౌనరుక్త్యముగాఁ గానఁబడుచున్నది. ఇందుకు 'ఆర్యాంబాదికశబ్దాః స్వశ్రైర్యత శ్శ్రైష్ఠార్థగోచరాః, తత స్తదంతశబ్దేభ్యో నైవశ్రేష్ఠార్థగోచరాః' అని యధర్వణ వచనము. ఈతీరున నున్నను నీప్రకారముగాఁ బ్రయోగించుటకు మూలము విచారింప వలయును.

తా. అటువంటి యీశ్వరరాజునకును, బుణ్యాత్మురాలైన బుక్కమ్మకును, సూర్యునివంటి తేజశ్శాలురును, బుద్ధిమంతులును నగు నరసింహరాజును, తిమ్మరాజును బుట్టిరి.

క. అందు నరసప్రభుఁడు హరి
చందనమందారకుంద • చంద్రాంశునిభా
స్పందయశస్తుందిలది
క్కందరుఁడై ధాత్రి యేలెఁ • గలుషము లడఁగన్. 29

టీ. అందున్=వారిరువురందును, నరసప్రభుఁడు = నరసింహదేవరాయఁడు, హరి...రుఁడై - హరిచందన=శ్రీగంధముతోడను, మందార=పారిజాతపుష్పములతో డను, కుంద=మల్లెపువ్వులతోడను, చంద్రాంశు = చంద్రకిరణములతోడను, నిభ= సమానమైనట్టి, అస్పంద=చలింపని, యశః=కీర్తిచేతను,తుందిల=పెద్దకడుపుగల,దిక్ = దిక్కులయొక్క, కందరుఁడై=గుహలుగలవాఁడై, కలుషములు=పాపములు, అడఁ గన్=నశించునట్లు, ధాత్రి=భూమిని, ఏలెన్=పాలించెను.

తా. వారిద్దఱిలో నరసభూపాలుఁడు హరిచందనాదులతో సమానమై శుభ్రమైన తన కీర్తి దిగంతములయందు వ్యాపించుచుండఁగాఁ బాపము లడఁగిపోవునట్లు భూమిని బాలించెను.

సీ. అంభోధివసనవి • శ్వంభరావలయంబు,
దనబాహుపురి మర • తకముఁ జేసెఁ
గకుబంతనిఖిలరా • ణ్ణికరంబుఁ జరణమం,
జీరంబు సాలభం • జికలఁ జేసె
మహనీయనిజవిని • ర్మలయశస్సరసికి,
గగనంబుఁ గలహంస • కంబుఁ జేసె
నశ్రాంతవిశ్రాణ • నాసారలక్ష్మికిఁ,
గవికదంబముఁ జాత • కములఁ జేసె

తే. నతిశితకృపాణకృత్తమ • త్తారివీర
మండలేశసకుండల • మకుటమూర్ధ్న
మస్తమాల్యపరంపరా • మండనార్చి
తేశ్వరుం డగునారసిం • హేశ్వరుండు. 30

టీ. అతి...రుండు - అతిశిత=మిక్కిలివాఁడియగు, కృపాణ=ఖడ్గము చేతను, కృత్త=నఱకఁబడిన, మత్త=మదించిన, అరివీర=శత్రువులందు వీరులగు, మండలేశ=రాజుల యొక్క, సకుండలమకుట = కుండలకిరీటములతోఁగూడిన, మూర్ధ్న = మూర్ధనము లయిన, మస్త=శిరస్సులనియెడు, మాల్య=విరిసరములయొక్క, పరంపరా= సమూహముచేతనుగలిగిన, మండన=అలంకారముచేతను, అర్చిత=పూజింపఁబడిన, ఈశ్వరుండు=సర్వేశ్వరుఁడు గలిగినవాఁడు, అగు=అయినట్టి, నారసింహేశ్వరుండు=నరసింహదేవరాయఁడు, అంభో...యంబుఁ - అంభోధి=సముద్రము, వసన=వస్త్రము గాఁగల, విశ్వంభరా=భూమియొక్క, వలయంబుఁ=వలయమును, తన...తముఁ - తన=తనయొక్క, బాహుపురి=కేయూరమందలి, మరతకముఁజేసెఁ=మరకతమణిని జేసెను. కకు...రంబుఁ - కకుప్=దిక్కులయొక్క, అంత=చెఱఁగులయందలి, నిఖిల = సమస్తమయిన, రాట్=రాజులయొక్క, నికరంబుఁ=సమూహమును, చర...కలఁ - చరణమంజీరంబు-చరణ = పాదముయొక్క, మంజీరంబు=గండపెండేరము యొక్క, సాలభంజికలఁజేసెఁ=ప్రతిమలఁజేసెను, మహా...సికిఁ - మహానీయ=అధికమైయున్న, నిజ=స్వకీయమయిన, వినిర్మల=మిక్కిలిశుభ్రమగు, యశః=కీర్తియని యెడు, సరసికిఁ=సరస్సునకు, గగనంబుఁ=ఆకాశమును, కలహంసకంబుఁజేసెఁ = హంసవిశేషమునుఁజేసెను. అశ్రా...లక్ష్మికిఁ - అశ్రాంత=ఎడతెగని, విశ్రాణన = వితరణమనియెడు, ఆసార = ధారాసంపాతముయొక్క, లక్ష్మికిఁ = సమృద్ధికి, కవికదంబముఁ = కవీశ్వరసమూహమును, చాతకములఁజేసెఁ = చాతకపక్షులను జేసెను.

తా. నరసింహరాయలు యుద్ధరంగమందు బహిరంగముగా నెదిరించినశత్రువీరులతలలు మకుట కుండలంబులతోడం గూడఁ దనఖడ్గంబున ఖండించి, యట్టి శిరంబులను విరులసరములచేఁ గఱకంఠుఁడు కపాలమాలాధరుఁడు గనుక నతని నలంకరించుచుఁ జతుస్సముద్రముద్రితభూవలయంబు ననాయాసంబుగ వహించి పాలించుచు సమస్తదేశాధీశ్వరులచే మ్రొక్కులు గైకొనుచు భూమ్యంతరిక్షంబులయందుఁ దన యశంబు నించి యెల్లప్పు డెడతెగనిదానంబులచేతఁ గవీశ్వరులకుఁ దృప్తి సేయుచుండె నని భావము,

తే. ఆనృసింహ ప్రభుండు ది॰ప్పాంబవలన
నాగమాంబికవలన నం॰దనులఁ గాంచె
వీరనరసింహరాయభూ॰విభుని నచ్యు
తాయతాంశజు శ్రీకృష్ణ॰రాయ నిన్ను. 31

టీ. శ్రీకృష్ణరాయ=కృష్ణదేవరాయా! ఆనృసింహప్రభుఁడు=ఆనరసింహదేవ రాయఁడు, తిప్పాంబవలనన్=తిప్పమ్మాదేవివలన, వీరనరసింహరాయభూవిభునిన్=వీరనరసింహరాయలను, నాగమాంబికవలనన్=నాగమ్మవలన, అచ్యుతాయతాంశజున్-అచ్యుత=శ్రీకృష్ణునియొక్క, ఆయత=పూర్ణమగు, అంశ=కళచేతను, జున్=పుట్టినట్టి, నిన్నున్=నిన్నును, నందనులన్=పుత్త్రులనుగా, కాంచెన్=పడసెను.

తా. ఆ నరసింహరాయలకు భార్యలగు తిప్పమ్మ, నాగమ్మ యనువారిలోఁ దిప్పమ్మకు వీరనృరసింహరాయలును, నాగమ్మకు కృష్ణాంశసంభూతుఁ డగు కృష్ణ దేవరాయలును సుతులైరి.

క. వీరనృసింహుఁడు నిజభుజ, దారుణకరవాలపరుష॰ధారాహత వీ
రారి యగుచు నేకాతప, వారణముగ నేలె ధరన॰వారణమహిమన్.

టీ. వీరనృసింహుఁడు=వీరనరసింహరాయఁడు, నిజ ..యగుచున్ - నిజ = స్వకీయమగు, భుజ = భుజమండలి, దారుణ=భయంకరమైన, కరవాల = ఖడ్గము యొక్క, పరుష=కఠినమగు, ధారా=అంచుచేతను, హత=సంహరింపఁబడిన, వీర=వీరులైన, అరియగుచున్=శత్రువులుగలవాఁడగుచు, అవారణమహిమన్ - అవారణ=అప్రతిహతమైన, మహిమన్=మహత్త్వముచేతను, ధరన్=భూమిని, ఏకాతపవారణముగన్=ఏకచ్ఛత్రము గలుగునట్లుగా, ఏలెన్=పాలించెను.

తా. వీరనృసింహరాయఁడు తనఖడ్గముచేత నెదురించినవీరులగు శత్రువుల నఱికి యడ్డము లేనివిజృంభణముచేత నేకఛత్రాధిపతియై భూమిని బాలించెను.

క. ఆవిభునసంతరంబ ధ
రావలయముఁ బూని తీవు ॰ రహిమైఁ దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖులు ॰ దేవేరులుఁగాన్. 33

టీ. ఆవి...రంబ - ఆవిభు=ఆవీరనృసింహరాయలయొక్క, అనంతరంబ = తరువాతనో, ఈవు=నీవు, తిరుమల్దేవియున్=తిరుమలయమ్మయు, అన్నపూర్ణాదేవియున్=అన్నపూర్ణమ్మయునను, కమలాబ్జముఖులు=కములముంటియు చంద్రునివంటియు

ముఖము గలవారు, దేవేరులుగాన్ = పట్టపుదేవులుగాఁగా, ధరావలయమున్ = భూవలయమును, రహిమైన్ = సంతోషముచేతను, పూనితివి = వహించితివి.

తా. జ్యేష్ఠుఁ డగు నానృసింహరాయలపిమ్మటఁ గృష్ణదేవరాయలు భూభారమును వహించె ననియును, దిరుమలదేవి, యన్నపూర్ణాదేవి యతనికిఁ బట్టపుదేవులనియును భావము.

సీ. తొలఁగెను ధూమకే•తుక్షోభ జనులకు,
నతివృష్టిదోషభ•యంబు వాసెఁ
గంటకాగమభీతి • గడచె నుద్ధతభూమి,
భృత్కటకం బెల్ల • నెత్తువడియె
మానె నఘస్ఫూర్తి • మరుభూములందును,
నెలమూఁడువానలు • నిండఁ గురిసె
నాబాలగోపాల • మఖిలసద్ద్విజమును,
నానంద మగుమన్కి • నతిశయిల్లెఁ
తే. బ్రజల కెల్లను గడు రామ•రాజ్య మయ్యెఁ
జారుసత్త్వాఢ్య యీశ్వర•నారసింహ
భూవిభునికృష్ణరాయ య•భ్యుదయ మొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బా•లింపఁగాను. 34

టీ. చారుసత్త్వాఢ్య - చారు = ఒప్పిదమగు, సత్త్వ = సాత్త్వికగుణముచేతను, బలముచేతను, ఆఢ్య = ఘనుఁడవైనవాఁడా! ఈశ్వ...రాయ - ఈశ్వరనారసింహభూవిభుని = ఈశ్వరరాయలపుత్త్రుఁడగు నారసింహరాయల తనయుఁడవగు, కృష్ణరాయ - కృష్ణదేవరాయా! నీవు, అభ్యుదయమొంది = శ్రేయస్సును జెంది, ధాత్రిన్ = భూమిని, పాలింపఁగాను = పాలించుచుండఁగా, జనులకున్ - ప్రజలకు, ధూమ...క్షోభ - ధూమకేతు = తోఁకచుక్కవలని, క్షోభ = దుర్భిక్షము, తొలఁగెను = లేదాయెను. అతివృష్టిదోషభయంబు వాసెన్ = అధికవర్షదోషమువలని వెఱపు వదలెను. కంట...భీతి - కంటక = క్షుద్రవైరిరాజులయొక్క, ఆగమ = రాకవలని, భీతి - భయము, గడచెన్ = అతిక్రమించెను, ఉద్ధత...బెల్లన్ - ఉద్ధత = గర్వించిన, భూమిభృత్ - రాజులయొక్క, కటకంబెల్లన్ = రాజ్యమెల్లను, ఎత్తువడియెన్ = బలహీనమయ్యెను, అఘస్ఫూర్తి - అఘ = పాపములయొక్క, స్ఫూర్తి = అతిశయము, మానెన్ = రూపుసడియెను. మరుభూములందును = నిర్జలభూములయందును, నెలమూఁడువానలు = నెలనుమూఁడేసివానలు,

నిండన్=పరిపూర్ణముగునట్లు, కురిసెన్=వర్షించెను. ('మరుభూములందును' అనుసము చ్ఛాయకగ్రుతసారస్యమువలన ఫలవద్భూములందు సైతము పదిదినముల కొక్క వర్షము గురియు ననుట). ఆబాలగోపాలము= బాలురు గోపాలురు మొదలుగా, అఖి...ములు-అఖిల=సమస్తములగు, సత్=సజ్జనులయొక్క, వ్రజమును=సమూహమును, ఆనందమగు=సంతోషముగల, మన్కిన్=బ్రదుకుచేతను, అతిశయిల్లెన్ = అధికమయ్యెను. ప్రజలకెల్లను=సమస్తజనులకును, కడున్=మిక్కిలి, రామరాజ్యమయ్యెన్= బాలమరణాదిపీడలులేని శ్రీరామరాజ్యమువలె నయ్యెను.

తా. కృష్ణదేవరాయలు శ్రేయస్సు గలిగి రాజ్య మేలుచుండఁగా, భూమిపై జనులకు దుర్భిక్షభయమును, అతివృష్టిభయంబు ననావృష్టిభయంబు మొదలగునీతిబాధలు లేవనియును, దగినకాలములయందుఁ గావలసిన వానలు గురియుచుండె ననియును, బరరాజులు దాడి సేయ రనియును, బాలురు వృద్ధులు గోపకులు మొదలుగా నెల్లవారలును నిరంతరసంతోషంబుఁ గాంతు రనియును, బాలమరణాదిదోషంబులు లేక శ్రీరామరాజ్యమై యుండె ననియును భావము.

క. తునియలు దొమ్మిదియఁటఁ బదు
నెనమండ్రఁట మోచువా రనేకపకిటికూ
ర్మనగాహు లేటిలావరు
లని తావకబాహు వొకఁడ యవని భరించెన్. ౩౫

టీ. తునియలు = భూఖండములు, తొమ్మిదియఁట = నవసంఖ్యాకంబులఁట. మోఁచువారు=వహించెడువారు, పదునెనమండ్రఁట=అష్టాదశసంఖ్యాకులఁట. అనే...హులు - అనేకప=రెంటఁబానము జేసెడిదిగ్గజము లెనిమిదియును, కిటి=వరాహమొక్కండును, కూర్మ=ఆదికూర్మ మొక్కండును, నగ = కదలనికులపర్వతంబులేడును, అహులు=శేషుఁడొక్కండును, (ద్వంద్వాంతమున బహువచనము) వీరు, ఏటిలావరులు=ఏపాటిబలవంతులుఅని, తావక=నీసంబంధమగు, బాహు వొకఁడ=భుజమొక్కఁడే, అవనిన్=భూమిని, భరించెన్=పూనెను.

తా. కృష్ణదేవరాయలభుజము మున్ను భూభారమును వహించియున్నవారగు, గజ, వరాహ, కమఠ, కులపర్వత, శేషులను లెక్కించి పదునెనమండ్రని యెఱింగి భూభాగములు లెక్కించి భరతఖండాదినవఖండంబు లని తెలిసి యొక్కొక్కఖండంబు బిద్దఱిద్దఱు వహించుచున్నట్లూహించి వార లెట్టిబలవంతు లనియోగ్గించి యట్టి తొమ్మిదిఖండంబులు గలభూమండలం బంతయుఁ దానే వహించె నని భావము. ఈ పద్యంబునందలి 'యఁట' శబ్దద్వయము వినఁగిరోధార్థకంబై యున్నది.

సీ. తొలుదొల్త నుదయాద్రి • శిలఁ దాఁకి *తీంట్రించు,
నసిలోహమున వెచ్చ • నై జనించె
మఱి కొండవీఁ డెక్కి • మాఱ్కొన నలిగ్గొనిన,
యలకసవాపాత్రు • నంటి రాఁజె
నట సాఁగి జమ్మిలో • యఁ బడి వేఁగి దహింపఁ,
గోనఁ బిట్టేర్చెఁ గొ • ట్టానఁ దవిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ • గఱఁచె గౌతమిఁ గ్రాఁచ,
నవల నాపొట్నూర • రవులుకొనియె

తే. † మాఁడెములు వ్రేల్చె నొడ్డాణి • మసియొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు • గలఁగి పఱవఁ
దోఁకచి చ్చన నౌర నీ • దురవగాహ
ఖేలదుగ్రప్రతాపాగ్ని • కృష్ణరాయ. 86

టీ. కృష్ణరాయ=కృష్ణరాయభూపాలా, నీదు...పాగ్ని = నీ = నీయొక్క, దురవగాహ=ప్రవేశింపశక్యముగానియట్లు, ఖేలత్=క్రీడించుచున్న, ఉగ్ర=తీక్ష్ణముగు, ప్రతాప=ప్రతాపమనియెడు, అగ్ని=నిప్పు, తోఁకచిచ్చనన్ = [illegible] జ్వాలయో యన్నట్లు, తొలుదొల్తన్=ప్రప్రథమమందు, ఉదయాద్రిశిలన్ = ఉదయగిరిదుర్గమనియెడుచెకుముకిరాతిని, తాఁకి=స్పృశించి, తీంట్రించు...మునన్=తీంట్రించుచు=జ్వలించెడు, అసి=ఖడ్గమనియెడు, లోహమునన్=అగ్నిజననకారణమగు[illegible]యందు, వెచ్చనై=వేఁడిమిగలదియై, జనించెన్=అంకురించెను, (శిఖము శిలయందు లోహప్రతికయు నొలసినప్పుడు నిప్పుపుట్టు ననుట), మఱి=పిమ్మట, కొండవీఁడు=కొండవీటిదుర్గమును, ఎక్కి=ఆరోహించి, మాఱ్కొని=ప్రతిఘటించి, నలిగ్గొనిన=నలఁగియున్న, అల = అప్రసిద్ధుండగు, కసవాపాత్రుఁ డనువానిని, (నలిగ్గొనిన = నలఁగిన, కసవాపాత్రున్=కసవాపాత్రుఁడనుకసవును), అంటి = తాఁకి, రాఁజెన్ = పొగసెను. (ఆనిప్పు నలఁగినకసవుపైఁ బడినప్పుడు రాఁజు ననుట). అటన్=అచ్చట, సాఁగి = వెడలి, జమ్మిలోయఁబడి=జమ్మిలోయ యనుప్రదేశము ప్రవేశించి, (జమ్మిచెట్లు గల బొటియలోఁ బడియును), వేఁగిన్=వేఁగినాడును, దహించెన్=కాల్చెను. వేఁగి=ప్రకాశించి, (కాల్చె ననుట), కోనన్ = కోనసీమను, బిట్టు=కఠినముగా, ఏర్చి = కాల్చి, కొట్టానఁ దగిలెన్=కొట్టాన మనుదేశమునం దంటుకొనియెను. (జమ్మిచెట్టు గాల్చి యాయగ్ని కొట్ట మనఁగా శాల గావున దాని నంటికొనెననుట), కనకగిరి—

* కెరలునీ, యసిలోహ. † మాడుగుల వ్రేల్చె నొడ్డాది • మసియొనర్చి.

కనకదుర్గముయొక్క, స్ఫూర్తిన్=ఆధిక్యమును, కఱఁచెన్=కఱఁగఁజేసెను.(అగ్ని వలన బంగారము గఱఁగు ననుట), గౌతమిఁ గ్రాఁచెన్=గోదావరిని దపింపఁ జేసెను, (అగ్నివలన జలంబులు దప్తము లగు ననుట), అవలన్=అనంతరమందు, ఆపొట్నూ రన్=పొట్టునూరు అనుప్రదేశమందు, రవులుకొనియెన్ = ప్రజ్వలించెను. (అగ్ని పొట్టుమీఁదఁ బడినప్పుడు రగులుకొను ననుట), మాఁడెములు ప్రేల్చెన్=మాఁడెము లనియెడుమన్నెప్రదేశములు గ్రాల్చెను, ఒడ్డాణిన్=ఓఢ్రదేశమును, మసియొనర్చెన్ = భస్మసాత్కృతముఁగావించెను. (అనఁగా బుగ్గిచేసెననుట), కటకపురిన్=కటక మనుపట్టణమును, గజరాజు=గజపతి, కలఁగి=కలఁతపడి, పఱవన్ = పలాయితుఁడు గాఁగా, కాల్చెన్=దహించెను. కటకపురిన్=పురివంటిగిరినితంబమును, గజరాజు= పర్వతమందలిగజశ్రేష్ఠము, పఱవన్=మంటఁ జూచి పఱుగులిడునట్లు, కాల్చెన్= తగులఁబెట్టెను.

తా. కృష్ణదేవరాయలప్రతాపము ప్రథమమం దుదయగిరిదుర్గ మాక్రమించి పిమ్మటఁ గొండవీటిదుర్గముమీఁది కేఁగి కసవాపాత్రుని సంహరించి యచ్చట వెడలి జమ్మిలోయమీఁద నేఁగి వేఁగిదేశము నాక్రమించి కోనసీమఁ గైకొని కొట్టమును గ్రహించి కనకదుర్గమును బాడుఁజేసి గోదావరిని దపింపించి పొట్నూర వ్యాపించి మన్నెప్రదేశము లాక్రమించి యోఢ్రదేశము జయించి గజపతి భయంపడి పఱచు నట్లు కటకపురి నాక్రమించె ననియును, ఆప్రతాప మగ్నివలె నుండె ననుటవలన నయ్యా గ్ని యుదయగిరి యనుచెకిముకిశిలఁ దాఁకి కత్తియనెడుచెకుముకి కత్తియందుఁ దొలుతఁ బుట్టి కొండవీఁ డనుకొండయొక్క నలిమైనకసవాపాత్రుఁ డనుకసవు నంటి రాఁజు కొని జమ్మిచెట్లమీఁద వేఁగిచెట్లమీఁదఁ బడి దహించి కొట్ట మంటుకొని కనకదుర్గ మనుకనకమును గఱఁగఁజేసి గోదావరిలోనియుదకములు గ్రాఁగఁజేసి పొట్నూ రను పొట్టుమీఁదఁ బ్రజ్వరిల్లి యావలఁ గటకపురి యనుకొండదరియందుఁ జేరి యచ్చట నివ సించుచున్న యేనుఁగు పాఱిపోవునట్లా ప్రదేశమును దహించె నని యచ్చటచ్చట నుం డెడుశబ్దములవలన రూపకాలంకారమును, ధ్వన్యలంకారమును దోఁచుచున్నది.

ఉ. చిత్రము కృష్ణరాయనృప • శేఖర నీదగుధాటి కోడి స
ర్వత్ర నిలింపకామినుల • వాడకుఁ గాఁపులు వోదు రుత్కల
క్షత్రియపాత్రు లెల్లఁ గసు • గందనిమేనులఁ దొంటిపెద్ద లే
సూత్రముఁ బన్నినారొ బల • సూదనుపీఁటికిఁ గొండవీఁటికిన్. 37

టీ. కృష్ణరాయనృపశేఖర=ఓకృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా! నీదగు=నీసంబంధమగు, ధాటికిన్ = ఔద్ధత్యముచేత, (ఇది విభక్తివ్యత్యయము), ఓడి=హతులై,

సర్వత్ర = అన్నిదేశములరాజులు, నిలింపకామినులవాడలన్ — అప్సరస్త్రీలవాడను, (అనఁగా స్వర్గమున కనుట. యుద్ధములోఁ జచ్చినవారు స్వర్గమునందలి యప్సరల యిండ్లకుఁ బోవుదురని వర్ణించుట కవిసంప్రదాయము), కోఁపులుగా నేగుదురు కోఁపుర ముగాఁబోవుదురు. నీదగు=నీసంబంధియగు, ధాటికన్ — దాడివెట్టుటను, ఓడి — భయం పడి, ఉత్క...లెల్లన్ - ఉత్కల=ఓఢ్రదేశమందలి, శస్త్రముపాత్రులెల్లన్ = పాత్రనామధేయు లగురాజు లందఱును, కసుగందని=లేఁతతీఁగెవలె నుండిన, (కసువుచేతఁ గందని యని మఱియొక యర్థము), మేనులన్ — శరీరముల తోడను, నిలింపకామినుల=దేవతాస్త్రీలయొక్క, వాడకున్ — పట్టణమునకును, కోఁపులుగా నేగుదురు కోఁపు రము లేఁగుదురు. తొంటిపెద్దలు=పూర్వపుఁబెద్దలు, బలసూదనువీటికిన్ — ఇంద్ర పట్టణ మగుస్వర్గమునకును, కొండవీటికిన్ — కొండవీఁడనుపట్టణమునకు, ఏసూత్రమున్ =ఎట్టిసూత్రమును, పన్నినారో=కల్పించినవారో, చిత్రము — ఆశ్చర్యము.

తా. కృష్ణరాయనృపశేఖరా! నీవు దాడి వెడలినప్పుడు ఉత్కలదేశపు రాజులు భయపడి గఱిచిట్లనిశరీరములతోడనె దేవతాస్త్రీ లున్నపట్టణమునకుఁ గాఁపురములు పోయెదరు; స్వర్గమునకును, కొండవీటికిని బూర్వపుఁబెద్ద లేసూత్రముఁ బన్ని రోకదా! ఇది చిత్ర మనఁగా లోకములో రణరంగమున నెదురించి శస్త్రాస్త్రముల వలనిలోతుగాయములతోడిశరీరము విడుచుట పిడిచినవారికే గనుస్వర్గము గలుగుఁ గాక పిఱికితనంబునఁ బఱచినవారికి స్వర్గసౌఖ్య మెట్లుగలుగును? వారికి స్వర్గ మెట్లు గల్గు నని శంక రాఁగా కృష్ణదేవరాయలదాడి విన్నమాత్రముననే ఉత్కలదేశస్థు లగు రాజులు పాఱి గఱచి గాయ పడని దేహముతోఁ గొండవీఁడు నగరు దాఁటుచు పోగ్ర వరమునకు సమీపమందలికిరాతస్త్రీలపల్లెకుఁ గాపులు గాఁ బోదురని భావము. వెనువ గఱచినవారిని గొట్టఁగూడ దని యుద్ధధర్మము. నిలింపశబ్దము. 'స్యాన్నిమ్నగాపగా కిరా తశ్చ' యనియు, 'నిలిపాః దేవశబరాః' అనియు నున్న నిఘంటువులవలన దేవతార్థక మును, కిరాతార్థకము నవుటంజేసి యాశబ్దమువిూఁదను బలసూదనువీఁ డనుశబ్దము విూఁదను శ్లేషకలిగి యిట్టి యర్థము వచ్చునట్లు చమత్కరింపఁబడియెను. ఇట బల సూదనువీఁ డనఁగా నమరారామ మని కొంద ఱందురు.

ఉ. కూరిమిఁ గృష్ణరాయనృప • కుంజర చేకొనెఁ గళింగరాజ్యల
క్ష్మీరమణీలలామ నిను • మిన్నలు ముట్టిన మోహనాంగులోఁ
గారణ మట్ల లక్ష్మి గను • గందని వేడుకఁ గృష్ణరాయసిం
జేరునకాక వావి సెడఁ • జెందునె సోదరుఁ డైన రుద్రునిన్. ౪౪

టీ. కృష్ణరాయనృపకుంజర=కృష్ణరాయభూపాలశ్రేష్ఠుఁడా! కళింగరాజ్య లక్ష్మీరమణీలలామ=కళింగదేశరాజ్యలక్ష్మియనెడుపాలఁతిమిన్న, కూరిమిన్ — ప్రేమ

చేతను, మిన్నులుముట్టిన=ఆకాశమంటిన, మోహనాలతోన్=ఏనుఁగులతో, (కళింగపతి గజపతి గనుక నని భావము. మోహనా లనఁగాఁ గోటయందలిశత్రునిరసనసాధనము లని కొందఱందురు. ఆపక్షమున వానిఁ బెరికి తెచ్చినాఁడని భావము). మోహనాలతోన్=మోహములతో, నినుఁజేరెన్=నిన్నుఁబొందెన్, కారణమట్ల=అక్రమమున నే హేతువు, లక్ష్మి=శ్రీదేవి, కృష్ణరాయనిన్=శ్రీకృష్ణదేవుని, కసుగందని=వాడిపోవని, వేడుకన్=ప్రీతిచేతను, చేరనకాక = పొందనేకాని, సోదరుఁడైన=సహోదరుఁడగు, రుద్రునిన్=రుద్రదేవుని, వావిసెడన్=వరుస చెడిపోవునట్లు, చెందునె=చెందునా, చెందదనుట.

తా. కృష్ణరాయా! కళింగరాజ్యలక్ష్మి యతిప్రేమచేతను నిన్నే చేరును గాని ప్రతాపరుద్రునిఁ జేరకపోయె నేల యనఁగా నాకళింగరాజ్యలక్ష్మి లక్ష్మి యనునామమును వహించుటంజేసి తనకుఁ బ్రియుఁ డగుకృష్ణనామము వహించిననిన్నే చేరును గాని తనకు సోదరుఁ డగురుద్రునినామము వహించినప్రతాపరుద్రునిఁ బొందదని భావము. లక్ష్మీదేవికి రుద్రదేవుఁడు సోదరుఁ డౌట యాగమప్రసిద్ధము.

సీ. కచసక్తఫణికంచు•కము మౌళి వీరకే,
దారంపుఁబాగచం•దంబు నొందఁ
గలయ నంగమున మ•ర్కటకీటకృత మైన,
మగ్గంబు నేత్రసం•పద వహింప
ధ్వాంతగహ్వరశిలా• తాడితాళికచిక్క,
ణాస్రపంకము చంద్ర•మై పొసంగఁ
దనుభృశశ్రాంతవే•ష్టనలగ్నబర్హి బ,
ర్హాంబు మువ్వన్నెచుం•గై చెలంగ
తే. నిద్ర మేల్కాంచి సెలయేట • నీడఁ గాంచి
గోపవేషంబు సెడి తొంటి•భూపవేష
మగుట యవ్వనమహిమఁగా • నలికి యచటు
విడుచు గజరాజు నీధాటి • వింధ్యవాటి. 39

టీ. కచ=జుట్టునందు, సక్త=తగులుకొన్న, ఫణికంచుకము=పాఁపకుబుసము, మౌళిన్ = శిరస్సునందు, వీరకేదారంపు = వీరకేదారమనియెడిపేరుగల, పాగ = ఉష్ణీషముయొక్క, చందంబున్=రీతిని, ఒందన్ = పొందఁగా, కలయన్ = కలియునట్లు, (అంతటననుట), అంగమునన్=శరీరమునందు, మర్కటకీట=సాలెపురుగు

చేతను, ని. 'లూతా స్త్రీతన్తువాయోర్ణనాభమర్కటకౌస్వనాః', కృత=చేయఁబడిన, మర్గంబు=తంతురచన, నేత్ర...పదన్=నేత్ర=వలిపెంపుసలువయొక్క, సంపదన్=సంపత్తును, వహింపన్=తాల్పగాను, ని.'స్యాజ్జటాంశుకయోర్నేత్రం', ధ్వాంత...కము - ధ్వాంతగహ్వర = చీఁకటిగుహయందలి, శిలా = గుండ్రాతిచేతను, తాడిత = పొడువఁబడిన, అళిక=నొసటియందలి, ని. 'లలాటమళికంగోధిః', చిక్కన=గట్టిదయిన, అస్ర=రక్తముయొక్క, పంకము=బురద, చంద్రకమై=బొట్టుగానై, (సిందూరమైయనుట), పొసంగన్=ఒప్పుచుండఁగా, తను...ర్గంబు=తనుశరీరముయొక్క, భృశ=అధికమగు, శ్రాంత = బడలికచేతనైన, లుఠన = పొర్లాడుటచేతను, లగ్న=కఱచుకొన్న, బర్హిబర్హంబు=నెమ్మిపురి, మువ్వన్నెచుంగు = మూఁడువన్నెలు గలఁగా నీలరక్తపీతవర్ణములుగల యుత్తరీయపుఁజెఱఁగు, వెలుంగన్=ప్రకాశించుచుండఁగా, నిద్రమేల్కాంచి=నిద్దురమేల్కని, సెలయేటన్=కొండవాఁగయందు, నీడఁగాంచి=నీడఁజూచుకొని, గోపవేషంబు=తాను ధరించిన గొల్లనివేషము, చెడి = పోయి, తొంటి=పూర్వము దనకున్న, భూపవేషము=రాజవేషము, అగుట = సంభవించుట, అవ్వనమహిమఁగాన్=ఆవనసంబంధియయిన మహిమచేతను గాని, (శంకించి యనుట), అలికి = భయపడి, గజరాజు = గజపతి, నీధాటిన్ = నీదాడిచేతను, వింధ్యవాటిన్=వింధ్యపర్వతప్రాంతమందు, అచటు=తానున్నప్రదేశమును, విడుచున్=వదలును.

తా. నీవు దాడి వెడలినప్పుడు గజపతి భయపడి కళింగదేశము విడిచి వింధ్యపర్వతమునకు వలస పోయి యచ్చటఁ బసులఁ గాచువానియాసముతో నొక యరణ్యములోనిచీఁకటిగుహలోఁ బ్రవేశించి వడివడిగాఁ బోవుచుండ నాగుహలో నున్న యొక్కఱాయి నొసలు దాఁకె. దానివలనఁ గ్రొత్తనెత్తురు గాఱి పేరుకొనియెను. తత్ప్రదేశంబుననే యాయాసముచేత నిదురించి మేలుకొని యాసమీపమునఁ బ్రవహించెడుసెలయేటినీటిలో నీడఁ జూచుకొని తాను నిద్రపోవుచుండఁగా నాగుహలో నుండెడుపాపకుబుసము జుట్టునకుఁ గఱచుకొనెను గావున నది యుండుట గానక భయభ్రాంతిచేత నుష్ణీషమనియును, తాను నిద్రించునప్పుడు తద్గుహలో నొక్క సాలెపుర్వు తనమీఁద మర్గంపునేత నేయఁగా నది రవస్త్రగా యనియును, మున్ను చెప్పఁబడిననొసటిగాయము సిందూరపుఁదిలకమనియును, ఆగుహలోఁ దాను మిక్కిలి బడలికచేతఁ బొర్లాడుటం జేసి చెమర్చియున్నతనశరీరమెల్ల నంటికొన్న [illegible]ము చిత్రవస్త్రమనియును, భ్రమాత్మకజ్ఞానమును బొంది తాను గుహలోఁ బ్రవేశించునప్పుడు వహించియున్న గోపాలవేషము రూపుచెడి తొల్లిటిభూపాలవేషము వచ్చెనే యిది యీవనమాహాత్మ్యముచేతఁ గాఁబోలు ననియు వగచి యావేషముతో నచ్చట నివసించుటకు నీవలనిభయముచే నిచ్చగింపక యావలఁ గదలు నని భావము.

చ. అభి*రతిఁ గృష్ణరాయ విజ•యాంకము లీవు లిఖించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ • నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం డిగుసు•రప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము • వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 40

టీ. కృష్ణరాయ=కృష్ణదేవరాయా, విజయాంకములు - విజయ = జయించుట యొక్క, అంకములు = రేఖలు, ఈవు=నీవు, లిఖించి = వ్రాసి, పొట్టునూరికడన్= పొట్నూరిసమీపమునందు, తాళసన్నిభముగన్=తాటిచెట్టుపొడవునకు సమానమగు నట్లు, నిల్పిన=నాటించిన, కంబము = స్తంభము, సింహ...ళ్ళకున్ - సింహభూధర ప్రభు = సింహాచలస్వామియొక్క, తిరునాళ్లకున్ = బ్రహ్మోత్సవమునకు, డిగు=దిగి వచ్చెడు, సురప్రకరంబు=దేవసమూహము, కళింగమేదినీవిభు=కళింగదేశాధీశ్వరుం డగుగజపతియొక్క, అపకీర్తి=అపయశస్సనెడు, కజ్జలము=కాటుకనీరు, వేమఱున్= పలుమాఱును, పెట్టి=కప్పువేసి, నిచ్చలున్=నిత్యమును, అభిరతిన్ = ఆసక్తిచేతను, పఠించున్=చదువును.

తా. నీవు విజయాక్షరమును వ్రాయించి పొట్నూరియొద్ద నాటించినజయస్తంభమునందలియక్షరములు తెల్లగా నగపడమిం జేసి గజపతియపకీర్తి యనెడునల్లని కప్పువేసి దేవతలు సింహాచలస్వామితిరునాళ్లకు వచ్చినప్పు డెల్ల మిక్కిలి యాసక్తిచేతఁ జదువుదు రని భావము. (తాటియాకులమీఁద వ్రాయఁబడిన యక్షరములు స్పష్టముగా నగపడనివో నల్లని రంగుపూసి చదువుచుండుట ప్రసిద్ధము.)

సీ. సనకాదిదివిజమ•స్కరిఫాలగోపిచం,
దనపుండ్రవల్లిక • ల్నాకి నాకి
సెలసి హాహాహూహూహు•వులదండియలతంత్రి,
ద్రెవ్వ సింగిణులుగాఁ • దివిచి తివిచి
సప్తర్షికృతవియ•ఝ్ఝరవాలుకాలింగ,
సమితి ముచ్చెలకాళ్లఁ • జమరి చమరి
రంభాప్రధానాప్స•రఃపృథూరోజకుం,
భంబు లెచ్చటఁ గన్నఁ • బట్టి పట్టి
తే. తిరుగు హరిపురసురతరు•సురల మరగి
బహుళహాళహాళిభరితక•ల్బరిగనగర

* నుతి.

సగరపురవరపరిబృఢ • జవనయవన
పృతన భవదసి ననిఁ దెగి • కృష్ణరాయ. 41

టీ. కృష్ణరాయ=కృష్ణదేవరాయా! బహు...తన-బహుతర = అధికమైన, హాళి హాళి=హాలాహాలిచేతను, భరిత=నింపఁబడిన, కల్బురగినగర = కల్బురగిపట్టణముయొక్కయు, సగరపురవర-సగర=సగరునియొక్క, పురవర=పట్టణశ్రేష్ఠమగు నయోధ్య యొక్కయు, పరిబృఢ=దొరలయిన, జవన=వేగముగల, యవన=తురకలయొక్క, పృతన=సైన్యము, అనిన్=యుద్ధమునందు, భవదసిన్-భవత్=నీయొక్క, అసిన్= ఖడ్గముచేతను, తెగి=ఖండింపఁబడి మృతినొంది, హరి...గలన్ - హరి=దేవేంద్రుని యొక్క, పుర=పట్టణమగు స్వర్గమందలి, సురతరు=కల్పవృక్షములయందలి, సుర లన్=మద్యములను, మరగి=అలవాటు చేసికొని, సన...న్నుకల్ - సనత్కుమార-సనక సనందనాదులగు, దివిజమస్కరి=దేవమునులయొక్క, సి...పరివ్రాట్కృష్ణ పారాశర్యపి మస్కరీ', ఫాల=లలాటములయందలి, గోపిచందన=గోపిచందనముయొ క్క, పుండ్రవల్లికల్=తీఁగెలవంటి యూర్ధ్వపుండ్రములను, నాకి నాకి=మాటిమాటి కిని నాలుకలతో నాకివైచి, హాహా...తంత్రుల్ - హాహాహూహూవులు=హాహాహూహూవు లనెడుదేవగాయకులయొక్క, దండియల=వీణలయొక్క, తంత్రుల్=తంతువులు, త్రె వ్వన్=తెగిపోవునట్లు, సెలసి=గుంజుకొని, సింగిణులు గాన్=ధనుస్సులగునట్లు, తివిచి తివిచి=ఆకర్షించి యాకర్షించి, సప్త...సమితిన్ - సప్తర్షి=సప్తమహర్షులచేతను, కృత=చేయఁబడిన, వియజ్ఝర=ఆకాశగంగయందలి, వాలుకాలింగ=సైకతలింగముల యొక్క, సమితిన్=సమూహమును, ముచ్చెలకాళ్లన్=ముచ్చెలుదొడిగియున్న కాళ్ల చేతను, చమరిచమరి=తాచితాచి, రంభా...భంబుల్ - రంభాప్రధానమగునప్సరసలు మొదలు గాఁగల, అప్సరః=అచ్చరలయొక్క, పృథు=పెద్దవియగు, ఉరోజకుంభంబులు= కుండలవంటి స్తనములను, ఎచ్చటఁగన్నన్=ఎక్కడఁజూచినను, పట్టిపట్టి=పట్టుకొని పట్టుకొని, తిరుగున్=సంచరించును.

తా. కృష్ణరాయా! అధికకోలాహలధ్వని గలకల్బురిగపట్టణముయొక్కయు, నయోధ్యయొక్కయు నాథు లగుతురకలసేనాజనులు యుద్ధమునందు నీఖడ్గప్రహారము చేత మృతులై స్వర్గమందుఁ జేరియును వాల్లి వారు భూమియందున్నప్పటివలెనే య చ్చటను గల్పవృక్షమద్యములు పానము సేయుచును దేవమునులగోపిచందనపుండ్ర ముల నాకుచును మెలఁకువఁదనముచేత గంధర్వులవీణలు దాము లాఁగికొని విల్లులవంటి నట్లు వంచుచును, సప్తమహాముని లాకాశగంగాతీరములఁ జేయుచున్న సైకతలింగముల రూపుమాపుచును, రంభ మొదలగునచ్చరలగబ్బిగుబ్బలఁ బట్టి నలుపుచును బూర్వ ప్రకృతివాసన విడలక తిరుగుచున్నా రని భావము.

మ. అలుక న్ఘోటకధట్టికాఖురపుటీ•హాల్య న్ఖురాసానిపు
చ్ఛలు వోఁదున్ని చలచ్చమూగజమదా•సారప్లుతి న్కీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటి భళిరా • కట్టించి తౌ దృష్టి కే
దులఖా నోగ్రకపాల మర్థపహరి•ద్భూజాంగలశ్రేణికన్. 42

టీ. అలుకన్=కోపము చేతను, ఘోట...హాల్యన్ - ఘోటక=గుఱ్ఱములయొక్క, ధట్టికా=దండుయొక్క, ఖురపుటీ=దొప్పలవంటిగిట్టలనియెడు, హాల్యన్=నాగళ్లగుంపుచేతను, ఖురా...చ్ఛలు - ఖురాసాని=ఖురాసానిదేశస్థు లగుమ్లేచ్ఛులనియెడు, పుచ్ఛలు=పుచ్ఛచెట్లు, (ఖురాసానిపుచ్ఛ లనఁగాఁ దురకల కభీష్టము లైనయా దేశపుపుచ్ఛచెట్లనియును జెప్పవచ్చును), వోఁదున్ని=చెడఁదున్ని, చల...ప్లుతిన్ - చలత్=నడుచుచున్న, చమూ=సేనయందలి, గజ=యేనుంగులయొక్క, మదాసార=మదధారాసంపాతమనియెడుధారావర్షముచేత, ప్లుతిన్=తడుపుటచేత నయినపదనుచేతను, కీర్తి...స్యంబు - కీర్తి=యశస్సనియెడు, పుష్కల=సమృద్ధమగు, సస్యంబున్=పైరును, ఇడి=ఉనిచి, ఏకధాటిన్-ఏక=ముఖ్యమగు, ధాటిన్=దాడిచేతను, దృష్టికిన్=వెలిబొమ్మకొఱకు, ఏదు...లమున్ - ఏదులఖాన = ఏదులఖానుఁ డనుమ్లేచ్ఛునియొక్క, ఉగ్ర=భయంకరమగు, కపాలమున్=పునుకను, అర్థ...ణికన్-అర్థపదు పేరనియొక్క,హరిత్=దిక్కుయొక్క, భూ=భూమియందలి, జాంగల=మెట్టచేలయొక్క, శ్రేణికన్=పఙ్క్తియందు, కట్టించితౌ=కట్టించితివి, భళిరా=ఆశ్చర్యము.

తా. కృష్ణదేవరాయా! నీ వుత్తరదేశమందు గుఱ్ఱపు దండుతో వెడలి ఖురాసాను లనుమ్లేచ్ఛుల నశింపఁజేసి యచ్చట నీకీర్తి నిలిపి యేదులఖానుఁ డనుపేరు గల మ్లేచ్ఛునితల నటికి వ్రేలఁగట్టించితివి గావున నది యాదేశమందలి మొలపవేయఁబడిన నీకీర్తి యనెడుపైరుగల మెట్టచేలకు దృష్టిపరిహారార్థముగా నెత్తించిన తలపుఱియ వలె నుండెను; ఏమాశ్చర్యము!

చ. సుమతిపునఃపునారచిత•షోడశదానపరంపరావసం
తముల ననంతవిత్తము న•నంత ననంతమహోగ్రహోరబ్బం
దమును నొసంగుని న్గొలిసి • తా రెన రాక కదా నిలింపభూ
జములు వహించు దుర్యశము • షట్పదకోకిలకైతవంబునన్. 43

టీ. సుమ...ములన్ - సుమతి=మంచిమనస్సుచేతను, పునఃపునః=మాటిమాటికిని, రచిత=చేయఁబడిన, షోడశ...దానములయొక్క, పరంపరా=సమూహమనియెడు, వసంతములన్=వసంతకాలములయందు,అనం...మున్-అనంత=పారములేని, విత్తమున్=ధనమును, అనన్తున్=శేషునిని, అనంత...దమును-అనంత=

నశింపని, మహత్=గొప్పలగు, అగ్రహార=విప్రవృత్తులయొక్క, బృందమును=సమూహమును, ఒసంగు=ఇచ్చునట్టి, నిన్ను, ఒఱసి=కలహించి, తారు=తాము, ఎనరాకకదా=సరిరాకకదా, (అది హేతువుగా ననుట), నిలింపభూజములు = కల్పవృక్షములు, షట్ప...బునన్ - షట్పద = తుమ్మెదలనియెడు, కోకిల = కోయిలలనియెడు, కైతవంబునన్ = నెపముచేతను, దుర్యశమున్ = అపకీర్తిని, వహించున్ = మోయుచుండును.

తా. కృష్ణదేవరాయలు సేయు షోడశదానపఙ్క్తి యనువసంతకాలములయందు మిక్కిలి ద్రవ్యమును బుడమియు మహాగ్రహారము లొసంగఁగా వసంతకాలములయందు దాతృత్వమును వహించెడు కల్పవృక్షము లంతము లేనివిత్తాను లియ్యలేక తుమ్మెదలు కోయిలలు అనుమిషచేతను దుష్కీర్తి వహించెను. వృక్షములయీవి శాఖాంతములు లతాంతములు మొదలయినవి కావున ననంతములుగా నియ్యంజాల వనియును వసంతకాలములయందుఁ దుమ్మెదలు గోయిలలు వృక్షములమీఁదఁ జేరి యుండుట స్వభావసిద్ధం బగుటంజేసి యవి యపయశస్సూచకంబులై యున్న వనియు భావము.

తే. ప్రబలరాజాధిరాజవీ•రప్రతాప
రాజపరమేశ్వరార్థదు•ర్గానటేశ
సాహితీసమరాంగణ•సార్వభౌమ
కృష్ణరాయేంద్ర కృతి విని•ర్మింపు మనిరి. 44

టీ. ప్రబలరాజాధిరాజవీరప్రతాప, రాజపరమేశ్వరార్థదుర్గానటేశ, (ఇవి బిరుదాంకములు), సాహితీసమరాంగణసార్వభౌమ - సాహితీ=సాహిత్యమందును, సమరాంగణ=యుద్ధరంగమందును, సార్వభౌమ=చక్రవర్తివైన, కృష్ణరాయేంద్ర=కృష్ణరాయ భూపాలా, కృతి=ప్రబంధమును, వినిర్మింపుమనిరి=రచింపుమని చెప్పిరి.

తా. సులభము.

వ. అని విన్నవించినఁ బ్రహృష్టాంతరంగుండ నై. 45

టీ. అని=ఈవిధంబున, విన్నవించినన్ = మనవిచేయఁగా, (మహాప్రభు వగుటం జేసి పండితులును విన్నవించి రనుట), ప్రహృ...డనై - ప్రహృష్ట=సంతసించిన, అంతరంగుండనై=మనస్సు గలవాఁడనై యని ముం[illegible] దనమునులగోపిచందనపుంద్ర

షష్ఠ్యంత[illegible] దాము లాఁగికొని వీఁడు వంచి

కాశగంగాతీరములఁ జేయుచున్నసైకత

క. అంభోధికన్యకాకుచ, కుఁ[illegible]లగునచ్చరలగబ్బిగుబ్బలఁ బట్టి నలుపుచు [illegible]
జంభారిముఖాధ్యక్షున, [illegible]గావము. [illegible] 46

టీ. అంభోధి...నకున్ - అంభోధి=సముద్రునికి, కన్యకా=పుత్త్రికయగులక్ష్మి యొక్క, కుచకుంభ = కలశములవంటి కుచములయందు, ఉంభిత = పూయఁబడిన, ఘుసృణ=కుంకుమము చేత, మసృణ=స్నిగ్ధమగు, గురు=విశాలమగు, వక్షునకున్=వక్షస్స్థలముగలవానికిని, జంభారి...నకున్-జంభారి=దేవేంద్రుఁడే, ముఖ=మొదలగువారికి, అధ్యక్షునకున్=నాథుఁడగువానికిని, అంభోజాక్షునకున్ - అంభోజ=కమలముల వంటి, అక్షునకు=నేత్రములుగలవానికి, సామిహర్యక్షునకున్ - సామి = అర్ధభాగము, హర్యక్షునకున్=సింహమగువానికి, 'సామిత్వర్ధే' యనియమరము (నరసింహాకృతి కలిగినవాఁడనుట).

తా. సులభము.

క. మర్దితకాళియఫణికిఁ గ, పర్దభృదజబింబితాచ్ఛ•పదనఖఘృణికిన్
దోర్దండశార్ఙ్గకిణి కఘ, కర్దమదినమణికి దనుజ•కరివరసృణికిన్. 47

టీ. మర్ది...ణికిన్-మర్దిత=మర్దింపఁబడిన, కాళియ=కాళీయుఁడను పేరుగల, ఫణికి=సర్పముగలవానికి, (కాళీయుఁడను నాగేంద్రునిశిరస్సుమీఁదఁగృష్ణుఁడు తాండవముసలిపెననుట), కపర్ద...ణికిన్ - కపర్ద = జటాజూటమును, భృత్ = ధరించిన శివునిచేతను, అజ = బ్రహ్మదేవునిచేతను, బింబిత = ప్రతిఫలింపఁబడిన, అచ్ఛ = పరిశుద్ధములగు, పద=పాదములయొక్క, నఖ=గోళ్లయొక్క, ఘృణికిన్ = కాంతులు గలవానికి, (పంచాస్యచతురాస్యులువిష్ణునిపాదములకు నమస్కరింతురనుట), దోర్దండ...ణికిన్-దోర్దండ=దండమువంటి భుజమందలి, శార్ఙ్గ=శార్ఙ్గమను పేరుగల ధనస్సుయొక్క, కిణికిన్=కాయలుగలవానికి (శార్ఙ్గకోదండమునొఱయుటవలనఁ గాయలు గాచినబాహువు గలవాఁడనుట), అఘ...మణికిన్-అఘ=పాపములనెడు, కర్దమ=బురదకు, దినమణికిన్=సూర్యుఁడగువానికి, (అనఁగాసూర్యుఁడు బురదనెండించినట్లు పాపముల శోషింపఁ జేయువానికనుట), దనుజ...సృణికిన్-దనుజ=రక్కసులనియెడు, కరివర=గజశ్రేష్ఠములకు, సృణికిన్=అంకుశమగువానికిని.

తా. సులభము.

క. గుహాపుష్కరిణీతటఘన, గహనగుహాఖేటవంచ•కపులిందునకున్ ద్రుహిణాండతుందునకయా, వహదీర్ఘాపాంగకరుణ•వాస్యందునకు

జములు వహించు [illegible] పుష్కరిణీ=కుమారపుష్కరిణియొక్క, తట=

[illegible] టీ. సుష్టుయుగు [illegible] గుహా=గుహావంటివనమందు, ఆఖేట=వేఁటయందు, వంచకపులిందునకున్=[illegible] మగుపూగ [illegible] వానికిని, ద్రుహి...నకున్-ద్రుహిణాండ=బ్రహ్మాండములు, [illegible] అనుసూ [illegible] సంత కాల [illegible] గలవానికి, అయా...నకున్-అయ=శుభములను, ఆవహ [illegible] యను వచ్చినది. [illegible]=దీర్ఘ=వాలికలగు, అపాంగ=కడ

గన్నులయందు, కరుణవాః=దయారసముయొక్క, స్యందనస్ = జాలుటగలవాని
కిని, (నేత్రాంతములయందుఁ గరుణారసము దొరఁగుచున్నదనుట).

తా. సులభము.

క. బంధురరథాంగధారా, గంధవహాప్తజ్వలచ్ఛి•ఖాపటలపున
స్సంధుక్షణఘృతరాహుప, లాంధోఽసృక్స్రుతికి వేంక•టాచలపతికిన్.

టీ. బంధుర...తికిన్ - బంధుర = ఘనమైన, రథాంగ = చక్రముయొక్క, ధారా=అంచుయొక్క, గంధవహాప్త=వాయుసఖుఁడగునగ్నిహోత్రముయొక్క, జ్వలత్=మండుచున్న, శిఖా=జ్వాలలయొక్క, పటల=సమూహముయొక్క, పునస్సంధుక్షణ=పునస్సంధానకర్మయందు, ఘృత=ఆజ్యమైన, రాహు - రాహువనెడు, పలాంధః - పల=మాంసమే, అంధః=అశనముగాఁ గలరాక్షసునియొక్క, అసృక్=రక్తముయొక్క, స్రుతికిన్=స్రావముగల, వేంకటాచలపతికిన్ = వేంకటాచలరమణునకు, ఈవేంకటాచలపతికి ననువిశేష్యమునకుఁ బూర్వోక్తములగు షష్ఠ్యంతశబ్దములు విశేషణములు.

తా. సుదర్శన చక్ర ధారాగ్నియందు రాక్షసులను హోమము చేయుటి కా యగ్నియొక్క పునస్సంధాన కర్మమునందు రాహువు యొక్క కంఠ రక్త స్రావ మాజ్యమై యుండెను.

## కథా ప్రారంభము.

వ. నా విన్నవింపం బూను నాముక్తమాల్యదామహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. 50

టీ. నావిన్న...నకున్ - నావిన్నవింపంబూను=నేనురచించి మీకు విన్నవించుకొనఁదలఁచిన, ఆముక్త...నకున్ - ఆముక్త = అనుభవించివిడువఁబడిన, మాల్య=విరులసరాలను, దా=ఇచ్చినచూడికుడుత్తనాంచారను నామె కథ కలిగిన యీ ప్రబంధమునకు, కథాక్రమంబు, ఎట్టిదనినన్=ఎటువంటిదనఁగా.

తా. సులభము.

మ. లలితోద్యానపరంపరాపికశుకా•లాపప్రతిధ్వానము
*ల్వాలభీనీలహరిన్మణీపికశుక•స్వానభ్రమం బూన్పు మి
న్నులతో రాయుసువర్ణసౌధ...
విలుబుత్తూరు సెలంగు...శగంగాతీరములఁ జూడఁ జన ...ండది శ్రీ
...గునచ్చరలగబ్బిగుబ్బలఁ ...న్న సీమంతమై. 51

* బలభిన్నీల.
...ావము.

టీ. శ్రీవిలుబుత్తూరు = శ్రీవిల్లిపుత్తూరనుపట్టణము, పాండ్య...సీమంతమై - పాండ్య=పాండ్యదేశమండలి, నగర=పట్టణమగుమధురయొక్క, ఉర్వీ=భూమికి, రత్నసీమంతమై=మానికపుఁబాపటబొట్టై, లలితో...మల్-లలిత = ఒప్పుచున్న, ఉద్యాన=ఎలదోఁటలయొక్క, పరంపరా=గుంపులయందలి, పిక=కోయిలలయొక్కయు, శుక=చిలుకలయొక్కయు, ఆలాప=పలుకులయొక్క, ప్రతిధ్వానములు=ప్రతిధ్వనులు, వలభీ...భ్రమంబు-వలభీ=ముంజూరులయందలి, నీల=నీలములయొక్కయు, హరిన్మణీ=గరుడపచ్చలయొక్క, పిక=కోయిలలయొక్కయు, శుక=చిలుకలయొక్కయు, స్వాన=పలుకులయొక్క, భ్రమంబు=భ్రాంతిని, ఊన్పన్=వహింపఁజేయఁగా, మిన్నులతోన్=ఆకాశముతో, తాయు=ఒఱయుచుండెడు, సువర్ణసౌధములన్=బంగరుమేడలచేతను,ఎందుఁజూడన్=ఏదిక్కునఁ జూచినను, చెన్నొందు=శృంగారమై, చెలంగున్=ప్రకాశించును. (విల్లిపుత్తూరు అనుటయే సాధువు).

తా. పాండ్యదేశమండలి భూమి యనెడు నాతికిఁ బాపట బొట్టువోలె నొప్పుచున్న శ్రీవిల్లిపుత్తూరు సమీపమునందుండు నుద్యానములలోని కోయిలలు చిలుకలు గూయుచుండఁగా వాని కామేడలు ప్రతిధ్వనులు సేయఁగా నప్పట్టణ వీథులలో నేఁగెడు మార్గస్థులు తల లెత్తి చూడఁగా నత్యున్నతము లగు మేడలయొక్క వాచూరులయందు నీలములతోఁ జెక్కఁబడియున్న కోయిలలును మరకతంబులచేఁ జెక్కఁబడిన చిలుకలును గానరాఁగా నీపక్షులే యాధ్వనులు సేయుచున్న వన్నట్లుండు ననియును నావిల్లిపుత్తూరిలోని బంగారుమేడలు మిన్నంటి యున్న వనియును భావము.

చ. మలఁచి పయోజకోశముల•మాడ్కి నొనర్చినపద్మరాగపుం
గలశపుటెట్టిడాల్బొమిడి•కంబులతో నపరంజియోడుబి
ల్లల నలవైజయంతముఁ జ•లంబునఁ గెల్వఁగ దంశితంబులై
నిలిచినయట్లు మాడువు ల•నేకము లుల్లసిలున్ బురంబునన్. 52

టీ. మలఁచి=తొలిచి, పయోజ...మాడ్కిన్-పయోజ=కమలములయొక్క, కోశములమాడ్కిన్=మొగ్గలవలెను, ఒనర్చిన=చేసినట్టి, పద్మ...లతోన్-పద్మరాగపున్=కెంపులయొక్క, కలశపు=కలశములనియెడు, ఎట్టిడాల్ = రక్తకాంతిగల, బొమిడికంబులతోన్=శిరస్త్రాణములతో, (ఇచ్చటఁ బద్మరాగపుంగలశపుటెట్టిడాలనుచోటను, 'నుమ్బోచ్ఛతః' అనుసూత్రమువలనం బవర్ణగతం బగుననుకారంబునకం టెఁబరంబున నుమాగమరూప మగుపూర్ణ[illegible], 'సామానాధికరణ్యేషూపవంతానాం టుగాగమోఽచిస్యాత్' అనుసూ[illegible]గలశశబ్దసంబంధి యగుపువర్ణమునకుఁ బరమందు టుగాగమంబును వచ్చినది. [illegible]జియోడుబిల్లలన్=మేలివన్నెబంగారు

కప్పుబిళ్లలచేతను, అల = ఆప్రసిద్ధమగు, వైజయంతమున్ = ఇంద్రసౌధమును, చలంబునన్ = చలముచేతను (ఇచ్చటఁ దృతీయార్థమున సప్తమి.) గెల్వఁగన్ = గెల్చుటకు, దంశితంబులై = మైమఱువులు దొడగినవై 'దంశితో వ్యూఢకంకట' యని యమరుఁడు. నిలిచినయట్లు = నిలిచియున్నవనఁగా, మాడువులు = గృహములు, అనేకములు = పెక్కులు, పురంబునన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, ఉల్లసిలున్ = ప్రకాశించును.

తా. శ్రీవిల్లిపుత్తూరియందలి గృహములు తమపైనఁ దామరమొగ్గలవలె మలఁచియున్న కెంపుల కలశములనెడు నెఱ్ఱమంటి శిరస్త్రాణములు గలిగి బంగారుచేతఁ జేయఁబడిన యోడుబిళ్లలనెడు కవచముఁ దొడిగి స్వర్గమందలి ఇంద్రుని మేడయగు వైజయంతముతో యుద్ధము చేయుటకు సిద్ధపడి నిలిచియున్నట్లుండు నని భావము. యుద్ధసన్నద్ధులెఱ్ఱమట్టివస్త్రములు తలలకుఁ గట్టుకొని కవచములు దొడిగికొనుట ప్రసిద్ధము.

సీ. పాథోధి జలయుక్తిఁ • బ్రాఁచివట్టిన దిశా,
కరులు నాఁ దగు మర•కతపుఁ గరులు
గరులతొండము సిక్కఁ• గబళించి మ్రింగిన,
హరులు నాఁ దొండ మొ•ప్పగుఁ దదశ్మ
హరులఁ దాపిన తావ • లమర నేనికదోయి,
నీరార్చు నపరంజి•నీటి వ్రాఁత
శ్రీలుఁ దత్పార్శ్వచి• త్రితశంఖచక్రముల్,
రత్నపుఁదిన్నెలఁ • బ్రతిఫలింపఁ
తే. బెఱపురాళి గృహశ్రీలఁ • బెండ్లియాడ
భవనరాజులు గట్టిన•బాసిక మనఁ
దనరు మణితోరణములతో • ద్వారవితతిఁ
బరఁగు వీథులు పురిసూత్ర•పట్టినట్లు. 53

టీ. పాథోధిజలయుక్తిన్ - పాథోధి = సముద్రముయొక్క, జల = జలము యొక్క, యుక్తిన్ = సంయోగముచేతను, ప్రాఁచివట్టిన = పాఁకుడుపట్టిన, దిశాకరులు నాన్ = దిగ్గజములనఁగా, తగు = తగునట్టి, మరకతపుఁగరులు = పచ్చలయేనుఁగులును, కరులతొండముసిక్కన్ = ఏనుఁగులతుండముమాత్రము మిగులునట్లు, కబళించి = ఆహారించి, మ్రింగిన = మ్రింగినట్టి, హరులు నాన్ = సింహము లనునట్లు, తొండమొప్పగు = తొండముచేఁ బ్రకాశించుచున్న, తదశ్మ = అమరకతవికారములగు, హరులన్ = సింహములను, తాపిన = చెక్కిన, తావలు = సోపానములు, అమరన్ = అమరుచుండఁగా, ఏనికదోయి = గజద్వంద్వము, నీరార్చు...శ్రీలు-నీరార్చు = స్నానముచేయించె

డు, అపరంజినీటి=బంగారునీటియొక్క, వ్రాఁత = చిత్తరువుయొక్క, శ్రీలు=లక్ష్మీప్రతిమలు, తత్పార్శ్వ...ముల్-తత్పార్శ్వ=ఆప్రతిమల యుభయపార్శ్వములయందు, చిత్రిత = చిత్రింపఁబడిన, శంఖచక్రముల్=శంఖచక్రములును, రత్నంపుఁదిన్నెలన్ = రత్నమయములగు వేదులయందు, ప్రతిఫలింపన్=ప్రతిబింబింపఁగా, పెఱ...శ్రీలన్-పెఱ = ఇతరములగు, పురాళి=పట్టణసమూహముయొక్క, గృహశ్రీలన్ = గృహసంపద లనియెడుస్త్రీలను, పెండ్లియాడన్=వివాహమగుటకు, భవనరాజులు=తత్పురగృహము లనురాజులు, కట్టిన=కట్టుకొన్న, బాసికమనన్ = పట్టబంధ మనునట్లుగా, తనరు = ప్రకాశించుచున్న, మణితోరణములతోన్ = మాణిక్యతోరణములతోఁగూడిన, ద్వారవితతిన్ = ద్వారసమూహముచేతను, వీథులు, పురిన్=శ్రీవిల్లిపుత్తూరియందు, సూత్రపట్టినట్లు=సూత్రముపట్టినట్లుగా, పరఁగున్=ఒప్పును. సూత్రపట్టినట్లన్నచోట, శ్లో. 'అదంతపాది శబ్దేచ పత్యర్థే బిందులోపకౌ, వర్ణకస్యాత్రకథితౌ క్వచి త్సుకవి సమ్మతేః' అని యథర్వణాచార్యసూత్రము ప్రమాణము.

తా: అష్టదిగ్గజము లెల్లప్పుడు సముద్రోదకములయందే యుండుటవలనఁ బ్రాఁచిపట్టిన వన్నట్లు తోఁచెడు పచ్చఱాతియేనుంగులును ఆయేనుంగులతుండము మాత్రము గనఁబడుచుఁ దక్కిన శరీరము గానరాకుండుటం జేసియును, నల్లతుండంబులు పచ్చఱాతిసింహముల నోళ్లలోనుండి వెడలినట్లుండుటంజేసియును, ఏనుంగుల శరీరమెల్లను మ్రింగి తుండంబుల మిగిలించినట్లు కనుపడు సింహంబులను జెక్కిన పలుకఱాలు వెనుకదిక్కునఁ బ్రకాశించు ననియును, ఇట్టిసోపానములకుఁ బైఁగా గోడలయందు లక్ష్మీదేవి కభిషేకముఁ జేయుచున్న ట్లపరంజినీటితోఁ జిత్రింపఁబడిన యాలక్ష్మీప్రతిమలును గజంబులును లక్ష్మీప్రతిమల యుభయపార్శ్వములయందలి శంఖచక్రములును దిగువను రత్నమయవేదికలయందు నీడలు దోఁచుచుండఁగా బ్రతియింటివాకిట మణితోరణములు ప్రకాశింపఁగా నాగృహరాజంబు లితర పట్టణ గృహశ్రీలను వివాహముఁ జేసికొనుటకుం గట్టికొన్న బాసికము లనున ట్లొప్పుననియును వీథులు వంకరలు లేక సూత్రము పట్టి కట్టినట్లు వంకరలేక ప్రకాశించుచుండును.

చ. పగడపుఁజాయ చెందిరముఁ • బ్రామిన పాండ్యవధూకుచంబులన్
నగునరుణంపుఁబొండ్లముల • నారికెడంబులు వజ్రకుట్టిమం
బగు పథముం జెలంగు భవ•నాహృతశేషితరత్నరక్షక
ప్రగతరుసంతతిం బ్రథమ•భార్యఁ బురిన్ గెలువుంచె వార్ధినాన్. 54

టీ. పగడ...మున్-పగడపుఁజాయ=విద్రుమకాంతిగల, చెందిరమున్=కుంకుమమును, ప్రామిన...బులన్-ప్రామిన = అలఁదినట్టి, పాండ్యవధూకుచంబులన్=పాండ్యదేశస్త్రీలగుబ్బలను, నగు...బులు-నగు=పరిహసించుచున్న, అరుణంపు=ఎఱ్ఱ

నగు, బొండ్లములు = పైపేఁచు ఒలువనికాయలు గల, నారికేళంబులు = నారికేళపు మాఁకులును, వజ్ర=వజ్రములచేతను, కుట్టిమంబగు=గట్టింపఁబడిన,పథముల్ = మార్గము ను(ప్రథమాంతమమీఁద ప్రుతమ సముచ్చయార్థకము.) భవనాలి = భవన=గృహ ములకొఱకు, అహృత=వ్యయముఁ జేయఁబడినవానినుండి, శేషిత - మిగిలింపఁబడిన, రత్న=రత్నములయొక్క, రక్షకున్ = కాపాడుటకు, వార్ధి=సముద్రుండు, అభ్రగ = ఆకాశగతములగు, తరు=వృక్షములగు మందారాదులనియెడు, సంతతిన్=సంతాన మును, ప్రథమభార్యన్=మొదలిపెండ్లామగు గంగానదిని, పురిన్ = శ్రీవిల్లిపుత్తూరి యందు, గిఱవుంచెనాన్=కుదువయుంచె ననునట్లు, వెలంగున్ = ప్రకాశించును.

తా. శ్రీవిల్లిపుత్తూరిలో నుండెడుగృహములు రత్నమయములైనవి గావున నా గృహములకు వినియోగము కాఁగా మిగిలినరత్నములను గాపాడవ నని రత్నాకరుం డగుసముద్రుఁడు పూటపడి యారత్నములు తీసికొని యాగులకై తనసంతాన మగు కల్పవృక్షములను పెద్దభార్య యగుగంగను దత్పట్టణమునందుఁ గుదువ యుంచెనో యన్నట్లు సంతత మెడతెగని యెత్తునిబొండ్లములతోడ నారికేళపుమాఁకులును వజ్ర ములచేత గట్టింపఁబడిన రాజమార్గమును ప్రకాశించును. నారికేళములు కల్పవృక్షము లవలెను మార్గము తెల్లనికాంతి గలిగి యుండుటంజేసి గంగానదియుఁబోలె నలుంగగు చున్నకతంబున నట్లుత్ప్రేక్షింపఁ బడియెను.

క. కోరకితనారికేళ
క్ష్మారుహములు రత్నకుట్టిమంబులఁ దోఁచున్
ద్వారములయత్నకృతశృం
గారంబుగ నలికి ముగ్గు ఘటియించి రనన్. 55

టీ. ద్వారములు = వాకిళ్లు, కోరకిత = సంజాతకోరకములు గల, నారికేళ క్ష్మారుహములు= టెంకాయమాఁకులు, రత్నకుట్టిమంబులన్=రత్నములచేఁ గట్టిం పఁబడిన భూములయందు, అయత్నకృత=యత్నముచేతఁ జేయఁబడని, శృంగారంబు గన్=శృంగారము గలుగునట్లు, అలికి=గోమయలిప్తముఁజేసి, ముగ్గుఘటియించిరనన్ =రంగవల్లిక యుంచి రనునట్లు, తోఁచున్=ప్రతిబింబించును.

తా. శ్రీ విల్లిపుత్తూరిలో వాకిళ్లముందటి రత్నమయము లైనభూములయందు మొగ్గలు పచ్చనియాకులు గల నారికేళములు ప్రతిఫలింపఁగా నా యిండ్లవారు యత్న ముచేత సింగారింపకయే శృంగారము గలుగునట్లు అలుకునట్లు యలికినట్లును మొగ్గల నీడ ముగ్గులు పెట్టినట్లు నుండె నని భావము.

మ. శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్ • జన్దోయి లేఁగౌనుపై
దయఁ దప్పన్ బస పాడి పాగడపుఁబా•దంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుత మజ్జనార్థము కటిం • గీలించి దివ్య ప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రు•ద్యానంపులోఁద్రోవలన్.

టీ. చెంగల్వడిగ్గియన్ = ఎఱ్ఱకలువపూలు గలకొలనియందు, పసపాడి = హారిద్రాలేపపూర్వకముగా స్నానముఁజేసి, అచ్యు...ర్థము-అచ్యుత=శ్రీపతియొక్క, మజ్జనార్థము=అభిషేకముకొఱకు, నీరు=తీర్థము, కటిన్=ఒండియందు, కీలించి = ఉనిచికొని, శయ = హస్తమందలి, పూజాంబుజముల్=పూజకొఱకైన కమలములు, ఘటిన్=తీర్థపుబిందెయందు, తడఁబడన్=తొట్రుపడుచుండఁగా, చన్దోయి=కుచద్వంద్వము, లేఁగౌనుపైన్=లేఁతనడుముమీఁద, దయతప్పన్=కృపాహీన మగుచుండఁగా, దివ్య...స్యల్-దివ్యప్రబంధ=ద్రావిడప్రబంధముతోడ, యుక్=కూడికొన్న, ఆస్యల్=వక్త్రములుగల, ద్రవిడాంగనల్=ద్రావిడస్త్రీలు, ఉద్యా...లన్-ఉద్యానంబు=ఎలదోఁటయొక్క, లోఁద్రోవలన్=అంతర్మార్గములయందు, పాగడపుఁబాదంబు=పాదకటకము లనియెడుభూషణము ధరించినపాదము, ఒప్పన్=ఒప్పుచుండఁగా, నడుతురు=వత్తురు.

తా. విల్లిపుత్తూరియందలి ద్రవిడస్త్రీలు ఉద్యానంబులలోని చెంగలువలుగల కొలఁకులలోఁ బసపుతో స్నానముఁ జేసి స్వామి తిరుమజ్జనము నిమిత్తము తీర్థంపుబిందె యాదేశాచారరీతిగా ఒండియందు ధరించి తమహస్తములయందు నాళములు గలిగి పూజార్థము లైనకమలములు తద్ఘటములయందుఁ దొట్రిల్లుచుండఁ గుచభారముచే లేఁతనడుము లసియాడుచుండ దివ్యప్రబంధానుసంధానముఁ జేయుచు నుద్యానంబుల లోపలిత్రోవలయందుఁ బావడాలు ధరించినపాదములు గదల నడుచుచుందు రనిభావము.

మ. కలయన్ నీలమయంపుఁదల్లి యొఱదాఁ•కం దేటనీరొప్పు ర
థ్యలకూపంబుల మీలఁ జూచి వలభీ•వ్యాసంగితుంగ ద్రుశా
ఖలలో *డాఁగి గుభాలనన్ లకుముకుల్ • క్రందై పడున్ లేచు ము
చ్చిలి గేహేందిర ద్రావిడీపరిచితిన్ • జెండాడుచందంబునన్. 57

టీ. గేహేందిర=గృహలక్ష్మి, ద్రావి...తిన్-ద్రావిడీ=ద్రవిడస్త్రీలయొక్క, పరిచితిన్=పరిచయముచేతను, ముచ్చిలి=వంచించి (ఎవ్వరికిని గనుపింపకయనుట), చెండా...నన్-చెండాడు=కందుకక్రీడ సలిపెడు, చందంబునన్=రీతిచేతను, లకు

* నాఁడి గబా.

ముకుల్=పక్షివిశేషములు, కలయన్=నిండునట్లుగా, నీలమయంపు-నీలమణివికారమగు, తల్లియొఱదాఁకన్=బొడ్డుటొఱదనుకను (పైనుండెడు పెద్దయొఱయనుట), తేటనీరు=నిర్మలోదకము, ఒప్పన్=ఒప్పుచున్న, రథ్యలకూపంబుల=వీథులబావులయందలి, మీలన్=మీనములను, చూచి=ఈక్షించి, వలభి...లోన్-వలభి=చూరులయందు, వ్యాసంగి=కూడియున్న, తుంగ=పొడవులగు, ద్రుమ=వృక్షములయొక్క, శాఖలలోన్=కొమ్మలలో, డాఁగి=పొంచి, గుభాలనన్=గుభా లనుశబ్దము గలుగునట్లు, క్రందై=సందడించి, పడున్=దుముకును, లేచున్=మరల నుద్గమించును.

తా. వీథులలోని యొఱలబావులలోఁ దల్లియొఱవఱకుఁ బైని నిండి యున్న తేటనీటిలోఁ గనఁబడుచున్న చేఁపలను జూచి యిండ్లచూరులవెంబడి వ్యాపించియున్న పెద్దపెద్ద తరుశాఖలయందు పొంచియుండి యాబావులలో దుముకుచు లేచుచున్న లకుముకిపిట్టలు ద్రవిడస్త్రీపరిచయము గలిగిన గృహలక్ష్మి తన [illegible] రహస్యముగాఁ జెండు గొట్టుచుండఁగా నట్టి పుట్టచెండ్లవలె నుండెనని తాత్పర్యము. లకుముకులు చేఁపల బట్టికొనుటకు నీట దుముకుట ప్రశస్తము.

మహాస్రగ్ధర. స్వనిలింపావాసదత్త్వాశనదతలమిథస్తారతమ్యంబు లీరెం
డును దీనుల్గాంచునమ్మాడువులనడుగం దోఁచునుద్యద్రథోన్మే
శనసిద్ధద్వంద్వబృందాలయ తటబిల కల్యాణమంథాద్రులో నా
వనజాక్షస్యందనద్వంద్వము లిఖితనరావాప్తదాంపత్యమొప్పన్.

టీ. లిఖిత...త్యము-లిఖిత=చిత్రింపఁబడిన, నర=మనుష్యప్రతిమలచేత, అవాప్త=పొందబడిన, దాంపత్యము=మిథునములుగల, వనజాక్షస్యందనద్వంద్వము-(వనజాక్షీచ-వనజాక్షశ్చ-వనజాక్షౌ - వనజాక్షయోస్స్యందనే-తయోర్ద్వంద్వం- 'పుమాన్ స్త్రియా' యను సూత్రమువలన స్త్రీవాచక మగువనజాక్షీశబ్దము లుప్తమై పురుషవాచక మగువనజాక్షశబ్దమాత్రము శేషించుటంజేసి యట్టిరూపంబు వచ్చెం గావున), వనజాక్ష=శ్రీశ్రీపతులయొక్క, స్యందన=తేరులయొక్క, ద్వంద్వము=జోడు, స్వనిలింపా...బులు-స్వ=తమయొక్క, నిలింప=దేవతలకు, ఆవాస=నివాసముయొక్క, దత్త్వ=ఇచ్చుటయొక్కయు, అశన=ఆహారముయొక్క, దతల=ఇచ్చుటయొక్కయు (ద్వంద్వాంతమున బహుత్వము), మిథః=ఒండొంటియొక్క, తారతమ్యంబులు-ఎచ్చుదగ్గులు, ఈరెండును=ఈయశనవాసములు, దీనుల్గాంచు=కీర్తులుపొందుచున్న, అమ్మాడువులన=అమాడుగులనే (అమాడుగులయందు నివాసభుక్తిదానములు విస్తరించి కలవనుట). (మఱియు క్వచిద్దకారో వ యనుసూత్రము కనిమింజేసి మాడుగులు మాడువులనియునుం గలదు). అడుగన్=వేఁడుకొనుటకు, తోఁచు...ద్రులో నా-తోఁచు=కానఁబడుచున్న, ఉద్యత్=ఒప్పుచున్న, రథ=[illegible], ఉన్మేశన=

కూటములుగల, సిద్ధ=సిద్ధులను దేవయోనులయొక్క, ద్వంద్వ=మిథునములయొక్క, బృంద=సమూహములకు, ఆలయ=నివాసస్థానములగు, తట=దరులును, బిల=గుహలునుగల, కళ్యాణమంథాద్రులో=హేమాద్రి మందరాద్రులో, (మేరుమందరపర్వతములో యనుట. కళ్యాణమన బంగారము, మంథమనఁ గవ్వము గాన నాకళ్యాణమంథశబ్దము లద్రిశబ్దముతోడ సంబంధించి ద్వంద్వాంతమందు బహువచన మగుచున్నది). నాన్=అనునట్లు, ఒప్పున్=ప్రకాశించును.

తా. మానవ దంపతులరూపములుగాఁ జెక్కఁబడిన బొమ్మలు గల శ్రీశ్రీపతుల రెండుతేరులు దేవతలకు నివాస మిచ్చిన మేరుపర్వతమును నాహార మగునమృత మిచ్చిన మందరపర్వతమును దమతమ పుణ్యతారతమ్యముల నడిగి తెలిసికొనవలయు నని వచ్చి శ్రీవిల్లిపుత్తూరిలో దీనులకు నివాసంబులును నాహారంబు లిచ్చెడు నాగృహములదగ్గఱఁ జేరి తమ దరులయందును గుహాలయందును సురతములయందు ననురక్తులగుసిద్ధమిథునములతోడ నున్నవో యన్నట్లు ప్రకాశించుచున్న వని భావము. తేరుల మీఁదిబొమ్మలు సిద్ధదంపతులంబోలె నున్నవి. ఈపద్యమునందు దీనుల్గాంచు ననుచోట మిన్నుల్గాంచు ననియుఁ గొందఱు చదువుదు రచ్చట నాకాశమునొఱయుచున్న యమ్మాడువు లని యన్వయింతురు.

సీ. నవలయధ్వని గాఁగ • సాలిఁ వ్రేయు నదల్పు,
యతి నైన గుండె ఝ•ల్లనఁ గలంప
సుడిసిన మొగమెత్తి • చూడకుండు పరాకు,
కుసుమబాణుని నైనఁ • గువిటుఁ జేయ
శ్రీకార్యపరులఁ గాం•చిన లేచిమ్రొక్కు నం,
జలికి నింద్రుండు న•క్కొలువుఁ గోర
హారిగృహావసరశం•ఖాకర్ణనకుఁ ద్రిప్పి
కడగంటిజిగిఁ బ్రజఁ • గాఁడిపాఱఁ
తే. గవఱ లుంకించి వ్రేయఁ గొ•ప్పవి య నవలి
కరమున నమర్పఁ బైఁటలో • మరుని బటువు
బిల్లక్రియఁ బట్టుకంచులఁ • బిగువు చన్ను
నిక్కఁ దిన్నెలఁ బాత్రముల్ • నెత్తమాడు. 59

టీ. నవలయధ్వనిగాఁగన్=కంకణధ్వనికలుగునట్లుగా, సాలిఁ వ్రేయు=పాచికవేసెడు, అదల్పు=అదలించుట, (ఇచ్చట సారెవ్రేయునదల్పని కొందఱందురు గాక. యది ఎకారయుతరేఫాంతశబ్దమయ్యె నేని దానిబహువచనమందు సారెలని నిల్వ

వలయు నట్లుగాక మహాభారతంబున నడ్డసాళ్లనియు నడ్డసాగులనియుఁ బ్రయోగంబు కలిమిం జేసి యిచ్చట నికారయుత లకారాంతశబ్దముగా నుండుటయే సమీచీనంబు.) యతిసైనన్=సన్న్యాసిసైనను, గుండెఝల్లనన్=హృదయము జలదరింపఁగా, కలంపన్=కలుషముఁజేయుచుండఁగా, సుడిసినన్=ఎదురైనప్పుడు, మొగమెత్తి=ముఖము పైకెత్తి, చూడకుండు=ఈక్షింపకుండెడు, పరాకు=గరువచందము, పసుపుబాణునినైనన్=పూవిలుతుసైనను, కువిటుఁ జేయన్=నీచవిటునిఁజేయఁగా, శ్రీకైంకర్యపరులన్=భగవత్కైంకర్యపరులను, కాంచినన్=చూడఁగానే, లేచి=ప్రత్యుత్థానముఁజేసి, మ్రొక్కు=మ్రొక్కెడు, అంజలికిన్=దోసిలికై, ఇంద్రుఁడున్=దేవేంద్రుఁడును, అక్కొలువున్=ఆభగవత్కైంకర్యమును, కోరన్=అపేక్షింపగా, హరి...సమున్=హరి=స్వామియొక్క, గృహ=ఆలయమునందలి, అవసర=ఆయాసమయములయొక్క, శంఖ=శంఖనాదముయొక్క, ఆకర్ణనమున్=వినుటచే, త్రిప్పు=మరల్పుచు, కనుగంటి=నేత్రాంతములయొక్క, జిగి=బెళుకు, ప్రజన్=చూచెడువారిని, కొఁడిపోఁగన్=ఈడ్చిపోవఁగా,(అంత వాఁడియనుట.) కవటులు=అడ్డసాళ్లు, ఊంకించి=కుప్పించి, వ్రేయన్=వ్రేయఁగా, కొప్పవియన్=తురుము వదలఁగా, అవలికరమునన్=రెండవహస్తముచేతను, అమర్పన్=సవరింపఁగా, పైఁటలోన్=పైయెదలోపలను, మరుని=స్మరుని యొక్క, పటువుబిల్లక్రియన్=లోఁడక్రింద నునిచికొను చుట్టుదిండువలెను, పట్టుకంచలన్=పట్టురవికయందు, బిగువుఁజన్ను=బటువుగుబ్బ, నిక్కన్=నిట్టవొడువఁగా, పాత్రములు=వేశ్యాంగనలు, తిన్నెలన్=వేదికలయందు, నృత్తము=నృత్యమును, ఆడున్=క్రీడింతురు.

తా. ఆశ్రీవిల్లిపుత్తూరియందు నరుఁగులమీఁద వేశ్యాకాంతలు యతీశ్వరుని హృదయమైన గలంగునట్లు విలాసము గలిగి యదలించి కంకణములు కదలి ధ్వని సేయునట్లు పాచిక వ్రేయుచును, మఱియు నెట్టివారదటికి వచ్చినను మొగమెత్తి చూడక పరాకుఁ జేయుచు గరువము గలిగియును స్వామి యాలయము కైంకర్యముఁ జేసెడువారిఁ జూచినమాత్రముననే లేచి మ్రొక్కుచుండఁగా నట్టి మ్రొక్కు తనకుఁ గలుగ వలయునని దేవేంద్రుఁడును స్వర్గమందలి యప్సరోగణముల కొల్వు గలప్రభుత్వము నైన మాని యాదేవాలయమందుఁ దానొక్కసేవకుఁడై యుండవలయు నని కోరుచుండఁగా నట్టిసౌందర్యము గలిగి యప్పుడప్పుడు స్వామి యాలయమునందలి కొలువుల సమయములలోని శంఖనాదములు వినఁగానే చదరచదర చూచుచును పాచికలాట నిలఁజేసి దొరలింపఁగాఁ గొప్పు వీడఁగా నాటయందలి త్వరవాటుచేతను రెండవచేత నాకొప్పు సవరించుటకుఁ జేయెత్తినప్పుడు పైటలోని పట్టురవికలో నిక్కి వొడిచెడు బటువుగుబ్బ కానరాఁగా నిట్టివిలాసములు గలిగి నగడసాలాడుదురని భావము.

సీ. వీడెంపుఁ *బలుకెంపు • విరిసి వెన్నెల గాయ,
వరిగింజ నొకటఁ బ•ల్వరుసఁ దోమ
నొఱసి యొత్తినమఱుం • గొందక మేన ని,
గ్గులు దేఱఁ బస పాడి • జలక మాడ
ముదుక గాకుండఁ బ•య్యెదలోనె గే లార్చి,
కలయ †నొంటను జంటఁ • గలప మలఁద
రతి రయచ్ఛిన్నసూ•త్రమునఁ జిక్కక ముత్తె,
ములు రాల గఱగఱి•కలు వహింప
తే. నొలసినను నెట్టినరునైనఁ • గులముఁ దెలియఁ
బ్రభుత సెడి పల్లవుఁడు పేద • వడిన నేఁద
నృపతి వెలి యంతిపురముగా • నెన్న మెలఁగ
బాసఁ గృతిఁ జెప్పవలఁతు • లప్పద్మముఖులు. 60

టీ. వీడెంపుఁబలుకెంపు=తాంబూలసంబంధియగు నరుణకాంతి, విరిసి=విచ్చిపోయి, వెన్నెలగాయ=శుభ్రవర్ణమేర్పడఁగా, వరిగింజనొకటన్=ఒక్కశాలిబీజముచేతనే, పల్వరుసన్=దంతపంక్తిని, తోమన్=ధావనముఁజేయుటకును, ఒఱసియొత్తినన్=ఱాచియద్దినను, మఱుంగొందక=తెలివలుపనంటక, మేనన్ = శరీరమందే, నిగ్గులుదేరన్=మిసిమిగనుపించునట్లు, పసపాడి=పసపుఁబూసికొని, జలకమాడన్=స్నానముఁజేయుటకును, ముదుకగాకుండన్ = ముదుగుఁదనములేకుండ, పయ్యెదలోనన్=పైఁటలోనే, కేలార్చి=హస్తమాడించి, కలయన్=వ్యాపించునట్లు, ఒంటన్=ఒడలియందును, చంటన్=కుచములయందును, కలపములఁదన్=కదంబముఁబూయుటకును, రతి...మునన్-రతిరయ=పురుషాయితసురతవేగముచే, ఛిన్న=త్రెస్సిన, సూత్రమునన్=త్రాటియందు, చిక్కక=చిక్కుపడక, ముత్తెములురాలఁగన్=మౌక్తికములు రాలుచుండఁగా, గఱగఱికలు=సొగసులను, వహింపన్=తాల్చుటకును, ఒలసినను=సమీపించినను, ఎట్టినరునైనన్ = ఎంతధనరూపాదులు గలవానినైనను, కులముఁదెలియన్=వర్ణ మడిగి తెలిసికొనుటకును, ప్రభుతసెడి=ప్రాభవములేక, పల్లవుఁడు=తనమునుపటివిటకాఁడు, పేదపడినన్=దరిద్రుఁడైనను, ఏఁదన్=పోషించుటకును, నృపతివెలియంతిపురముగాన్=నరపాలునియొక్క బహిర్గతమైన మఱియొక్కయంతఃపురమనఁగా, ఎన్నన్=గణింపఁగాను, మెలఁగన్=సంచరించుటకును, బాసన్=ప్రతిభాషయందును, కృతిఁజెప్పన్ = ప్రబంధనిర్మాణముఁ జేయుటకును, అప్పద్మముఖులు=

* నునుగెంపు. † జంటను నొంట.

ఆవారవనితలు, వలఁతులు = సామర్థ్యముగలవారు, వలఁతు లనుపదము పల్వురుసఁదోమ ననునది మొదలుగాఁ గృతిఁజెప్ప ననుదానివఱకు నెనిమిదిపనులకు నన్వయించుచున్నది.

తా. విడియము పెక్కుమాఱులు నమలుటం జేసి మిక్కిలి కెంపెక్కిన తమ దంతములయందలి యరుణిమ పిరిసి తెల్లనగున ట్లావారవనిత లొక్కొకరిగింజచేత నే దంత ధావనముఁ జేయుదు రనియును, స్నానముఁ జేయునప్పుడు పూసికొన్న పసపు పరీక్షకైనను దెల్లనివస్త్రముతో జాచినను వస్త్రము నంటక వారి మేన్లెను లందే నిగనిగ లాడుననియును, వారు చనుగవ బయల్పడనీక పైఁటలోన కాశ్మీర కస్తూరీ కర్పూరములు మొదలగు వాసనలు గల కదంబము మిక్కిలి పలుచనఁగాఁ బూసి కొనుదు రనియును, సురతమందు తమహారముల ముత్తియంబులు తెగిన సూత్రంబున నుండక పఱువెత్తు నంత వడిగా నుపరతిఁ జేయుదు రనియును, ఎట్టిసొగసుఁడైన నెట్టిధనికుఁడైనఁ దమ్ము వలచెనేని యతని కులము తెలియక కేవల ద్రవ్యాపేక్షచేత నే యతనితోఁ గూడరనియును, మున్ను దమతోడఁ జెలిమిచేసిన విటుఁడు ధనహీనుఁ డయ్యెనేని యతని నాదరింతురనియును, రాజాంతఃపుర స్త్రీజనమునకుఁ గలిగి నంత పరువు గలిగి సంచరింతు రనియును, మిగుల విద్యావతులు గానునఁ గావ్య రచనఁ జేయుటకైనను నేర్పు గలవారనియును భావము.

ఉ. అంచితహారవల్లివల • యాభరణంబుల తక్కఁ ద్రోయుఁ జి
ల్మంచుఁ బసిండి యేణమద • మంగముఁ జేర్చుట తక్క రోయు జి
డ్డంచు జవాది ధూపితమ • యందుట తక్క విదిర్చుఁ బూవుఁ జె
మ్మంచు జిలుంగ తక్క నగు • యౌవత మొత్తు నటంచు నన్యముల్.

టీ. యౌవతము=యువతిసమూహము, అంచిత...బుల-అంచిత — సొగసగు, హారవల్లి=వల్లికలవంటి ముక్తాహారములచేతఁజేసిన, వలయాభరణంబుల=వలయభూషణములే, తక్కన్ = కాక, పసిండి = బంగారము, చిల్మంచు — చిలుముపట్టుననుచు, త్రోయున్=పరిహరించును. ఏణమదము=కస్తూరి, అంగముఁజేర్చుటతక్కన్—శరీరమందు నలఁదుటయేకాక, జవాది=సంకుమదమును, జిడ్డంచున్—దముగుతో డిమలిన మని, రోయున్=ఏవగించును. ధూపితమయందుటతక్కన్=శిరోజముల కగరు సాంబ్రాణి మొదలగువస్తువులధూమధూపముఁ బొందుటయేకాక, పూవున్=పుష్పమును, చెమ్మంచున్=తడియనుచు, విదిర్చున్=విసర్జించును. జిలుంగదక్క=సన్నపుఁజీరయేకాక, అన్యమున్=పెరసరిగ-చీరలైనను, ఒత్తునటంచున్=ఒత్తుకొనుననుచును, నగున్=పరిహసించును.

తా. ఆపురిజవరాండ్రు మిగుల సుకుమార శరీరములు గలవా రగుటం జేసి రంగుబంగరుకన్న మిన్న యగు వన్నియ గల తమ మేనులను ముత్తియంబుల సొమ్ములు ధరింతురే కాక పసిఁడి సొమ్ములు చిలుము పట్టు నని త్రోసి వేయుదురు. పునుంగు జిడ్డు గలదని దానిఁ బూసికొనుట వదలి కస్తూరియే పూయుదురనియును, తుఱుములయందు విరులఁ దురిమిన నవి చెమ్మగిల్లు నని వాని విడిచి ధూమధూపములచేత నే వెండ్రుకలకు వాసన లెక్కింతురనియును, సరిగ మొదలగు వానిచే నెక్కుఁడు వెలగల వలువల నేని యవి కఱకుగ నొఱయు నని వానిఁ బరిహసించి జిలుంగు వలువలే కట్టుదు రని యును నిట్టి నాగరకంబు గల వారని భావము.

ఉ. వేవిన మేడపై వలభి • వేణికఁ జంట వహించి విప్పఁగా
బూవులు గోటమీఁటుతఱిఁ • బోయెడు తేఁటులమ్రోఁత కామిశం
కావహ మౌఁ గృతాభ్యసన • లౌటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణ మీఁటుటలుఁ • జిక్కెడలించుటలు న్సరింబడన్. 62

టీ. వేవిన=ప్రభాతముకాఁగానే, ('క్వచిద్గకారోవః' అనుసూత్రమును బట్టి వేగిన యనుశబ్దము వేవిన యనియునుం గలదు.) మేడపైన్=సౌధాగ్రముమీఁదను, వలభిన్ = లోవయందు, వేణికన్ = జడను, చంటన్=కుచమందును, వహించి= ధరించి, విప్పఁగాన్=ఉద్గ్రథనముఁజేయుటకొఱకు, పూవులు=పుష్పములను, గోట మీఁటుతఱిన్=నఖముచేత విదిర్చుసమయమునందు, పోయెడు...మ్రోఁత-పోయెడు= విచ్చిచనుచున్న, తేఁటులమ్రోఁత=భ్రమరములధ్వని, కృతాభ్యసనలౌటను - కృత= చేయఁబడిన, అభ్యసనలౌటను=అభ్యాసముగలవారౌటచేతను, దంతపుమెట్లవెంబ డిన్=వీణకు వేసియున్న దంతపుమెట్లవెంబడిఁగా, చేవడిన్=హస్తలాఘవముచేతను, వీణమీఁటుటలున్=వీణవాయించుటలును, చిక్కెడలించుటలున్=శిరోజములచిక్కుఁ దీయుటలును, సరింబడన్=సదృశములగుచుండఁగా, కామి...మౌన్-కామి=కాము కులకు, శంకావహమౌన్ = సంశయాస్పదమగును. (ఈపద్యమునందు వారస్త్రీలని యధ్యాహారముఁ జేసికొనవలయును).

తా. ఆపట్టణమందు వారస్త్రీలు తెల్లవాఱఁగానే మేడమీఁదఁ జూరువెంబడి గూర్చుండి తమ వేనలి కుచోపరిభాగము మీఁద ధరించి యాజడ విప్పుచు నందలి పుష్పములు గోట విదిలించునప్పుడు పరిమళార్థమయి ముసరికొని మరల విచ్చి పోవు తుమ్మెదలు రొదఁజేయుచుండఁగా నాఝంకారము విని వీథిఁబడి బోవుచున్న కాము కులు నిలిచి యాస్త్రీలు చేతులు వడివడిగా నాడించుట వీణవాయించిన ట్లుండఁగాఁ బుష్పములు దంతపు మెట్లవలెనుండఁగా జడ వీణవలెనుండఁగా నాస్త్రీలు వీణాభ్యా

సము గలవా రగుట వలన నప్పుడు జడ విప్పుట వీణవాయించుటకా అని సంశయింతు రని భావము. సందేహాలంకారము.

క. అళివచఃకార్పణ్యం, బా లేమల చెవులు సోఁక • దధమాన్వయ జీ
ర్ణా లావణ్యులపిలుపున,కై లాభముఁ దెలిపెనేని • యవి శ్రీలగుటన్.

టీ. అళిర...ణ్యంబు - అళి=చెలికత్తెలయొక్క, వచః=వాక్కులయొక్క, కార్పణ్యంబు=లుబ్ధత్వము, అధమా...కై - అధమాన్వయ=తక్కువజాతియొక్కయు, జీర్ణ=ముసలివాండ్రి యొక్కయు, అలావణ్యుల = సౌందర్యహీనులయొక్కయు, (ద్వంద్వాంతమున బహువచనము) పిలుపునకై=పెల్చుటకొఱకు, లాభముఁ దెలిపె నేని=ఆదాయ మెఱింగించెనేనియు, అవి=ఆస్త్రీలచెవులు, శ్రీలగుటన్ =లక్ష్మీస్వరూపములగుటచేతను (శ్రీకారములఁబోలినవనుట), అలేమల=అసొగసుకత్తెలయొక్క, చెవులుసోఁకను=చెవిజోరము.

తా. జవ్వనము గలయావారకాంతల దాఁపున నుండు చెలులు కొందఱఁ బురుషులఁ దాల్చు వారై యాపురుషులు మిక్కిలి ధన మిచ్చెద రని చెప్పినను ఆవారకాంతలు పురుషులు తక్కువకులము వారయినను ముసలి వారైనను సొగసు లేని వారైనను వారిని దెలియఁజేయుచు చెలుల పలుకులు విన రనియును సామాన్యలు కేవల విత్తాపేక్ష గలవారైన నచ్చటి వార లుత్తమ కులీనులై యౌవనము గలిగి సుందరు లైనపురుషులనేకాని కూడరనియు భావము.

చ. ద్రవిడ కుటుంబినుల్పసపు • జాచినరత్నపుఁదాఁపక్రింద సం
బువు దెరవారఁగా నిదుర • వోయి గరుత్తతి పచ్చఁబాఱెనన్
భవనసరోమరాళములు • భర్మమయచ్ఛద గుచ్ఛవిస్ఫుర
ద్ద్విజధునీమరాళవిత•తిభ్రమఁ *బూన్చుఁ బురి న్భ్రమించుచున్. 64

టీ. భవన...ళములు - భవన = గృహసంబంధులగు, సరః = కొలఁకుల యందలి, మరాళములు=హంసలు, ద్రవిడకుటుంబినుల్ = ద్రావిడస్త్రీలు, పస... క్రిందన్-పసపుజాచిన=పసపుఁజాఁదినట్టి, రత్నపుదాఁపక్రిందన్ - రత్నసోపానము క్రింద, అంబువు తెరవారఁగాన్=ఉదకము తరంగితమగుచుండఁగా, నిదురవోయి=నిద్రించి, గరుత్తతి - గరుత్=ఱెక్కలయొక్క, తతి=గుంపు, పచ్చఁబాఱెనన్ - హరిద్రావర్ణముగలదికాఁగా, పురిన్ = శ్రీవిల్లిపుత్తూరను, భ్రమించుచున్-తిరుగుచును, భర్మమయ...భ్రమన్ - భర్మమయ=స్వర్ణమయములగు, ఛద-ఱెక్కలయొక్క, గుచ్ఛ=గుత్తులచేతను, విస్ఫురత్=ప్రకాశించుచున్న, ద్విజధునీ-ఆకాశగంగ

* మాన్చు.

రినుకఁగాఁ గాఁడలు హస్తములవలెను జేకులు వ్రేళ్లవలెను మిద్దెలు వరాలవలె నొప్పుచుండును.

సీ. నులివాఁడునాఁచువ•ల్పులఁ గొంతొగర్చి లేఁ,
బొలవల్చుగాలి వేఁ • బోక యొదిగి
కడకువెళ్లఁగ నొక్క•కడనుండి త్రొక్కుచు,
నులుచలఁ జిఱుతగు•ల్లల నమలుచు
నెండ్రి కాలిఁజిక్కిన•నెగసి యొక్కించుక,
తొలఁగి శితత్రోటిఁ • దూఁటి తినుచుఁ
దడియింకునిలఁ జేమ•మడివోనితమ్మిగుం,
పులను జీలుగల నెం•డలుగడపుచుఁ

తే. దనరుబకపంక్తులకు జాను•దఘ్నమయ్యెఁ
జెఱువుగమి యుడుములన రే • ల్దిరిగెఁ గుక్క-
వసికి బావులఁ బడుటకు • బసులయొరవు
సెలలకు మొసళ్లు మలుఁగుమీ • న్చొచ్చియఁ దూఱె. 53

టీ. నులి...లన్ - నులివాఁడునాఁచు = కొంతవాడిన నాఁచుతీఁగయొక్క, వల్పులన్=బొబ్బరలచేత, గొంతొగర్చి=గొంతొగరించి, లేఁబొలవల్చుగాలిన్=లేఁత మాంసపువాసన గలవాయువుచేత, వేఁబోక=శీఘ్రముగఁజనక, ఒదిగి=శరీరము వంచికొని, ఒక్కకడనుండి = ఒక చోటనుండి, కడకువెళ్లఁగన్ = తుదముట్టునట్లుగ, త్రొక్కుచున్, ఉలచలన్=ఉలచలను పేరుగల చేఁపలను, చిఱుతగుల్లలన్-చిఱుత=పిన్నలైన, గుల్లలన్=నత్తగుల్లలను, నమలుచున్=భక్షించుచు, ఎండ్రి=ఎండ్రకాయ, కాలిఁజిక్కిన=తన కాలుపట్టుకొన్న, ఎగసి=ఒక్కించుకతొలఁగి, శితత్రోటిన్=వాఁడిముక్కున, తూఁటి=పొడిచి, తినుచు=నమలుచు, ని.'చంచుస్త్రోటిరుభే స్త్రియా' మ్మని యమరుఁడు. తడియింకునిలన్=తేమయింకునట్టి భూమియందు, చేమమడివోని=చేమకూరమడివంటి, తమ్మిగుంపులను=తామరగుంపులయందును, జీలుగలన్ = జీలుగచెట్లయందును, ఎండలుగడపుచు, తనరు=ఒప్పుచున్న, బకపంక్తులకున్ = కొంగగుంపులకు, చెఱువుగమి=చెఱువులగుంపు, జానుదఘ్నమయ్యెన్=మోఁకాలిబంటిదాయెను, ఉడుములనన్=ఉడుములవలెనే, మొసళ్లు = మకరములు, పసులయొరవు = పశువుల యొరవుపెంటలలోని, సెలలకున్=సెల్లలకు, కుక్కవసికి=కుక్కలరాయిడికి, బావులఁబడుటకు=కూపములయందుఁ బతనమగుటకు, రేల్=రాత్రులయందు, తిరిగెన్=సంచ

రించెను, మలుఁగుమీన్ = మలుఁగను పేరుగల చేఁప, బొఱియఁదూఱె = బొక్కలోఁ దూఱెను.

తా. ఆగ్రీష్మవాసరంబులయందు సలివాడిన నాఁచుఁదిని గొంతుకయొగరెక్కి లేఁతమాంసపువాసనగల గాలిచేత వేగిరఁబోక యొదిగి కడముట్టఁ గ్రొక్కికొనిపోయి యొకచోటనున్న యులుచలను నత్తగుల్లలను నమలితిని, యెండ్రకాయ తనకాలుపట్టుకొనఁగా నెగసి కొంతదూరమున నిల్చి ముక్కునఁ బొడిచి దానిం భక్షించి, చేమకూరమళ్లవలె దడియాఱిన తామరగుంపుల క్రిందను జీలుగకొండుచెట్ల క్రిందను నెండలకు దాఁగియున్న కొంగలకుఁ జెఱువులు జానుదఘ్నములాయెననియు, కుక్కలను వెఱచి మొసళ్లు బావులలోఁ బడుటకుఁ బసరముల యొరవులలోని యొల్లలకుఁగా సంచరించెననియును, మలుఁగుమీను బొక్కలోఁ బ్రవేశించె ననియును తాత్పర్యము.

ఉ. మీటగుమీలనెల్ల మును • మ్రింగి క్రమంబున నైన యెండపె
న్బీటికవెంటఁ దోఁచుతొగ • వేరుబడిన్ గొడుపై చెలంగఁగాఁ
ద్రోటికఁ గర్దమద్రవము • తోనె నశించిన బొమ్మడాయ డా
తూక్కుటకులంబులం దినె బ • కోటకులంబు జలప్రాదంబులన్. 54

టీ. బకోటకులంబు = పెద్ద కొంగలగుంపు, ని. 'బకోటస్తుమహాబకః' యని నిఘంటువు. మీటగు = గొప్పలైన, మీలనెల్లన్ = చేఁపలనన్నిటిని, మునుమ్రింగి = ముందు మ్రింగి, క్రమంబునన్ = వరుసగా, ఐన = ఐనట్టి, ఎండపెన్బీఁటికవెంటన్ = ఎండచేత నైన పెద్దఁబీఁటికలచాలున, తోఁచు = కనుపించెడి, తొగవేరుబడిన్ = కలువవేరు వెంటను, కొడుపై = కొడుపువలెనై, చెలంగఁగాన్ = ఒప్పఁగా, త్రోటికన్ = ముక్కుచేతను, కర్దమద్రవముతోనె = బురదతడితోనె, నశించిన = చనిపోయిన, బొమ్మడాయ = బొమ్మడాయలను పేరుగల చిన్నచేఁపలయొక్కయు, డాతూక్కుట = చేఁదుచేఁపలయొక్కయు, కులంబులన్ = గుంపులను, ని. 'బొమ్మడాయనూన్యత్స్యమతోన్యడాతూక్కుటస్తిక్తమత్స్యక' యనివిశ్వము. జలప్రాదంబులన్ = మడుఁగులయందు, తినెన్ = భక్షించెను, (క్రమంబున నానె నను పాఠమున అనెను ద్రాగె నని యర్థము - డాతూక్కుటకులంబు లేజెన నను పాఠమున జెన యనఁగా వంకరగుడ్డులలోని రక్తవిశేషము.)

తా. పెద్దకొంగలగుంపు మడుఁగులయందుఁ దొలుత గొప్పచేఁపలనెల్ల భక్షించి గ్రీష్మకాలము రాఁగా నీళ్లింకిన పిమ్మట నేల పగులుటవలన బొరియలలోఁ గలువవేళ్లవెంటఁ గొడుపువలె నొప్పుచున్న బొమ్మడాయలనియెడి పిన్నచేఁపలను, బురదతోఁ గూడ నెగిరిన చేఁదుచేఁపలను భక్షించెను.

శా. పాతర్వేళల నట్టివెట్ట సొగసై • పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధః • పుంజీభవత్పాటల

వ్రాతామ్రేడితసిక్తభూసురభిళా•రామంబు కుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్రనతికృ•త్ప్రోద్గీతగేయౌఘముల్. 55

టీ. ప్రాతర్వేళలన్=ప్రాతఃకాలములయందు, అట్టివెట్టన్=అటువంటి గ్రీష్మమునందు, మరుద...లన్ - మరుత్=వాయువుచేతను, అధః=చెట్లక్రిందను, పుంజీభవత్=రాసులుగాఁబడిన, పాటలవ్రాత = కలిగొట్టుపువ్వులచేత, ఆమ్రేడిత=రెండుమూఁడువరుసలుగా, సిక్త=తడుపఁబడిన, భూ=భూమియందు, సురభిళ = సౌరభ్యముగల, ఆరామంబు=ఉద్యానవనముయొక్క, కుల్యా = కాలువలయొక్క, బహు=అనేకములైన, స్రోతః=ప్రవాహములయొక్క, సంధులన్=మధ్యప్రదేశములయందు, అంధు...ల్ - అంధు=బావులయొక్క, యంత్ర=ఏతములయొక్క, నతి=వంగద్రొక్కుటను, కృత్=చేయుచున్న జనులచేతను, ప్రోద్గీత=ఎత్తిపాడఁబడినట్టి, గేయ=గానములయొక్క, ఓఘముల్ = సమూహములు, కుంభో...ధ్వని - కుంభ=ఘటములయొక్క, ఉంభన=మునుఁగుటచేతను, ఉద్భూత=పుట్టినట్టి, అంబుధ్వని=నీళ్లచప్పుడు, వాద్యమై=వాద్యధ్వనికలదై, సొగసై=సొంపుగను, పాటిల్లెన్ = ఒప్పెను. ని. 'ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తం కుల్యాల్పాకృత్రిమా సరిత్, పుంస్యేవాన్ధుః ప్రహిః కూప' యనియు నమరుఁడు.

తా. వాయువుచే రాల్పఁబడిన కలిగొట్టుపువ్వులచేత రెండుమూఁడు మాఱులు తడుపఁబడినదై యున్న భూమియందుఁ బరిమళించుచున్న యుద్యానవనములయందలి వృక్షములకు నీళ్లుగట్టుటకై యేతములు ద్రొక్కుచున్నవాండ్రు గానముఁజేయఁగ బొక్కెనల ముంచునపుడు జనియించిన నీళ్లచప్పుడను తాళధ్వనికలదియై సొగసుగా నుండెను.

తే. మెండుమీఱిన పగటి పే•రెండ దాఁకి
యొల్లఁబోయిన లేబొండు•మల్లెపొదల
తుదలఁ జప్పటిల్లై కడు•దొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గి•బొబ్బలట్లు. 56

టీ. మెండు...రెండ - మెండుమీఱిన=దట్టమైన, పగటి=పవటియొక్క, పేరెండ=పెద్దయెండ, తాఁకి=కొట్టి, ఒల్లఁబోయిన=మూర్ఛఁబోయిన, లేబొండు...లన్ - లేబొండుమల్లెపొదల=లేఁతబొండుమల్లెపొదలయొక్క, తుదలన్=కొనలయందు, చప్పటిల్లై=అణఁగినవై, కడుదొడ్డలగుచున్=మిగులగొప్పలై, అగ్గిబొబ్బలట్లు=కాలినబొబ్బలవలెను, మొగ్గలగములు=మొగ్గలగుంపులు, పొడమెన్=పుట్టెను.

తా. ఆవేసవియందు దట్టమైన పేరెండ దాఁకి వాడినబొండుమల్లెలపొదలకొనలయందణఁగినవై మిగుల గొప్పలగుచు నగ్గిబొబ్బలవలె నా మొగ్గలగుంపులు పుట్టెను.

మ. సుడి నాభిచ్ఛలన న్సరోజములు చ•క్షుఃప్రక్రియన్నాఁచు క్రొ
మ్ముడి దంభంబునఁ జక్రఫేనపటలం•బు ల్చన్నులు న్నవ్వుగా
నడరం జేసి నిదాఘభీతి సలిలం•బాగామిబీజార్థమై
కడవం బెట్టినవారిదేవతల నాఁ•గాంతాళి యొప్పు న్ప్రపన్. 57

టీ. సుడి...లనన్ - సుడి = నీళ్లసుడి, నాభిచ్ఛలనన్ = బొడ్డులనియెడివ్యాజముచేతను, సరోజములు=పద్మములు, చక్షుఃప్రక్రియన్=నేత్రములరీతిచేతను, నాఁచు=ప్రాఁచి, క్రొమ్ముడిదంభంబునన్=కొప్పనువ్యాజముచేతను, చక్ర...ల్-చక్ర=చక్రవాకములయొక్కయు, ఫేన=నురుఁగుయొక్కయు, పటలంబుల్=సమూహములు, (క్రమముగా) చన్నులు=చనుదోయి, నవ్వుగాన్=మందహాసమునుగా, అడరం జేసి=అమరునట్లుచేసి, నిదాఘభీతిన్=గ్రీష్మమువలనిభయముచేత, ఆగామి=ముందటికి, బీజార్థమై=విత్తనముకొఱకై, సలిలంబు=జలమును, కడవన్=కుండలోన్, పెట్టిన=ఉనిచినట్టి, వారిదేవతలనాన్=ఉదకాధిదేవతలో యనునటుల, ప్రపన్ = చలిపందిళ్లయందు, కాంతాళి=స్త్రీసమూహము, ఒప్పున్=పొల్పగును.

తా. జలదేవతాలక్షణములు స్త్రీలయవయవములకుఁ జెప్పంబడెను గానఁ జలిపందిళ్లయందు నీళ్లుపోయుచున్నస్త్రీలు గ్రీష్మమునందు సకలము నష్టమగునని భయపడి ముందటివిత్తనముకొఱకు నీళ్లుకడవల నించికొని తమయందుఁ గలవస్తువులను నంగములుగాఁ జేసికొనియుండెడి వారిదేవతలో యనునటులఁ బ్రకాశించుచుందురు.

సీ. సెగ కుల్కి మఱుఁగుఁజొ•చ్చినజహ్నురవిజల,
సరణి మల్లెలతోడి•జడలు మెఱయ
వలిచన్నుకొమరుమ్రు•చ్చిలినదిమ్మను తెఱం,
గున ముంచుగరిగ కాఁ•గులమునుంగ
ధారలోఁ దోఁచు క•న్దళుకులు వాసితో,
త్పలపత్త్రిపతనసం•భ్రాంతి నొసఁగ
దెలిమోముపస మెచ్చి• తలయూఁచు టెఱిఁగి మూ,
నక నవ్వునేర్పు డె•న్దములఁ గరఁప
తే. దెఱవ లిటు నీరువోయుపం•దిరియచేరి
యవలఁ గొఱగాక పిచ్చుగుం•పై యనంగుఁ
డనువుఁగొనఁ జొచ్చెఁ గల్లగు•ట్టమర వారి
కధ్వగులు లాఁచియిడువిడి•యముల పేర. 58

టీ. సెగకు=గ్రీష్మమునకు, ఉల్కి=భయపడి, మఱుఁగు...జొన్-మఱుఁగు

జొచ్చిన, జహ్నురవిజలసరణిన్=గంగాయమునలరీతిని, మల్లెలతోడిజడలు=గంగవలె మల్లెలు, యమునవలెజడలు, మెఱయన్=ఒప్పఁగా, వలిచన్నుకొమరు=వట్రువలైనతమ స్తనముల సౌందర్యమును, ప్రముచ్చిలినది=హరించినది, ఇమ్మను తెఱంగునన్=అది మరల నిమ్మనుకరణిని,ముంచు=మునుంగఁజేయునట్టి,గరిగ=కడవముంత,కొఁగులమునుంగన్= నీళ్లకొఁగులలోమునుఁగఁగా,ధారలోన్=పథికులకుఁబోయు నీటిధారలో, తోఁచు... లు-తోఁచు=ప్రతిఫలించిన, కన్గొనలు=నేత్రప్రభలు, వాసి...తిన్-వాసిత=వాసింపు చున్న, ఉత్పలపత్త్రి=కలువరేకులయొక్క, పతన=పడుచున్నవనియెడి, సంభ్రాం తిన్=భ్రమను, ఒసఁగన్=కలుగఁజేయఁగా, తెలిమోముపస=ఆస్త్రీలముఖసౌందర్య మును (నీరుఁద్రాగుచున్నవారు సూచి), మెచ్చి=ఆనందించి, తలయూఁచు టెఱిఁగి= వారియభిప్రాయముఁగని, మానక=నీరుపోయుట చాలింపక, నవ్వునేర్పు=నవ్వెడు చమత్కారము, డెందములన్=పథికులమనంబులను, కరఁపన్=కరఁగింపఁగా, తెఱవ లు=స్త్రీలు, ఇటు=ఇట్లు, నీరుపోయుపందిరియచేరి=నీళ్లుపోయుచుండెడిపందిటిఁబ్రవే శించి, అవలన్=మఱియొకతావునకు, కొఱగాక=పనికిరాక, పిచ్చుగుంటై=పంగువై, అనంగుఁడు=మన్మథుఁడు, కల్లగుట్టుమర=ఆబద్ధముగనఁబడకుండ, వారికిన్=ఆస్త్రీలకు, అధ్వగులు=తెరువర్లు, లాఁచియిడు=ప్రీతితోనిచ్చునట్టి, విడియములపేరన్=తాంబూ లములనువ్యాజముచేతను, అనువుగొనన్=సుంకముఁదీసికొనుటకు, చొచ్చెన్=ప్రవే శించెను.

తా. మల్లెపూదండలు గలకొప్పులు గంగాయమునలు రెండును నెండకువెఱచి స్త్రీలమఱుఁగుఁ జొచ్చెనో యనునటుల నొప్పెననియు, నీళ్లకొఁగులలో ముంచెడి ముంతలు మా నక్కదనమును మీరుదొంగిలినారు గాన మరల నిమ్మని చన్నులుకడవల లోఁజొచ్చి బాధించునట్లుండెననియు, నీళ్లుపోయఁగ నాధారయందుఁ గనుపించుచున్న కన్నులకాంతులు పరిమళమునకుఁగాఁ గట్టినకలువలో యనునట్లుండెననియు,పథికు లా స్త్రీలముఖ సౌందర్యముఁజూచి తలయూఁచఁగా వాచారఁబట్టి నీళ్లుత్రాఁగుచుఁ జాలు నని యూఁచినట్లూహింపక మానక నీళ్లుపోయుచు నవ్వెడు నేర్పుపథికులమనంబులఁ గర గింపఁగ స్త్రీలకుఁ బాంథులు మంచితనమునకై యిచ్చువిడియములు పిచ్చుకుంటై మఱి యొకచోటికిఁ బోక పడియున్న మన్మథుఁడు తీసికొను సుంకమువలె నుండెను.

చ. తొడిబడ నమ్మ యక్క యని • తూలుచు దీనత దోయిలొగ్గుచున్
వడ మఱి తేరఁదేర నల•భాగ్యము లెన్నక మోము గుబ్బలున్
గడకొనురక్తి*దీధితు లె•గాదిగఁ గన్గొనుచిట్టకంపుఁద్రాఁ
గుడుఁ గని సన్నల న్నగిరి • కొందఱు పాంథుఁ బ్రపాప్రపాలికల్.59

* దీప్తులు నె.

టీ. తోడిబడన్ = దాహార్తచేతనైనతొట్రుపాటుచేత, తూలుచున్ = తూఁగాడుచు, అమ్మ, అక్క, అని = అనుచు, దీనతన్ = దైన్యముతో, దోయిలొగ్గుచున్ = దోసిలిపట్టుచు, నడుమతితేరన్ = నీళ్లు ద్రాగుటచే నట్టనట్టు దీరఁగా, అలవాక్యములు = మునుపన్నమాటలను, ఎన్నక = విచారింపక, మోముగుబ్బలన్ = ముఖములను స్తనములను, కడ...ధతులన్ - కడకొను = బయలొలసిన, కక్షవీధతులన్ = చంకలమెఱపులను, ఎగాదిగన్ = పైనిఁగ్రిందను, కన్గొను = చూచుచున్నట్టి, చిట్టకంపుఁ దాత్రిఁగుడు = చేష్టలుగలత్రాఁగుటను, చిట్టకము, కపటమనియునర్థముగలదు. కని = చూచి, పాంథున్ = పథికుని, సన్నలన్ = సంజ్ఞచేతను, కొందఱు = కొందఱైన, ప్రపా ప్రపాలికలు = చలిపందిటియందు నీళ్ళుపోయుచున్న స్త్రీలు, నగిరి = నవ్విరి.

తా. తొలుత నమ్మ యక్క యనుచు దీనభావముతో నచ్చి దాహార్తుఁడై తూలుచు దోసిళ్లయందు నీళ్లుపోయఁగఁ ద్రాఁగి బడలిక దీరఁగా మునుపటిమాటల విచారింపక నీళ్ళుపోయు స్త్రీలయొక్క కన్నులు, మోములు, స్తనములు, చంకలు, వీని నెగాదిగఁ జూచి వికారముతోఁ ద్రాఁగుచున్నపథికునిఁగని యాస్త్రీలు సైగతో నవ్విరనియు, పాంథుఁడు కాముకుఁడనియు, తొట్రుపాటుచేతఁ దొలుత నమ్మ యక్క యని వచించెను.

తే. ఎసఁగు కట్టావిక్రియ నావిరెగయఁ బగటి
యెండ యుడుకాఱకుండ భూమండలమునఁ
బొలిచె మాపటిపండువెన్నెల చకోర
పోతవితతికి జాఁపట్టు వోసినట్టు. 60

టీ. ఎసఁగు = పెనముమీఁదఁ బిండిఁబోయఁగఁజూట్టు నెగసినట్టి, కట్టావిక్రియన్ = కట్టవలె లేచెడియావిరిపొగవలెను, ఆవిరెగయన్ = ఆవిరి యెగురుచుండఁగా, పగటి యెండ, ఉడుకాఱకుండన్ = చల్లాఱకుండఁగ, భూమండలమునన్ = కాలినపెనము వంటిభూమండలమున, మాపటిపండువెన్నెల = రాత్రిముదురువెన్నెల, చకోరపోత వితతికిన్ = చకోరపుఁబిల్లలగుంపులకు, చాఁపట్టు = పలుచనిదోసెలను, పోసినట్టు = పోసినట్టువలె, పొలిచెన్ = ఒప్పెను.

తా. పెనముమీఁద బిండిఁబోయఁగ నెగసినయావిరి,పొగవంటియావిరవలె నెగయఁగాఁ బవటియెండ యుడుకాఱకుండెనుగానఁ గాలినపెనమువలెనున్న భూమండలమునందు రాత్రి ముదురువెన్నెల చకోరపుఁబిల్లలగుంపులకుఁ బలుచని దోసలను బోసినట్లొప్పుచుండెను.

సీ. పవలెల్ల దీర్ఘికాంబువుచల్లువోరాడ,
సొలసి మృణాళికోజ్జ్వలము లైన

బాహువు ల్తమదుకూ • ర్పరముల కెదురుగా,
మలఁచి మూఁపులఁ గర • తలము లునిచి
ప్రాల్మాలి మిగుల నా • ర్పమిఁ గమ్ము క్రొమ్ముడిఁ,
దనివొుగ్గవిరవాది • దండవిరియ
ధౌతగంధామోద • శీతల స్తనములు,
వొందఁ గౌఁగిళ్లతో • బోరగిల్లి
తే. నారికేళాసవపుఁదీపు • టూరుపొలయ
వలిపెయొంటొల్లెతో నుర • స్థలులఁగూర్కు-
ప్రియలవేకువఁ దొడ లెచ్చ • రించి కలసి
రెలమి ధన్యులు దళిపివె • న్నెలబయళ్ల. 61

టీ. పవల్లన్ = పగటివేళలనెల్లను, 'క్వచిద్గకారోప' యనుసూత్రమున గవర్ణమునకు నవర్ణము. దీర్ఘి...డన్-దీర్ఘికా=డిగ్గియలయొక్క, అంబువు=నీళ్లచేతను, చల్లుపోరాడన్=చల్లులాడఁగా, సొలసి=అలసి, మృణా...లైన-మృణాళికా=తమ్మితూఁడులవలెను, ఉజ్జ్వలములైన=ప్రకాశించునట్టి, బాహువుల్=భుజములు, తమ...కున్-తమదు=తమయొక్క, కూర్పరములకున్ = మోఁచేతులకు, ఎదురుగాన్, మలఁచి=మరలించి, మూఁపులన్=భుజములపై, కరతలములు=అఱచేతులను, ఉనిచి=ఇడికొని, ప్రాల్మాలి=బద్ధగించి, మిగులన్=మిక్కిలి, ఆర్పమిన్ = ఆర్పకుండుటచేత, కమ్ము క్రొమ్ముడిన్=వ్యాపించుచున్న కొప్పునందు, తని...డ-తని=క్రొత్తలగు, మొగ్గ=మొగ్గలవెలఁగట్టిన, విరవాదిదండ=మల్లెపువ్వులదండ, విరియన్=వికసింపఁగా, ధౌత...లు-ధౌత=కడుగఁబడిన, గంధామోద=చందనపువాసనగలిగి, శీతల=చల్లనైన, స్తనములు=చన్నులు, పొందన్=స్పృశించినటుల, కౌఁగిళ్లతోన్ = ఆలింగనములతోడ, బోరగిల్లి, నారికేళాసవపు=నారికేళమద్యమయమగు, తీపుటూరుపొలయన్=తీపుగలనిట్టూర్పు వెడలఁగను, వలిపె=సన్నమైన, ఒంటొల్లెతో=ఏకవస్త్రముతోను, ఉరస్థలులఁ గూర్కు=అరొమ్ములపైనిద్రించుచున్న, ప్రియలన్=ఇష్టలగు స్వస్త్రీలను, వేకువన్=వేకువజాములయందు, తొడలు=ఊరువులను, ఎచ్చరించి=కదలించి, తళిపివెన్నెలబయళ్లన్=పండువెన్నెలగల బయళ్లను, ఎలమిన్ = సంతోషముచేత, ధన్యులు=భాగ్యవంతులు, కలసిరి=రమించిరి. తళిపివెన్నెల యనుపదమునకు లక్షణచేత బండువెన్నెల యనునర్థము సిద్ధించును.

తా. వేఁడిమిగలిగియుండుటచేతఁ బగళ్లెల్లను నడబావులయందు జలక్రీడలుసేసి తూఁడులవలెఁ బ్రకాశించుచున్న హస్తములఁ దమమోఁచేతులకెదురుగ మరలించి భుజములపైఁ జేతుల నుంచికొని ప్రాల్మాలి తడిబోవున ట్లార్పఁబడమి వాసించుచున్న కొప్పు

నందున్న క్రొత్తలగువిరవాదిమొగ్గలు వికసింపఁగా కడుఁగఁబడిన శ్రీగంధపువాసనగలిగి చల్లనైన స్తనములు దాఁకుచుండున ట్లాలింగనముతో బోరగిల్లి పానముసేసిన నారికేళాసనముచేతఁ దీపుగలనిట్టూర్పు వెడలఁగా సన్ననైన యొంటివస్త్రముతోఁ దమతొమ్ములపై నిద్రించుచున్న ప్రియురాండ్రను వేఁకువజాములయందుఁ దోఁపిలసంజ్ఞచేత లేపి పండువెన్నెల బయళ్లను వారితో భాగ్యవంతు లగుపురుషులు రమించుచుందురు.

చ. హృదయము లెప్పుడు న్గదియ • కే తఱుచౌ వెడకౌఁగిలింతలన్
గదిరెడుమేలుకార్యములఁ • గల్గక మాటలయందె కల్గుసు
జ్జదురులు వట్టిశైత్యములు • చాలఘనంబయి మండువేసవిన్
బొదలఁగ నిల్చె దంపతుల•పొందు లనార్యులపొందుకైవడిన్. 62

టీ. మండువేసవిన్=గ్రీష్మమందు, దంపతులపొందులు = సతీపతుల సంపర్కములు, అనార్యులపొందుకైవడిన్=దుర్జనులకూటమినలె, హృదయములు = రొమ్ములు, ఎప్పుడున్=ఎప్పటికిని, కదియకే=సోఁకకయే (ఉష్ణభయముచేత ననుట), తఱుచౌ=మెండైన, వెడకౌఁగిలింతలన్=వట్టికౌఁగిలింతలను, మనస్సంగములేక యని యర్థాంతరము. గదిరెడు=ప్రాప్తమైన, మేలుకార్యములన్=రతిక్రియలయందు, కల్గక=లేక, మాటలయందె=ఒకప్రయోజనములేక మాటలనేర్పునందే, కల్గు = కలుగుచున్నట్టి, సజ్జదురులు=గొప్ప చాతుర్యములు, పెద్దఱచ్చలని యర్థాంతరము. వట్టిశైత్యములు = వట్టి చల్లఁదనములు (క్రియలచేత లేవనుట), చాలఘనంబయి=మిగుల గొప్పదయి, పొదలఁగన్=పొందునట్లుగా, నిల్చెన్=ఉండెను.

తా. గ్రీష్మమందు సతీపతుల సంపర్కములు దుర్జనులకూటమిం బలె నెప్పటికిని మనస్సంగములేక మెండైన వట్టికౌఁగిలింతలచేత ప్రాప్తమైన రతిక్రియలయందు లేక మాటలయందుఁ గల్గు చాతుర్యములచేతను చల్లదనముచేతను మిగుల గొప్పయై పొందునట్లుంబలె నుండెను.

ఉ. తీలగు కంతువెంబడిన • తెమ్మెఱలు న్రవిదీప్తికల్కి పా
తాళముఁ బట్టుచుండఁ దమ• తావులు ముచ్చిలఁ బట్టి యోషధీ
పాలున కొప్పగించె నన • బై సురభిశ్వసనంబు నించెఁ గాం
తాలసవక్త్రసీమ విటు • లార్చు నుశీరపుఁదాళవృంతముల్. 63

టీ. విటులు=పల్లవులు, కాంతా...మన్ - కాంతా=స్త్రీలయొక్క, అలస=బడలినట్టి, వక్త్ర=ముఖముయొక్క, సీమన్=ప్రదేశమునందు, ఆర్చు...ల్ - ఆర్చు=విసరునట్టి, ఉశీరపుఁదాళవృంతముల్=వట్టివేళ్లవిసనకఱ్ఱలు, తీలగు=బలహీనులైనట్టి, కంతువెంబడిన=మన్మథునివెంటనే, తెమ్మెఱలున్=శీతవాయువులును, రవిదీప్తికల్కి=సూర్యప్రతాపమునకు వెఱచి, పాతాళముఁ బట్టుచుండన్=పాతాళలోకముఁ జేర

బోవుచుండఁగా, తమ తావులు = తమవాసనలను, ముచ్చిలన్ = అపహరింపఁగా, పట్టి=పట్టుకొని, ఓషధీపాలునకున్ = చంద్రునికి, ఒప్పగించెననన్ = అప్పగించెనను నటుల, పైన్ = ముఖముమీఁద, సురభి = వాసించుచున్న, శ్వసనంబు = గాలిని, నించెన్=నిండించెను.

తా. గ్రీష్మమందు బలహీనుఁడై బాతాళమునకు వెళ్లుచున్న మన్మథుని వెన్నంటి సూర్యదీప్తికి వెఱచి వలసపోవుచున్న వాయువులను, దమవాసనల దొంగిలికొని పోవుచున్నవని పట్టి తామోషధులు గనుకఁ దమకుఁ బ్రభువైన చంద్రునికి నొప్పగించెనో యనునటుల విటులు స్త్రీలముఖములయందలి చెమటాఱవిసరెడు వట్టివేళ్లవిసనకఱ్ఱలు ప్రాప్తమండెననియు, నప్పగించిన సురభిశ్వసనము మలయమారుతము. స్త్రీల ముఖములు చంద్రుఁడు. వాయువు దొంగ యనియును భావము.

చ. సమసి కథావశిష్టమగు • చందనశైలసమీరణంబుఁ గృ
త్రిమగతి నింద్రజాలమునఁ • దేఁ దొడఁగె న్భువిఁ దాళవృంతజా
లము లది మాయయాటకుఁ ద•లంప దదీయమయూరపింఛికా
భ్రమణమె సాక్షిగాదె నగ•రంబున నట్టికడిందివేసవిన్. 64

టీ. సమసి = నష్టమై, కథా...బున్ - కథావశిష్టమగు = కథామాత్రమందు మిగులునట్టి, చందనశైలసమీరణంబున్ - చందనశైల = మలయపర్వతమునందలి, సమీరణంబున్=మందమారుతమును, భువిన్=భూమియందు, తాళ...లు - తాళవృంత=విసనకఱ్ఱలయొక్క, జాలములు=సమూహములు, ఇంద్రజాలమునన్=ఇంద్రజాలవిద్యచేత, కృత్రిమగతిన్ = మాయచేతను, ని. 'వ్యజనం తాలవృంతకం, చక్రం జాతంచజాలక'మ్మనియు నమరము. తేఁదొడఁగెన్=తెచ్చుట కారంభించెను, అది= ఆవాయువులఁ దెచ్చునది, మాయయాటకున్ = కపటమాటకు, తలంపఁగన్ = విచారింపఁగా, తదీయ...మె - తదీయ = ఆతాళవృంతసంబంధియైన, మయూరపింఛికా భ్రమణమె - మయూర= నెమలియొక్క, పింఛికా = పింఛముయొక్క, భ్రమణమె= తిరుగటయె, నగరంబునన్=పట్టణమునందు, అట్టి=అటువంటి, కడిందివేసవిన్=కఠినమగుగ్రీష్మమందు, సాక్షిగాదె=గుఱుతుగాదా.

తా. మిగుల కఠినమగు గ్రీష్మమందు మలయమారుతము నష్టమైపోఁగా దానిని మాయతో గారడివిద్యచేత విసనకఱ్ఱలు దెచ్చెననియు, నది గారడమగుటకుఁ దాళవృంతముల చుట్టును కొనలయందున్న నెమలిపింఛికయె సాక్షియనియు, దాఁగను పింపకయుండి యిట్టివిద్యను జేసెననియును భావము. ఐంద్రజాలికునకు నెమలిపింఛము కావలయు ననుటకుఁ బ్రయోగము. శ్లో. 'భ్రామయన్ బర్హిబర్హాణి మోహయన్ జంతుసంతతిం, విస్మాపయన్ సభాః కశ్చి దాయయా వైంద్రజాలికః' అని.

తే. అట్టివేసవి బెడిదంపు • వెట్టకతన
హస్తము చెమర్ప సారెకు • లస్తకంబు
దుసికిలఁగఁగాదె సవరింప • వసముగాక
పుష్పబాణుని చెఱకువి • ల్పుడమిఁ బడియె. 65

టీ. అట్టివేసవిన్=అట్టిగ్రీష్మమందు, బెడిదంపువెట్టకతనన్ = కఠినమగు వెట్ట చేతను, హస్తము=పాణి, చెమర్పన్=చెమటఁబోయఁగా, సారెకున్=పలుమాఱును, లస్తకంబు=ధనుర్మధ్యము, ని. 'లస్తకస్తు ధనుర్మధ్య'మ్మని నిఘంటువు. దుసికిలఁగఁగాదె=పిడికిటనుండక జాఱిపోవఁగఁగదా, సవరింపన్=చక్కఁజేయుటకు, వసముగాక=వశముగాక, పుష్ప...ల్ - పుష్పబాణుని=మన్మథునియొక్క, చెఱకువిల్=ఇక్షుధనువు, పుడమిన్=భూమియందు, పడియెన్=పతనమాయెను.

తా. అనఁగా నది భూమియందుఁ జెఱకుపండెడుకాల మనుట.

మ. తరుణు ల్దల్లియొఱ న్కుచంబు లునుపం • దచ్ఛైత్యము ల్దీముల్తై
పెరరేఁపం జనుదెంచెఁగాక రవిదీ • ప్తిం గ్రుంక పాతాళగ
హ్వారముం దూఱినవాని నీయదుకుత్రా • ళ్లా తెచ్చు నా దీర్ఘత
చ్చిరకృష్టింగనునట్టి శైత్య మలరిం • చె న్నూతులం దత్తఱిన్. 66

టీ. తరుణులు=యువతులు, తల్లియొఱన్ = నూతులకుఁ గట్టియున్న పెద్దయొరమీఁదను, కుచంబులునుపన్=నీళ్లుజేఁదునప్పుడు స్తనములానింపఁగా, తచ్ఛైత్యముల్ - తత్=ఆకుచములయొక్క, శైత్యముల్=చలువలు, దీముల్తై=పాటిగువ్వలై, (పాటిగువ్వయనఁగా స్వజాతిపక్షుల నాకర్షించుటకుఁ బెంపఁబడినపక్షి. ఊదక శైత్యమున కాకర్షకంబులై యనుట), పెరరేఁపన్=ప్రేరేపింపఁగా, చనుదెంచెఁగాక - శైత్యము వచ్చెఁగాక, అట్లుగాకుండెనేని, రవిదీప్తిన్=సూర్యప్రతాపముచేతను, క్రుంకన్=అణఁగి, పాతాళగహ్వారమున్ = పాతాళబిలమును, ని. 'దేవఖాతబిలే గుహా, గహ్వార'మ్మని యమరము. దూఱినవానిన్=చొచ్చినయుదకశైత్యములను, ఈయదుకుత్రాళ్లా = ఈ ముళ్లువేసినత్రాడులా, తెచ్చున్=తేఁగలవు, నాన్=అనఁగా, దీర్ఘ...ష్టిన్ - దీర్ఘ=పొడవైన, తత్=ఆత్రాళ్లయొక్క, చిర=తడవైన, కృష్టిన్=చేఁదుటచేతను, కనునట్టి శైత్యములు = పొందునట్టిచల్లఁదనములు, అత్తఱిన్=అగ్రీష్మమున, నూతులందున్=చేఁదుడుబావులయందు, అలరించెన్=సంతోషపెట్టెను.

తా. శ్లో. 'కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీకుచా, శీతకాలేభవే దుష్ణ ముష్ణకాలేతు శీతల'మ్మను న్యాయముంబట్టి బావులయందు నీళ్లుచేఁదెడి తరుణుల యొక్క కుచములు తల్లియొఱమోఁపఁగ నాకుచశైత్యములు పాటిగువ్వలై సూర్యకిరణములకు వెఱచి పాతాళము దూఱుకొనియున్న శైత్యమును రేఁపఁగాఁ జనుదెంచెఁగాని

యీముళ్ళు వేసిన త్రాళ్లు తెచ్చునా యనునట్లు నూతులయందున్న నీళ్లచల్లఁదన మట్టి గ్రీష్మమునందు మిగుల సంతోషము పెట్టె నని తాత్పర్యము. నూతులలోనీళ్ళు పాతాళమునంటె ననిభావము.

మ. స్వనిదానోగ్రనిదాఘవైఖరిన యూ•ష్మన్మల్లిక ల్కామినీ
కనదానీలకచాగ్రపఙ్క్తి నెఱియ•ల్గాఁ బాపఁగాఁ బాటల
ల్ఘనతం దేనియసోనఁ గూర్చునది యాఁ•గా నాభియు న్నిర్విషం
బును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణం•బు ల్చూపఁ గాఁ జూడమే.

టీ. స్వని ..న - స్వ=తమకు, నిదాన = కారణమైనట్టి, నిదాఘవైఖరిన = వేసవివలనే, మల్లికల్=మల్లెలు, ఊష్మన్=వేఁడిమిచేత, కామినీ...న్ - కామినీ=స్త్రీలయొక్క, కనత్=ఒప్పుచున్నట్టి, ఆనీల=సర్వమునల్లనైన, కచాగ్రపఙ్క్తిన్=తలవెండ్రుకలకొనలను, నెఱియల్గాన్ = పగిలి బ్రద్దలగునట్లుగా, పాపఁగాన్ = పాయఁజేయఁగా, పాటలల్ = కలిగొట్టుపుష్పములు, 'పుష్పేక్లీబేపిపాటలా' అనియమరము. ఘనతన్=అధికమగునట్లుగా, తేనియసోనన్ = మధుస్రవముచేతను, కూర్చున్=ఆకచాగ్రపుబ్రద్దలనుమరలఁగలియునట్లు చేయును, అదియాఁగా=ఒకఋతువునందుఁబుట్టినద్వివిధంబులగు పుష్పములకు విరుద్ధముగనుండు రెండుగుణము లెట్లుగల్గునఁగాయుక్తంబే, నాభియు=విషము, నిర్విషంబును=అమృతమును, తోఁబుట్టువులయ్యున్, గుణంబులు=నైజగుణంబులను, వేర్పడన్=తెలుపడునట్లు, చూపఁగాన్=అగపఱుపఁగను, చూడమె= చూడలేదా (చూచితిమనుట).

తా. గ్రీష్మమున మల్లెలు పాదిరిపువ్వులును మెండుగనుండుటవలన మల్లెలు ధరియింపఁగా నవి విచ్చుటవలన స్త్రీలతలవెండ్రుకలు వదలుననియు పాదిరిపువ్వులధరియింపఁగా నందున్న దేనెసోనచేత విచ్చియున్నకచాగ్రములు మరలఁ గదిసియుండుననియు తోఁబుట్టువులైనను భిన్నగుణంబులు గల్గియున్న విషామృతములంబలె మల్లెలు పాదిరపువ్వులు నొకఋతువునందుఁ బుట్టినవైనను భిన్నగుణంబులను ప్రకాశింపఁజేయుచుండెను.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయు•క్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుహృతమాం•త్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సం•ధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాం•తర్వారికేళాంబువుల్. 68

టీ. కేళి...ల్ - కేళికాంతార=శృంగారవనముల యొక్క, అభ్యంతర=నడుమనున్న, వాలుకా= ఇసుకయందు, స్థిత=ఉంచఁబడిన, హిమాంతః=అంతశ్శీతముగల,

నారికేళాంబువుల్ = టెంకాయనీళ్లు, తారుణ్యా...రు-తారుణ్య=తరుణత్వమును, అతిగ=అతిక్రమించిన, చూత=మామిడిచెట్లయొక్క, నూత్నఫల=దోరపండ్లతోడను, యుక్=కూడినట్టి, తైల=నూనెయొక్క, అభిఘార=తిరుగఁబోఁతచేతను, స్వనత్=ధ్వనించుచున్నట్టి, ధారా=అవిచ్ఛిన్నముగ, ధూపిత=పొగపఁబడినట్టి, శుష్యత్=శోషించుచున్న, అంబు=ఉదకముగల ప్రదేశమువలన, హృత=తేఁబడినట్టి, మాత్స్య=మత్స్యసంబంధియగు, ఛేద=శకలములయొక్క, పాక=జీర్ణకాలమందు, ఉద్గత=ఊర్ధ్వముగ వెళ్లివచ్చునట్టి, ఉద్గారంబు=త్రేఁపులయొక్క, కనరు = కనరువాసనను, భోగులకున్ = భోగానుభవశాలురకు, సంధ్యావేళలన్ = సంధ్యాకాలములందు, అర్చున్=అణఁచును.

తా. అనఁగా నాగ్రీష్మకాలమందు భోగపరులయిన పురుషులు మామిడికాయలతో వండుచున్న నూనెవలన గమ్మునునట్లు దిరుగఁబోసినచేఁపలతో భోజనముఁజేసిన త్రేఁపులు విడువఁగ నది కనరుగనుండును గాన నాకనరు మట్టుపడుటకుఁగా శృంగారవనములయందలి యిసుకలో స్థాపించియుండుటవలన నతిశీతలమగు టెంకాయనీళ్లను సంధ్యాకాలములయందుఁ ద్రాఁగుచుందురు.

క. గ్రామగ్రామంబున నొక
సామంతున కిడినచలువ•చప్పరములు * త
ర్చై మేదినిఁ గుంపటిలోఁ
దామరలుంబోలె నట్టి•తటి నొప్పారెన్. 69

టీ. గ్రామగ్రామంబునన్=ఊరూరనున్న, ఒకసామంతునకున్ = ఒక్కొకదొరకుఁగా, ఇడిన = దట్టముగ వేసిన, చలువచప్పరములు = చలువపందిళ్లు, తర్చై=మెండై, (తఱ్ఱై యనుపాఠమందుఁ దనియఁజేయునవియై యనియర్థము.) అట్టితటిన్=ఆవేసవియందు, మేదినిన్ = పుడమియందు, కుంపటిలో = కుంపటిలోనున్న, తామరలుంబోలె=కమలములవలెను, ఒప్పారెన్=ఒప్పెను.

తా. ప్రతిగ్రామమునందుండెడి దొరలకుఁగా వేసిన యనేకములగు చలువపందిళ్లు మెండై యాగ్రీష్మకాలమందు భూమిలోఁ గుంపటియందుఁ దామరలు మొలిచినరీతి నుండెను.

తే. తోఁటఁ బగ లుండి మల్లెలు • దుఱిమి కావు
లమర మాపైన నిత్తుయం•త్రముల కొయ్యఁ
జేరుప్రజ వ్రాల్చె భావివృ•ష్టికిని గ్రుడ్డు
తో మధురిమేచ్ఛ డిగునెఱ్ఱ•చీమ లనఁగ. 70

* తఱ్ఱై.

టీ. తోఁటన్=తోఁటయందు, పగలుండి=పవలెల్లనుండి, మాపైనన్=ప్రాద్దుగ్రుంకఁగా, మల్లెలుముడిచి=మల్లెపువ్వులు శిరంబునముడుచుకొని, కావులమరన్=చంద్రకావివస్త్రములుధరియించి, ఇక్షుయంత్రములకున్ = చెఱకుగానిగెలసమీపమునకు, ఒయ్యఁజేరు=మెల్లఁగఁబ్రవేశించుచున్న, ప్రజ=జనము, భావివృష్టికిన్=ముందుగాఁగలవర్షమునకు, గ్రుడ్డుతోన్ = గ్రుడ్డుమోచికొని, మధురిమేచ్ఛన్=తీపుమీఁదికాంక్షచేతను, డిగు = దిగివచ్చునట్టి, ఎఱ్ఱచీమలనఁగన్ = రక్తపిపీలికలనునట్లు, పొల్చెన్=ఒప్పెను.

తా. పగలెల్లను దోఁటలలోనుండి యస్తమింపఁగ మల్లెపువ్వులను శిరంబుల ధరియించుకొని చెఱకుగానిగెల సమీపములను మెల్లఁగఁజేరుచున్న ప్రజలఁ జూడఁగా ముందువర్షమునకు సూచకంబై గ్రుడ్డుతోఁగూడఁ దీపువస్తువులమీఁదియాశచేత దిగి వచ్చుచున్న యెఱ్ఱచీమలో యనునటుల నొప్పుచుండెను.

క. అప్పెను వేసవి విభవము
విప్పుగఁ దన్నగరనికట • వృషగిరి హరికిం
దెప్పతిరుణాళ్ళ రా ముద
మొప్ప న్బరదేశవిప్రుఁ • డొక్కఁడు భక్తిన్. 71

టీ. అప్పెను వేసవిన్=ఆగ్రీష్మమందు, విభవము = వైభవము, విప్పుగన్= విస్తరింపఁగాను, తన్న...కిన్ - తన్నగర=ఆమధురయొక్క, నికట=సమీపమందలి, వృషగిరిహరికిన్ = అళఘరియందుండు సుందరబాహుస్వామికి, తెప్పతిరుణాళ్ల= ఉడుపోత్సవము, రాన్ = రాఁగా, భక్తిన్ = ప్రియభక్తిచేతను, ముద మొప్పన్= సంతసము పొల్చునటుల, ఒక్కఁడు=ఏకాకియైనట్టి, పరదేశవిప్రుఁడు=పరదేశమందలిబ్రాహ్మణుఁడు.

తా. సుగమము.

క. సేవించి పోవుతఱి మధు
రావిభవముఁ జూడ వచ్చి • శ్రాంతిమెయి న్మా
పా వైఘనీటఁ గృతసం
ధ్యావిధియై నృపపురోహి • తావాసమునన్. 72

టీ. సేవించి=భజించి, పోవుతఱిన్=పోవునపుడు, మధురావిభవము=మధురాపట్టణపుశృంగారమును, చూడవచ్చి=కన్గొనుటకువచ్చి, శ్రాంతిమెయిన్ = బడలికచేతను, మాపు=సాయంకాలమునందు, ఆ వైఘనీటన్=ప్రసిద్ధంబగు నావైఘయను నదీతీర్థంబులందు, కృత...విధియై - కృత = చేయఁబడిన, సంధ్యావిధియై = సంధ్యా

నుష్ఠానముగలవాఁడై, నృపపురోహితావాసమునకు = రాజపురోహితునిగృహముం జేరి యందు.

తా. ఆ విప్రుఁడు సుందరబాహుస్వామిని సేవించిపోవు సమయమున నామధురాపురవైభవంబులఁ జూచు నిచ్ఛగలవాఁడై వచ్చి బహళి సాయంకాలమునం దాప్రసిద్ధంబులగు వైఘ యను నదీతీర్థంబులయందు సంధ్యావందనాద్యనుష్ఠానములం బరిసమాప్తి నొందించి రాజపురోహితునియొక్క యిల్లు సొచ్చి యని యభిప్రాయము.

సీ. పరిపక్వసురభిరం•భాఫలంబులతోడ,
దలమెక్కు పనసపెం•దొలలతోడ
ఘృతపిండనిభకర్క•రీఖండములతోడఁ,
బలుదెఱంగుల మావి•పండ్లతోడ
గోస్తనీమృదుగుళు•చ్ఛస్తోమములతోడఁ,
గప్పు దేరిన వడ•పప్పుతోడ
సుమధురస్థూలదా•డిమబీజములతోడఁ,
* దనరారు రసదాడి•గనెలతోడఁ
తే. బానకం బతిథుల కిడఁ•దానుఁ గ్రోలి
యర్చనాదత్తచందన•చర్చఁ దేలి
విరులు సిగఁ దాల్చి కర్పూర•వీటిజబురు
గొట్టుచు ద్విజుండు వెన్నెల•బెట్టుగాయ. 73

టీ. పరి...తోడన్ - పరిపక్వ=క్రమముగఁబక్వమై, సురభి=పరిమళించుచున్న, రంభాఫలంబులతోడన్ =అరఁటిపండ్లతోడను, దలమెక్కు--బలిసియున్న, పనసపెందొలలతోడన్=పనసతొలలతోడను, ఘృత...తోడన్-ఘృతపిండనిభ= నేతికరడులవంటి, కర్కరీఖండములతోడన్ =దోసపండ్ల బ్రద్దలతోడను, ని. 'ఉర్వారుః కర్కరీస్త్రియా' మ్మనియమరము.పలు...తోడన్-పలుదెఱంగుల=అనేకవిధములయిన, మావిపండ్లతోడన్=చూతఫలంబులతోడను, గోస్తనీ...తోడన్ - గోస్తనీ=ద్రాక్షయొక్క, ని.'మృద్వీకా గోస్తనీద్రాక్షా' యనియమరము. మృదు=కోమలంబులగు, గుళుచ్ఛ=గుత్తులయొక్క, స్తోమంబులతోడన్=సమూహములతోడను, కప్పుదేరినవడపప్పుతోడన్=పొట్టువదలినవడపప్పుతోడను, సుమధుర...తోడన్ - సుమధుర=మిక్కిలి యుఁ దీపై, స్థూల=గొప్పలైయున్న, దాడిమబీజములతోడన్=దానిమ్మగింజలతోను, తన...తోడన్ - తనరారు=పొడమెన, (తనువారు అను పాఠమునఁ దృప్తికరములైన

* తనువారు.

యనియర్థము.) రసదాడిగ నెలతోడన్=రసదాడిచెఱకుగడలతుంటలతోను, పానకంబు =పానకమును, అతిథులకున్=అతిథులైన బ్రాహ్మణులకు, ఇడ్డన్=ఆయింటిబ్రాహ్మణుండియ్యఁగా, తాను, క్రోలి=పుచ్చుకొని, అర్చ...న్ - అర్చనా=పూజాకాలమందు, దత్త=ఇయ్యఁబడిన, చందన=శ్రీగంధముయొక్క, చర్చన్=పూఁతచేత, తేలి= తోఁగి, విరులు=పుష్పంబులు, సిగన్=శిఖయందు, తాల్చి=ధరియించి, కర్పూరవీటి జబురుగొట్టుచున్=కర్పూరమతిశయించినవిడియముచే జబురుకొట్టుకొనుచు, వెన్నెల బెట్టుకాయన్=మంచివెన్నెలగాయఁగా, ద్విజుఁడు=అపరదేశబ్రాహ్మణుఁడు.

తా. పండిన యరఁటిపండ్లు బెద్దవిగానున్న పనసతొలలు దోసపండ్ల బ్రద్దలు ననేకవిధములైన మామిడిపండ్లు ద్రాక్షగుత్తులు తీపుగలదాడిమువిత్తులు పొడవైనచెఱకుతుంటలు వీనితో నాయింటిబ్రాహ్మణుం డతిథులకుఁ బానకంబిచ్చునెడఁ దానును బానముసేసి తొలుతనిచ్చియున్న చందన మలఁదికొని పుష్పముల సిగయందు ధరియించి కర్పూరయుక్తంబైన తాంబూలము వేయుచు మంచి వెన్నెలయం దాపరదేశబ్రాహ్మణుం డుండఁగా.

తే. మాత్రసంచి తలాడగా • మార్గవేది
నొక్కఁ డార్యలు గీత లొం•డొకఁడు దా సు
భాషితంబులుగాఁ దోడి•బ్రాహ్మణౌఘ
ముబుసుపోకకుఁ జదువఁ బ•రున్న వేళ. 74

టీ. మాత్రసంచి = అసిమిసంచిని, తలాడగాన్ = తలగడబిల్లగాఁబెట్టుకొని, మార్గవేదిన్=త్రోవయందున్నయరుఁగుమీఁదను, ఒక్కఁడు = ఒకబ్రాహ్మణుండు, ఆర్యలు=ఆర్యావృత్తములను, ఒండొకఁడు=మఱియొక్కఁడు, గీతలు=గీతలనుశ్లోకములను, తాన్=తాను, సుభాషితంబులుగాన్=నీతిశ్లోకంబులుగా, తోడిబ్రాహ్మణౌఘము=తనతోఁబరుండియున్న బ్రాహ్మణులు, ఉబుసుపోకకున్=ప్రొద్దుపుచ్చుకొనుటకు, చదువన్=పఠింపఁగా, పరున్నవేళన్=పండియున్న సమయమున.

తా. అసిమిసంచిఁ దలగడబిళ్ళం జేసికొని మార్గములో నున్న తిన్నెమీఁద నొకఁ డార్యావృత్తములు మఱియొకండు గీతలును, దాను నీతిశ్లోకములు నిట్లు తనతోఁగూడ నున్న బ్రాహ్మణులును బ్రొద్దుఁబుచ్చికొనుటకుఁ బఠింపఁగాఁ బరుండియుండఁగా.

సీ. పన్నీటితోఁ గదం•బముఁ జేసి పూసిన,
మృగనాభిపస రాచ•నగరు దెలుపఁ
బాటలానిలము లా•ర్పఁగఁ దపారపుఁజుంగు,
లలరుఁ దావికి మూఁగు • నళుల జోఁప

గర్ణడోలామౌక్తిక•చ్ఛాయ లెగఁబ్రాఁకు,
నురుహారరుచులఁ ద్రి•స్తరికిఁ దన్న
శశికాంతి చెంగావి•దసిలి మించిన కేలి,
స్వర్ణత్సరువువాఁడి•వాలు మెఱయ
తే. మెలఁత యడపముఁ దేఁ జర•న్మేరు వనఁగ
దలవరులు గొంద ఱొలసి ముం•దఱఁ జనంగ
నర్థి రథ్యాంతరాంతఃపు•రాంతరమున
భోగినీసంగతికి రాజు • పోవుచుండి. 75

టీ. పన్నీటితోన్ = పన్నీటితోడను, కదంబముఁ జేసి = పరిమళద్రవ్యముల నన్నిటిఁ గలిపి, పూసిన...స - పూసిన = అలఁదినట్టి, మృగనాభి = కస్తూరియొక్క, పస = మేలిమి, రాచనగరు = రాజగృహమును, తెలుపన్ = కనుపఱుపఁగా, (కస్తూరి రాజులకుఁ దక్క సామాన్యులకుఁ జిక్కదనుట), పాటలానిలములు - పాటల = కలిగొట్లుపుష్పములయొక్క, అనిలములు = గాడ్పులు, అర్వఁగన్ = విసరఁగా, తసాదపుఁజుంగులు = తలనుజుట్టియున్న వస్త్రపుఁ జుంగులు, అలరుఁదావికిన్ = పుష్పవాసనలకు, మూఁగు నళులన్ - మూఁగు = చుట్టుకొనునట్టి, అళులన్ = తుమ్మెదలను, సోఁపన్ = తోలఁగా, కర్ణ...లు - కర్ణ = శ్రోత్రములందు, డోలా = కదలుచున్న, మౌక్తిక = ముత్యములయొక్క, ఛాయలు = కాంతులు, ఎగ...లన్ - ఎగఁబ్రాఁకు = పైకెగయునట్టి, ఉరు = అధికమైన, హార = ముత్యాలదండలయొక్క, రుచులన్ = కాంతులను, త్రిస్తరికిన్ = వెనుకకు, తన్నన్ = కాలఁద్రోయఁగా, శశి...లు - శశి = చంద్రునియొక్క, కాంతి = కాంతివంటి కాంతిగల, చెంగావిదసిలి = చెంగావిరుమాలు, మించిన = మీఱిన, కేలి = చేతఁబట్టిన, స్వర్ణత్సరువు = బంగారుపరుఁజుగల, వాఁడివాలు = తీక్ష్ణఖడ్గము, మెఱయన్ = ప్రకాశింపఁగా, మెలఁత = ఒకస్త్రీ, అడపముఁ దేన్ = అడపంబుఁ దేఁగా, చరన్మేరువు = నడగూడు మేరుపర్వతము, అనఁగన్ = అనునట్టుల, తలవరులు = తలారులు, కొందఱు = కాపుగానుండు కొందఱు, ఒలసి = కనిపెట్టి, ముందఱన్ = పురోభాగమునందు, చనఁగన్ = పోఁగా, అర్థిన్ = ఆసక్తిచేతను, రథ్యాంతరాంతఃపురాంతరమునన్ - రథ్యాంతర = మార్గమధ్యమందలి, అంతఃపురాంతరమునన్ = రండనయంతఃపురమువలె నున్న గృహమునందు, భోగినీసంగతికిన్ = భోగస్త్రీని భోగించుటకొఱకు, రాజు = పాండ్యుఁడు, పోవుచుండి = వెళ్లుచుండి.

తా. సులభము.

చ. వినియె నెల ల్చతుర్ద్వయిని • వృష్టిదినాలికి రాత్రికై దివం
బున జరకై వయస్సునను • బూని పరంబున కప్పు డుద్యమం

బనువుగఁ జేయఁగా వలయు•నంచుఁ బురోహితధర్మ మాత్మ గీ
ల్కొన నలవిప్రుఁ డాద్విజుల•లోన సుభాషితము ల్పఠింపఁగన్. 76

టీ. వృష్టిదినాలికిన్ = వర్షాకాలమైన నాలుగుమాసములకు, నెలల్ చతుర్ద్వయిని= తక్కినయెనిమిదినెలయందును, రాత్రికిన్, దివంబున్ = పవటియందును, జరకై =ముదిమికై, వయస్సునను, పూని=ఆరంభించి, పరంబునకున్ = పరలోకమునకు, ఇప్పుడు=ఈశరీరమందే, ఉద్యమంబు=ప్రయత్నము, అనువుగన్ = లెస్సగా, చేయఁగావలయున్=చేయవలయును, అంచున్=అనుచును, పురోహితధర్మము, పురః= ముందటికి, హిత=క్షేమకరంబైన, ధర్మము = న్యాయము, ఆత్మన్ = బుద్ధియందు, కీల్కొనన్=నాటునట్లుగ, అలవిప్రుఁడు= ఆబ్రాహ్మణుఁడు, ద్విజులలోన్=విప్రుల లోపల, సుభాషితముల్=నీతిప్రతిపాదకశ్లోకములను, పఠింపన్ = చదువఁగా, వినియెన్= = విన్నవాఁడాయెను.

తా. 'వర్షార్థమష్టౌప్రయతేతమాసా న్నిశార్థమర్థం దివసేయతేత, వార్ధక్యహేతోర్వయసానవేన పరత్రహేతోరిహజన్మనాచ' అను శ్లోకార్థముచొప్పున వర్షాకాలమైన నాలుగుమాసములకు వలయువస్తుసామగ్రులను మిగతయగు నెనిమిది మాసములయందును, రాత్రికిఁ బవటియందును, జరకు వయస్సునందును, పరలోకమునకు వర్తమానశరీరమందును, చేయందగిన ప్రయత్నములను బాగుగాఁ జేయవలయు నని ముందటికి హితమగు న్యాయము మనంబున కంటునట్లుగా నాబ్రాహ్మణుండు విప్రులనడుమనుండి నీతిశ్లోకములఁ బఠింపఁగా నపాండ్యరాజు వినియె నని యభిప్రాయము.

క. విని తద్గ్రంథార్థము నె
మ్మనమున నూహించి తెలిసి • మ్రాన్పడి కడకుం
దన మోసమునకు భయపడి
జనపతి యటుచనక నిలిచి • సంతాపమునన్. 77

టీ. విని, తద్గ్రంథార్థమున్=అశ్లోకములయభిప్రాయమును, నెమ్మనమునన్= నిండుమనస్సునందు, ఊహించి=ఆలోచించి, తెలిసి=ఎఱింగి, మ్రాన్పడి=స్తబ్ధచిత్తుఁడై, కడకున్=చివఱకు, తన=తనయొక్క, మోసమునకున్=ప్రమాదమునకు, భయపడి=భీతిల్లి, జనపతి=రాజు, అటుచనక = భోగినీగృహమునకుఁబోక, సంతాపమునన్=పరితాపముచేత, నిలిచి, పైపద్యములోక్రియ.

ఉ. ఎక్కడిరాజ్యవైభవము • లెక్కడిభోగము లేటిసంభ్రమం
బక్కట బుద్బుదప్రతిమ•మైనశరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి యుగ•సంధుల నిల్పియుఁ గాలుచేతిబల్
త్రొక్కుల నమ్మనుప్రభృతు•లున్ దుద రూపఱ కుండ నేర్చిరే. 78

టీ. ఎక్కడిరాజ్యవైభవములు = రాజ్యమేమిశాశ్వతము, ఎక్కడిభోగములు =తనభోగమేమినిత్యము, ఏటిసంభ్రమంబు = ఎక్కడిసంతోషము, అక్కట=కట కట, బుద్బుదప్రతిమమైన = నీరుబుగ్గతోడఁ దుల్యంబైన, శరీరమునమ్మి = దేహము నిత్యమనినమ్మి, మోక్షపుంజక్కి=మోక్షమార్గమును, గణింపక= లక్ష్యపెట్టక, ఉంటిన్ =ఉన్నవాఁడనైతిని. యుగసంధులన్=ఒక్కొకయుగము ముగియునప్పుడును, నిల్చి యున్=ఉండియును, కాలు...లన్ - కాలుచేత=యమునిచేతనైనను, ఒత్త్రొక్కుళ్లన్ =విశేషమగుత్రొక్కుళ్లచేత, అమ్మనుప్రభృతులున్ = ప్రసిద్ధులైనమన్వాదులును, తుదన్=శరీరత్యాగకాలమందు, రూపఱక=రూపునష్టముగాకుండఁగ, ఉంపనేర్చిరే =ఉండఁగలిగిరా.

తా. ఆవిప్రుండు సెప్పిననీతిశ్లోకముల యభిప్రాయమును గ్రహించి మనం బున మిగులవిచారించి స్తబ్ధచిత్తుఁడై చివరకుఁ దనకుం గలిగెడు ప్రమాదమునకు భీతిల్లి యప్పాండ్యరాజు భోగినీగృహమునకుఁ బోక మార్గమునందే నిలిచి పరితాపముచేత రాజ్య మేమి శాశ్వతము భోగ మేమి నిత్య మెక్కడి సంతోషము కటకటా నీరు బుగ్గతో సమానంబగు నీశరీరమును నమ్మి మోక్షమార్గము విచారింపనైతి నొక్కొక యుగవత్సరములు భూమినిఁ బాలించినమన్వాదులు దమతమశరీరములను నిల్పఁగలిగి రా లేదుగదా యని విచారయుక్తుఁడై యుండె నని తాత్పర్యము.

క. ఉన్నట్ల యుండఁగా దరి
కి న్నరులను నావ చేర్చు•క్రియ వెసఁ దాఁ బో
కున్నట్ల యుండి కాలం
బు న్నరులకు వయసుఁ బుచ్చి•మోసముఁ దెచ్చున్. 79

టీ. ఉన్నట్లయుండఁగా=ఉన్నదానింబలెనుండి, నావ=ఓడ, సూ. 'స్తోనావా వా రై నావో' యను సూత్రముచేత నౌశబ్దమున కీరూపంబువచ్చెను. దరికిన్=తీరమునకు, నరులను=మనుష్యులను, చేర్చుక్రియన్=చేర్చులాగున, తాన్ = తాను, వెసఁబోను న్నట్లయుండి=వేగిరముజరిగిపోవున్నట్లుగానుండి, కాలంబు=కాలము, నరులకు=మ నుష్యులకు, వయసుఁబుచ్చి=ఆయువుఁబోఁగొట్టి, సూ. 'సాంతాదపయః ప్రభృతే ష్లోపోఽన్యే షాం చ' యనుసూత్రముచేత ద్విత్వాభావము, మోసముఁ దెచ్చున్= భంగపాటు గలిగించును.

తా. నావ యెక్కఁగా నచటనే యున్నట్టు గనుపడుచు దరికి మనుష్యులఁ జేర్చురీతినిఁ గాలంబును నరులవయసు దెలియకుండునట్లుగఁ జేసి పోఁగొట్టి కడపటికి మోసముఁ దెచ్చు నని తాత్పర్యము.

చ. సగరు నలుం బురూరవుఁ ద్రి•శంకుసుతు న్బురుకుత్సుఁ గా ర్తవీ
ర్యు గయుఁ బృథుం భగీరథు సు•హోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశి•బిందు ననంగుని నంబరీషుఁ బూ
రుఁ గురుని రంతి రాఘవు మ•రుత్తునిఁ గాలము గోలుపుచ్చదే. 80

టీ. షట్చక్రవర్తు లగు సగరుని, నలుని, పురూరవుని, త్రిశంకుని సుతుఁడగు హరిశ్చంద్రుని, పురుకుత్సుని, కార్తవీర్యుని, మఱియు మహారాజులగు గయుని, పృథుని, భగీరథుని, సుహోత్రుని, శిబిని, భరతుని, దిలీపుని, పరశురాముని, యౌవనాశ్వుని (అనఁగా మాంధాత), శశిబిందుని, అనంగుని, అంబరీషుని, పూరుని, కురుమహారాజును, రంతిదేవుని, రాముని, మరుత్తుని, అగు వీరలను కాలము గోలుపుచ్చదే = కాలము మోసపుచ్చలేదా.

తా. సుగమము. ఇచ్చట పేర్కొనఁబడిన మహారాజులు, షోడశమహారాజులును, మఱియునొక్కఁడునని తెలియునది.

క. కానఁ దటిచ్చల మగురా
జ్యానందము మరగి యింద్రి•యారాముఁడనై
పో నింతనుండి పరలో
కానందంబునకె యత్న • మాపాదింతున్. 81

టీ. కానన్=కావునను, తటిచ్చలమగు = మెఱుపువలె ననిత్యమైన, రాజ్యానందము=రాజ్యసుఖము, మరగి=తగిలి, ఇంద్రియారాముఁడనై = ఇంద్రియపరవశుఁడనై, పోన్=పోవను, ఇంతనుండి=ఇదిమొదలు, పరలోకానందంబునకె=పరలోకసుఖమునకే, యత్నము=ప్రయత్నమును, ఆపాదింతున్=ఒనరింతును.

తా. కాలము చక్రవర్తులు మొదలగువారినింగూడ మోసపుచ్చినది. కావున మెఱుపువలె నతిచంచలంబగు రాజ్యానంద మపేక్షించి యింద్రియపరవశుఁడనై యుండక యిదిమొదలు పరలోకసుఖమునకు వలయుప్రయత్న మొనరించెదను.

క. వర్గత్రయపరత ముహు
స్స్వర్గక్ష్మామధ్యమాధ్వ•జాంఘాలికతా
దుర్గతియు నొల్ల మఱి యప
వర్గదుఁ డే వేల్పటంగి • వాని భజింతున్. 82

టీ. వర్గత్రయపరతన్=ధర్మార్థకామాసక్తిచేత, ముహుః=పలుమాఱును, స్వర్గ...యున్ - స్వర్గ=త్రివిష్టపముయొక్క, క్ష్మా=భూమియొక్క, మధ్యమ=మధ్యప్రదేశమండలి, అధ్వ=మార్గమునందు, జాంఘాలికతా=సత్వరగమనమనియెడు, దుర్గతిన్=

నరకమును, 'నిరయోదుర్గతిస్త్రీ స్యాత్' అని యమరుఁడు. ఒల్లక్=ఇష్టపడను, మఱి=మఱియేమనఁగా, అపవర్గదుఁడు = మోక్షము నిచ్చువాఁడు, ఏవేల్పు = ఏదైవమో, ఎఱింగి=తెలిసి, వానిన్=ఆదైవమును, భజింతున్=సేవింతును.

తా. ధర్మార్థకామంబు లనియెడి పురుషార్థత్రయాసక్తిచేతఁ బలుమాఱు స్వర్గము నుండి భూమికి భూమినుండి స్వర్గమునకును బోవుచుండు మార్గమునందు సత్వరగమనము నరకమెల్లను. మఱి యేమన నపవర్గప్రదుం డగునట్టివాఁ డెవ్వఁడో వాని నెఱింగి సేవించుచున్నాఁడను.

క. అని తలఁచి మెచ్చి యవ్వి
ప్రునకు వీటీకరండ•మున ముద్రితమై
యునిచినయొకముడు పార
త్తునిచే నిప్పించి నగరు•సొచ్చి నిశి చనన్. 83

టీ. అని తలఁచి=అట్లని యూహించి, మెచ్చి=తన కిట్టి జ్ఞానముఁ గలుగఁజేసి నందులకై సంతసిల్లి, అవ్విప్రునకున్=ఆబ్రాహ్మణునికి, వీటీకరండమునన్—వక్క లాకుల బరణియందు, 'గడుఃకరణ్డోలగుడో వరణ్డాశ్చకిణోఘుణః' యని పుంలింగశేషమునం దమరుఁడు. ముద్రితమై=ముద్రింపఁబడి, ఉనిచిన=ఉంచఁబడియున్న, ఒక ముడుపు=వరాలమూల్లెయొకటి, ఆరత్తునిచేన్=అమూల్లెపాలించువానిచేతన్, ఇప్పించి, నగరు = రాజగృహమును, చొచ్చి=ప్రవేశించి, నిశి=రాత్రి, చనన్=వెళ్లఁగా.

తా. అపాండ్యరాజు పూర్వోక్తప్రకారంబుగ నూహించి తన కిట్టి జ్ఞానముఁ గలుగఁజేసిన యవ్విప్రువిషయమై యానందమొంది యతనికిఁ దాంబూలకరండంబున ముద్రింపఁబడి యుంచియున్న వరాలముడు పొకటి యాధనరక్షకునిచేత నిప్పించి తాను నగరు ప్రవేశించి తెల్లవాఱిన పిమ్మట.

క. కొలువై బహుసమయంబులఁ
మెలఁగెడు కోవిదులఁ జూచి • మీమాంశాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం
బెలయించునో చూచి నిశ్చ•యింపుఁ డటంచున్. 84

టీ. కొలువై=ఆస్థానమందుఁగూర్చుండి, బహు...లన్ – బహు=అనేకవిధంబులగు, సమయంబులన్ = సిద్ధాంతములయందు, ని. 'సమయాశ్శపథాచార కాల సిద్ధాంతసంవిద'యని నిఘంటువు. మెలఁగెడుకోవిదులన్ – మెలఁగెడు=సమర్థులైన, కోవిదులన్=పండితులను, చూచి = వీక్షించి, మీమాంశాస్త్రంబులలోన్, ఎవ్వఁడు, మోక్షంబు=అపవర్గమును, ఎలయించునో=పొందించునో, చూచి నిశ్చయింపుఁడు=పరిశీలనఁజేసి నిర్ణయింపుఁడు, అటంచున్=అలాగని, పైపద్యములో క్రియ.

తే. వాద మొనరించి గెలిచి త॰త్త్వంబు దెలుపు
వాని కని బీరపువ్వులఁ॰బోని టంక
సాలవాటులు నించి యా॰స్థానిఁ గట్టఁ
గాలసర్పముగతి వ్రేలు॰జాలెఁ జూచి. 85

టీ. వాద మొనరించి = ప్రసంగముసేసి, గెలిచి=జయమునొంది, తత్త్వంబుఁ దెలుపువానికని=ఇదియ సత్యం బని కనుపఱుచువానికనుచు, బీర...లు - బీరపువ్వులఁ బోని=బీరపువ్వులవంటి, టంకసాలవాటులు=క్రొత్తముద్రలు వేసినమాడలను, నించి= నిండఁబోసి,ఆస్థానిన్=సభయందు,ని. 'ఆస్థానీ క్లీబమాస్థాన'మ్మనియమరము. కట్టన్= కట్టఁగా, కాలసర్పముగతిన్ = కృష్ణసర్పమువలె, వ్రేలుజాలెన్ = వ్రేలాడుచున్న జాలెను, చూచి=వీక్షించి.

తా. ఆస్థానమం దాపాండ్యరాజు గూర్చుండి యున్నవాఁడై యనేకశాస్త్ర సిద్ధాంతములు దెలిసికొనియున్న పండితోత్తముల రావించి వారినిం జూచి మీమీశాస్త్రములయందుఁ జక్కఁగా విచారించి మోక్షప్రదుం డైనదేవుఁ డెవ్వఁడో యెఱింగింప వలయు ననుచు బ్రసంగమొనరించి గెలిచి తత్త్వముం దెలిపినవానికి నిప్పించెద నని మాడలచే నింపఁబడిన జాలెను దెప్పించి సభయందుఁ గట్టింప నావరాలజాలెను జూచి యప్పండితులు.

క. హరు నొకఁ డన నుమ నొకఁ డన
హరి నొకఁ డన శిఖి నొకఁ డన ॰ నర్కు నొకఁ డనన్
గరిముఖు నొకఁ డన రజనీ
శ్వరు నొకఁ డన నజు నొకఁ డన ॰ వా దైనతతిన్. 86

టీ. ఒకఁడు=ఒకవిద్వాంసుఁడు, హరుననన్=శివుఁడు మోక్షప్రదుఁడనఁగా, ఒకఁడు = మఱియొకఁడు, ఉమననన్ = శక్తి మోక్షప్రదాత్రియనఁగా, ఒకఁడు = ఒక్కఁడు, హరిన్=ఇంద్రుని, ఒకఁడు = ఒక్కఁడు, శిఖిన్ = అగ్నిని, ఒకఁడు= ఇంకొకఁడు, అర్కున్=సూర్యుని, ఒకఁడు, కరిముఖున్= విఘ్నేశ్వరుని, ఒకఁడు, అజున్ = బ్రహ్మను, (వీరలు మోక్షప్రదాతలని) వాదు = ప్రసంగము, ఐనతతిన్ = ఐనసమయమందు.

తా. సుగమము.

తే. విల్లిపుత్తూరులో నల్ల॰విష్ణుచిత్తుఁ
డతులతులసీసుగంధమా॰ల్యమును మాల

మంత్రమున నక్కు సేర్చుచో • మన్ననారు
దారమధురోక్తి * నిట్లని • యానతిచ్చె. 87

టీ. విల్లిపుత్తూరిలోన్ = శ్రీవిల్లిపుత్తూరియందు, అల్లవిష్ణుచిత్తుండు = ఆవిష్ణుచిత్తుండు, అతుల...ను - అతుల=శ్రేష్ఠమైన, తులసీ=తులసిచేతను, సుగంధ=పరిమళించుచున్న, మాల్యమును=పుష్పమాలికను, మూలమంత్రమునన్=శ్రీమదష్టాక్షరియను మహామంత్రముచేత, అక్కు సేర్చుచో = వక్షస్స్థలమందు సమర్పించునపుడు, మన్ననారు=మన్నారుస్వామి, ఉదార=గంభీరమైన, మధురోక్తిన్=తియ్యనిమాటలచేత, ఇట్లని=ఇవ్విధముగ, ఆనతిచ్చెన్=సెలవిచ్చెను.

తా. శ్రీవిల్లిపుత్తూరులోనున్న యావిష్ణుచిత్తుండు శ్రేష్ఠంబగు తులసీదళములచేఁ బరిమళించుచున్న వనమాలిక నష్టాక్షరియను మహామంత్రంబగు మూలమంత్రమును జపించుచు వక్షస్స్థలంబున సమర్పింపఁగ నాసమయంబున మన్నారుస్వామి గంభీరమైన తియ్యనిమాటలచేత నిట్లని యానతిచ్చెను.

ఉ. నేఁడు మహామతీ మధుర • నీవు రయంబునఁ జొచ్చి యందుఁ బాం
డీఁడు దివాణము న్నెఱయ • † నించినఁ బ్రేలెడుదుర్మదాంధులన్
బోఁడిమి మాన్పి మన్మహిమ • ముం బ్రకటించి హరింపు శుల్కమున్
వాఁడును రోసినాఁ డిహము • వైష్ణవుఁగా నొనరింపు ‡ సత్కృపన్.

టీ. మహామతీ=మహాజ్ఞానముగల విష్ణుచిత్తుఁడా, నేఁడు=ఈప్రొద్దు, ఈవు=నీవు, మధురన్=మధురాపురమును, చొచ్చి=ప్రవేశించి, అందు - ఆమధురయందు, పాండీఁడు=పాండ్యరాజు (ఇది దేశ్యోక్తి), దివాణమున్=ఆస్థానమును, నెఱయన్=నిండునట్లుగా, నించినన్=నింపఁగా, ప్రేలెడు = నానావిధంబులుగఁ బలుకుచున్న, దుర్మదాంధులన్ = దుర్మదముచేత నంధులైనవాండ్రను, పోఁడిమిమాన్పి = గర్వమణంచి, మన్మహిమన్=నాయొక్క మాహాత్మ్యమును, ప్రకటించి - ప్రసిద్ధియొనర్చి, శుల్కమున్=విద్యాశుల్కమును, హరింపు=గ్రహింపుము, వాఁడును- ఆపాండ్యుఁడును, ఇహము=ఈలోకమును, రోసినాఁడు = అసహ్యపడినాఁడు, సత్కృపన్=దయచేత, వైష్ణవుఁగాన్=విష్ణుభక్తునిఁగా, ఒనరింపుము- చేయుము.

తా. మహాబుద్ధిశాలివగు విష్ణుచిత్తుఁడా యని స్వామివారు సంబోధించి నేఁటి దినమున నతివేగముతో మధుర కేతెంచి యందున్న పాండ్యరాజు దివాణము నిండఁ గూర్చుండి నానావిధములుగ బలుకుచున్న దుర్మదాంధులయొక్క కైపు మాన్పి నా మహిమలను కొంతఁ దెలిపి విద్యాశుల్కమును గ్రహించి యీలోకమును రోసియున్న

* నవ్విధ. † జూచిన. ‡ సత్కృతన్.

పాండ్యునిం గృపచేత వైష్ణవుం గావింపు మని మన్నారుస్వామి విష్ణుచిత్తునితో సెల విచ్చెను.

తే. అనిన వడవడవడఁకి సా॰ష్టాంగమెఱఁగి
సమ్మదాశ్రులు పులకలు • ముమ్మరముగ
వినయవినమితగాత్రుఁడై • విప్రవరుఁడు
వెన్నునకు భక్తి నిట్లని • విన్నవించె. 89

టీ. అనినన్=అనఁగా, విష్ణుచిత్తుఁడు, వడవడవడఁకి=మిక్కిలికంపించి, సాష్టాంగ మెఱఁగి=సాష్టాంగప్రణామముఁజేసి, సమ్మదాశ్రులు=ఆనందాశ్రులు, పులకలు=పులకాంకురములు, ముమ్మరముగన్=అతిశయింపఁగా, వినయవినమితగాత్రుఁడై=వినయముచేత వంపఁబడినదేహము గలవాఁడై, విప్రవరుఁడు=బ్రాహ్మణోత్తముండగు విష్ణుచిత్తుఁడు, వెన్నునకున్ = విష్ణునకు, భక్తిన్ = భక్తిచేతను, ఇట్లని = ఈవిధముగా, విన్నవించెన్=విన్నపము సేసెను.

తా. మన్నారుస్వామి యారీతి నాజ్ఞాపింపఁగా భయమునొంది విష్ణుచిత్తుండు సాష్టాంగనమస్కారముం జేసి యానందబాష్పములుఁ బులకాంకురములును విస్తరిల్లఁగా వినయముచేత నమ్రుఁడై విష్ణునకు వక్ష్యమాణక్రమంబుగా భక్తిచేత విన్నవించెను.

శా. స్వామీ నన్ను నితఃపురాపఠితశా॰స్త్రగ్రంథజాత్యంధు నా
రామక్ష్మాఖననక్రియాఖరఖని॰త్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు న్భవద్భవనదా॰సు న్వాదిఁ గాఁ బంపుచో
భూమీభృత్సభ నోట మైన నయశం॰బు న్మీకు రాకుండునే. 90

టీ. స్వామీ = రక్షకుఁడా, ఇతః...ధున్ - ఇతఃపురా = ఇంతకు మున్ను, అపఠిత=చదువంబడని, శాస్త్రగ్రంథ=శాస్త్రగ్రంథములయందు, జాత్యంధున్=పుట్టుగ్రుడ్డివాఁడ నైనట్టియు, ఆరామ...రున్ - ఆరామ=ఉద్యానవనముయొక్క, క్ష్మా=భూమియొక్క, ఖననక్రియా=త్రవ్వుటకొఱకు, ఖర = తీక్ష్ణమైన, ఖనిత్ర = గుద్దలియొక్క, గ్రాహిత=గ్రహించుటచేత, ఉద్యత్=ఏర్పడిన, కిణస్తోమ=కాయల సమూహముచేతను, అస్నిగ్ధ=బిరుసైన, కరున్=హస్తములు గలయట్టియు, భవ...సున్ - భవత్=మీయొక్క, భవనదాసున్ = గృహసేవకుఁడనైనట్టి, నన్నున్=ఇట్టినన్ను, వాదిఁగాన్ = ప్రసంగించువానిఁగాఁజేసి, పంపుచోన్ = అనిపినయపుడు, భూమీభృత్సభన్ = ఆపాండ్యరాజుయొక్కసభయందు, ఓటమైనన్ = ఓటమియైనను, అయశంబున్ = అపకీర్తి, మీకు రాకుండునే = మీకు వచ్చునుగదా.

తా. ఇంతకుమున్ను శాస్త్రముం జదువక జ్ఞానమునందుఁ బుట్టుగ్రుడ్డినైనట్టియు, పూలతోఁట నేలఁ ద్రవ్వుటకుఁ గా గుద్దలిం బట్టుటచేతఁ గాయలు గాచి బిరుసైన హస్తములు గలయట్టియు, మీకో వెలకు దాసుఁడనైనట్టి నన్ను వాదమున కనిపితిరేని యీరాజసభయందు గెల్వ లేక యోటము వచ్చినయెడల దేవరకే యపకీర్తి వచ్చును గదా యని విష్ణుచిత్తుండు విన్నవించెను.

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో • శృంగారపల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో • వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్రధృతియో • * ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల లేరె యితరు • ల్నీలీలకుం బాత్రముల్. 91

టీ. నృహరీ=నృసింహస్వామీ, గృహసమ్మార్జనమో=మీ కోవెలయందుఁ బరిమార్జనముఁజేయుటో, జలాహరణమో=తీర్థంబుఁ దెచ్చుటో, శృంగార పల్యంకికా వహనంబో=విలాసార్థము దేవరవారారోహణముఁజేసిన పల్లకిమోచుటయో, వనమాలికాకరణమో=తులసిదండలుగట్టి సమర్పించుటయో, వాల్ల...బో - వాల్లభ్య = ప్రభుత్వమునకు, లభ్య = పొందఁదగిన, ధ్వజగ్రహణంబో = టెక్కెములు మోచుటయో, వ్యజనాతపత్రధృతియో = విసనకఱ్ఱ గొడుగు వీనిం బట్టుటయో, ప్రాక్ = ముందటను, దీపికారోపమో = దీపముఁ బెట్టుటయో, వాదములేల—వే టెవానికేల, ఇతరుల్=అన్యులు, నీలీలకున్ = నీవిలాసమునకు, పాత్రముల్=తగినవారు, లేరే= లేరా, ఉన్నారనుట. 'క్వచిద్ధర్మవిశేషేతు క్లీబేప్యుభయరూపతా' యను నిఘంట్వుక్తి చేతఁ బాత్రములని యమహద్రూపము.

తా. సుగమము.

తే. అనినఁ దద్భక్తి కెదమెచ్చి • యచ్యుతుండు
మొలకనగవొప్ప శ్రీదేవి• మోము సూచి
వా దితనిచేత గెలిపింతు • నాదుమహిమ
యువిద కను మని ప్రాభవం • బొప్పఁ బలికె. 92

టీ. అనినన్=అనఁగా, తద్భక్తికిన్=అవిష్ణుచిత్తునిభక్తికి, ఎద మెచ్చి—మనంబున మెచ్చి, అచ్యుతుండు=శ్రీహరి, మొలకనగవొప్ప = చిఱునవ్వంకురింపఁగా, శ్రీదేవి మోముసూచి=లక్ష్మిముఖమువీక్షించి, వాదు=వాదము, ఇతనిచేత గెలిపింతున్—అనాఘ్రాతశాస్త్రగంధుఁడైన యీవిష్ణుచిత్తునిచేతనే గెలిపింతును. నాదుమహిమ=నా

* ద్రాగ్దీపికారోపమో.

సామర్థ్యమును, ఉవిద=ఓయువతీ, కనుమని=చూడుమని, ప్రాభవము=ప్రభుత్వము, ఒప్పన్=పొల్పగునట్లుగా, పల్కెన్=మఱియు నొక్కవాక్య మానతిచ్చెను.

తా. ఇట్లనఁగా నావిష్ణుచిత్తునిభక్తికి మెచ్చి మన్నారుస్వామి చిఱునవ్వు వెడలుచుండ శ్రీదేవిముఖము చూచి యితనిచేతనే వాదము గెలిపించెద నాసామర్థ్యముం జూడు మని ప్రభుత్వ మొప్పునటుల మఱియొకవాక్య మానతిచ్చెను.

క. నీయిచ్ఛయె మిన్నక పో
వోయి మునిప్రవర నిన్ను • మెప్పింతును భూ
నాయకసభ నిందులకై
నీయత్నము వలవ దవల • నే నున్నాఁడన్. 93

టీ. మునిప్రవర=మునిశ్రేష్ఠుఁడా, నీయిచ్ఛయె=నీయిష్టమా, మిన్నక=ఊరక, పోవోయి=చనుము, భూనాయక=పాండ్యునిసభయందు, నిన్నున్=నిన్ను, మెప్పింతున్ = సభ్యులు శ్లాఘించునట్లు చేయుదును, ఇందులకై = ఈకార్యమునకై, నీయత్నము = నీప్రయత్నము, వలవదు = అక్కఱలేదు, అవలన్=అవలనడుచుకార్యవిషయమై, నే నున్నాఁడను.

తా. మునిశ్రేష్ఠుఁడ వగు నోయి విష్ణుచిత్తుఁడా, నీయిష్టప్రకారమా, ఊరక వెళ్లు మపాండ్యరాజుయొక్క సభయందు నీకు మెప్పు గలుగఁ జేసెద నిందులకై నీ వేమియుం జేయవల దచ్చటి కార్యముల నెఱవేర్చుటకై నేనున్నాఁడ నని స్వామి యానతిచ్చెను.

ఆ. అనిన మాఱు వలుక • నలికి యయ్యాళువా
రియ్యకొనియెఁ బోవ • నింతలోనఁ
బద్మనయనుఁ డతని•పయనంబుఁ దూగింపు
మనుచు నంబితోడ • నానతిచ్చె. 94

టీ. అనినన్=అనఁగా, మాఱువలుకన్=ప్రత్యుత్తరమిచ్చుటకు, అలికి=వెఱచి, అయ్యాళువారు = అప్పెరియాళ్వారు, పోవన్=స్వామిసన్నిధినుండియాజ్ఞవహించి వెళ్ళుటకు, ఇయ్యకొనియెన్=సమ్మతించెను, అంతలోనన్ = ఆసమయమున, పద్మనయనుఁడు = మన్నారుస్వామి, అతనిపయనంబు = ఆవిష్ణుచిత్తుని ప్రయాణమును, తూఁగింపుము=సాగింపుము, అనుచున్=ఇట్లనుచు, నంబితోడన్=అర్చకునితో, ఆనతిచ్చెన్=ఆజ్ఞాపించెను.

తా. సుగమము.

క. ఆనతిఁబడి శ్రీభండా
రాన స్సంబడమునందు • ప్రాయందలముర్

స్థానికుఁ డొసంగి పనుపం
గా నానతిఁ బడిన నిమిత•కాండ్రు వహింపన్. 95

టీ. ఆనతిఁబడి=స్వామియాజ్ఞనుపొంది, స్థానికుఁడు = పారుపత్తి, శ్రీభండారాన్=ఉగ్రాణమునుండి, సంబడము=బత్తెపుసంబళము,తన...మున్ - తనదు=తన సంబంధియైన, ప్రాయందలమున్=పురాతనమైన యందలమును, ఒసంగి = ఇచ్చి, పనుపన్=అనుపఁగా, ఆనతిఁబడిన=సెలవువెంటనే,నిమితకాండ్రు=మోఁతకాండ్రు, వహింపన్=మోయఁగా.

తా. ఆకోవెలపారుపత్తి స్వామి యానతిచ్చినతెఱంగున నుగ్రాణమునుండి బత్తెపుసంబళము దీసియిచ్చి పురాతనమగు నందలము నొసఁగి పంపఁగా సెలవొందిన మోఁతకాండ్రు మోయుచుండఁగా.

క. లావు గలయట్టిగుజ్జుపుఁ
జావడములమీఁద మాత్ర•సంచులు దూలన్
క్రేవల నేకాంగులు రా
వేవిధముల నరిసె లవని•విభునకుఁ గొనుచున్. 96

టీ. లావు...మీఁదన్ - లావుగలయట్టి=బలిసియున్నట్టి, గుజ్జుపుఁజావడములమీఁదన్=గుజ్జుపుఁదట్టువులమీఁద, మాత్రసంచులు=అసిమిసంచులు, తూలన్=వ్రేలాడుచుండఁగా, ఏకాంగులు=కోవెలయధికారులగు నేకాంగులు, (ఏకాంగులనఁగా బుత్త్రమిత్త్రకళత్త్రాదులం బరిత్యజించి భగవత్కైంకర్యమే పరమప్రయోజనమని కావివస్త్రములు గట్టుకొని భగవత్కైంకర్యార్థము శరీరమును ప్రాణము నర్థమును తృణముగాఁ జూచు విరక్తులు.) క్రేవలన్=ఇరుప్రక్కల, రాన్=రాఁగా, వేవిధములనరిసెలు=అనేకవిధములుగాఁ జేయంబడిన యతిరసములు, అవనివిభునకున్ = భూపతికి, కొనుచున్=పట్టించికొని.

తా. మిగుల బలిసియున్న గుజ్జుపుఁదట్టువులమీఁద నసిమిసంచులు వ్రేలాడుచుండఁగా గోవెల యధికారు లుభయపార్శ్వంబులఁ జనుదేర ననేకప్రకారంబులగు భగవత్ప్రసాదంబులయిన యతిరసంబులు రాజునకిచ్చుటకుఁగాఁ బట్టించికొని.

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి • బరికరంబులు వెట్టి,
కట్టిన పొరివిళం•గాయ గములు
నెసటిపోఁతలు గాఁగ • నేర్చి నించినచిరం,
తనపుశాలిక్షేమ•తండులములు

వడిఁబెట్టి లోఁ జీర • గుడము సాఁబా లూన్పఁ,
చెలఁగు సంబారంపుఁ•జింతపండు
పెల్లులోఁ హండికా•విళ్ల కొమ్ములఁ బ్రేలు,
గిడ్డిమొత్తము నేతి•లడ్డిగలును
తే. పెరుగువడియంబులును బచ్చి•వరుగు బేడ
లురుతరాచ్యుతపూజోప•కరణపేటి
కలును చాత్తిన చాత్తని•కులము బలసి
విధినిషేధము లెఱిఁగితే • మధుర కరిగె. 97

టీ. సాధ్వి=ఆవిష్ణుచిత్తునిభార్య, భక్తిన్=భక్తిచేతను, త్రోవకున్=మార్గమునకు, పరికరంబులు వెట్టి=పరికరంబులునిచి, కట్టిన=మూటఁగట్టిన, పారివిళంగాయగములు=పారివిళంగాయలపణ్యారములును, ఎసటిపోఁతలుగాఁగన్=ఆతీయన నే వండుకొనఁదగినవై యిసుక లేకుండునట్లుగా, ఏర్చి=ఏఱి, నించిన=నిండించిన, చిరంతనపు=ప్రాఁతలైన, శాలిక్షేమతండులములు, లోన్=లోపల, ఎడిఁబెట్టి= శోధించి (నలుసులు లేకుండునట్లేరుట), జీర=జీలకఱ్ఱను, గుడము=బెల్లమును, సాఁబాలు=సరివాటుగా, ఊన్పన్ = ఉంచఁగా, చెలఁగు = ఒప్పుచున్న, సంబారంపుఁజింతపండు, పెల్లు...లన్ - పెల్లు=మెండైన, లోహండికావిళ్ల=లోపలహఁడీలుగలకావిళ్లయొక్క, కొమ్ములన్=అగ్రములందు, ప్రేలు ..ము - ప్రేలు=ప్రేలాడుచున్నట్టి, గిడ్డి...ను - గిడ్డిమొత్తము=ఆవులసంబంధియైన, నేతిలడ్డిగలును = నెయ్యిపోసిన లడ్డిగలును (లడ్డిగలనఁగా మూఁతికూచిగనుండుపిడతలు), పెరుగువడియంబులును, పచ్చివరుగు=వేయింపనివరుగులు, బేడలు = ఒలుపుపప్పు, ఉరు...టి - ఉరుతర = గొప్పలైన, అచ్యుత=శ్రీవిష్ణునియొక్క, పూజోపకరణపేటికలును=అర్చనోపయోగివస్తుపూరితములగు పెట్టెలును, చాత్తిన=శ్రీవైష్ణవులయొక్కయు, చాత్తని = చాత్తాదులయొక్క, కులము=సమూహము (చాత్తినవారనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁజేసిన బ్రాహ్మణోత్తములైన శ్రీవైష్ణవులు, చాత్తనివారనఁగా ద్రావిడప్రబంధమధికరించియు భగవత్సన్నిధియందు సమర్పితముఁజేయ నధికారముచాలని యితరవర్ణవైష్ణవులు.) విధినిషేధము లెఱిఁగితేన్=ఎవ్వరెవ్వ రేమేమియుం దెచ్చుటకర్హులో వార లాయావస్తువుల దెచ్చుచుండఁగా, ఆవిష్ణుచిత్తుఁడు, మధురకరిగెన్ = మధురాపురంబునకుఁ జనెను.

తా. ఆపెరియాళ్వారుయొక్కభార్య పతివ్రతాశిరోమణి యగుటంజేసి మిగుల భక్తితోఁగూడినదై యతనిత్రోవకుఁ బరికరంబు లుంచి మూటఁగట్టినపారివిళంగాయలు

మిక్కిలియు పరిశోధింపఁబడిన క్షేమతండులములు, సంబారంపుఁజింతపండు, హండి కావిళ్లకొనలయందు వ్రేలాడుచుండెడి యావునేతిచే నింపఁబడిన కూచిమూఁతిపిడతలును పెరుఁగు వడియంబులు వరుగులు చాయపప్పు శ్రీవిష్ణుపూజోపయోగిపరికరణబృందపూరితంబులగు పేటికలును వీని శ్రీవైష్ణవులు చాత్తానులు స్వస్వయోగ్యతానురూపంబుగ వెంట దెచ్చుచుండ నావిష్ణుచిత్తుండు మధురానగరమునకు వెళ్లెను.

చ. యమనియమాదిలభ్య ద్రుహిణాది*జరన్మరుదిభ్య సంసృతి
శ్రమహరనామకీర్తన మురప్రవికర్తన పాతకావలీ
దమన రమాంగనాకమన తామరసాయతనేత్ర భక్తహృ
ద్భ్రమతృణదాత్ర భూయువతిరంజన వర్ణజితాభ్రఖంజనా. 98

టీ. యమ నియమాదిలభ్యా=యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లనియెడు నష్టాంగయోగములచేఁ బొందఁదగినవాఁడా, ద్రుహి...భ్య-ద్రుహిణ=బ్రహ్మ, ఆది=మొదలగు, జరత్=వృద్ధులైన, మరుత్=దేవతలకు, ఇభ్య=ప్రభువైనవాఁడా, ని. 'ధాతాబ్జయోనిర్ద్రుహిణః, ఇభ్యఆఢ్యోధనీ స్వామీ మరుతౌ పవనామరౌ' యని యమరుఁడు. సంసృతి...న-సంసృతి=జన్మమరణాదిరూప సంసారమండలి, శ్రమ=ఆయాసమును, హర=హరించునట్టి, నామకీర్తన=నామసంకీర్తనముగలవాఁడా, మురప్రవికర్తన=మురాసురునిఖండించినవాఁడా, పాతకావళీదమన=పాపములహరియించువాఁడా, రమాంగనాకమన=లక్ష్మీకాముక, 'కమనఃకామనోభిక' యనియమరుఁడు. తామరసనేత్ర = తామరరేకులవలె వెడల్పులైనకన్నులుగలవాఁడా, భక్త...త్ర - భక్త=భక్తులయొక్క, హృత్=మనంబులందలి, భ్రమ=భ్రమలనియెడు, తృణ=గడ్డికి, దాత్ర=లవిత్రమైనవాఁడా, ని. 'దాత్రం లవిత్ర' మ్మనియమరుఁడు. భూయువతిరంజన - భూయువతి=భూమియను స్త్రీని, రంజన=సంతోషపెట్టువాఁడా, వర్ణ...నా - వర్ణ=దేహకాంతిచేతను, జిత = గెలువఁబడిన, అభ్ర=మేఘము, ఖంజనా=కాటుకపిట్టయునుగలవాఁడా, ని. 'ఖఞ్జరీటస్తుఖఞ్జనః, వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ అభ్రంమేఘోవారివాహః' యనియు నమరుఁడు.

తా. యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనియెడియష్టాంగయోగములచేతఁ బొంద సాధ్యమైనట్టియు, చతుర్ముఖుఁడు మొదలగు బృందారకబృందంబులకుఁ బ్రభువైనట్టియు, జననమరణాదిరూపసంసారజన్య శ్రమ నివారకంబైన నామకీర్తనముగలయట్టియు, మురాసురునివధియించినట్టియు లక్ష్మీదేవికిఁ గాముకుఁడైనట్టియు, తామర రేకులవలె విశాలంబులైన నేత్రంబులు గలయట్టియు, భక్తజనహృదయస్థితంబులగు భ్రమలనియెడిగడ్డికి లవిత్రమైనట్టియు, భూవల్లభుండై

* జగ.

నట్టియు నిజదేహకాంతిచేత గెలువంబడిన మేఘఖంజనములయొక్క కాంతిగల యో శ్రీహరీ యని గ్రంథకర్త గ్రంథమధ్యమందుఁ జేయందగిన మంగళం బొనరించుచున్నాఁడనుట.

క. దోర్ధార్యధృతదుర్ధరగో, వర్ధన రాధానురాగ•వర్ధన లీలా
వార్ధుషికా యిషికాకృత, వార్ధశ్రవసైకనేత్ర•వైకృతినిపుణా. 99

టీ. దోర్ధా...న - దోః=భుజములయొక్క, ధూః=భారముచేతను, ధృత=ధరియింపఁబడినట్టి, దుర్ధర=అన్యులచేఁగరియింపశక్యముగాని, గోవర్ధన=గోవర్ధనపర్వతము గలవాఁడా, రాధా...న - రాధా=రాధయొక్క, అనురాగ=ప్రీతిని, వర్ధన=వృద్ధిఁ బొందించువాఁడా, లీలా...కా - లీలా=విలాసముచేతను, వార్ధుషికా=వడ్డిపుచ్చుకొనువాఁడా, ని. 'వృధ్యాజీవో వార్ధుషిక' యనియమరుఁడు. (వేంకటేశ్వరుఁడు వడ్డికాసులవాఁడనుట.) ఇషికా...ణా - ఇషికాకృత=తృణముచేతఁజేయఁబడిన, వార్ధశ్రవస=కాకిరూపుగలజయంతునియొక్క, ఏక=ఒక్కటైన, నేత్ర=కంటియొక్క, వైకృతి=భంగమునందు, నిపుణా=సమర్థుఁడా.

తా. ఇతరులచే ధరియింపనశక్యంబైన గోవర్ధనపర్వతమును భుజముచేతధరియించినట్టియు, రాధకుఁ దనయందుఁగలప్రీతి నభివృద్ధిఁజేయుచున్నట్టియు, విలాసార్థము జనులచే వడ్డిఁబుచ్చుకొనునట్టియు, తృణముచేత కాకరూపము వహించి సీతాస్తనవిదారణముచేసినజయంతుని యొకకంటియొక్క వికారమును బొందించుటయందలి సమర్థుఁడవైనట్టి యో శ్రియఃపతీ; యని పూర్వమువలె మంగళం బొనరించుచున్నాఁడు.

మాలినీ. ద్రుహిణజముఖమౌని•స్తోమనిస్తంద్రభాస్వ
ద్దహరవిహరమాణా • తామ్రపాదాంబుజాతా
బహిరబహిరపార•ప్రాణికోటిప్రపూర్ణా
మహిమవినుతవాణీ • మాధురీవేద్యపర్ణా. 100

టీ. ద్రుహిణజ...తా - ద్రుహిణ=బ్రహ్మవలన, జ=పుట్టిననారదుఁడు, ముఖ=మొదలగు, మౌనిస్తోమ=మునిబృందముయొక్క, నిస్తంద్ర=మఱుపులేని, భాస్వత్=ప్రకాశించుచున్న, దహర=దహరాకాశమందు, విహరమాణ=విహరించుచున్న, ఆ తామ్ర=అంతటనెఱ్ఱనైన, పాదాంబుజాతా=కమలములవంటి పాదములుగలవాఁడా, బహి...ర్ణా - బహిః=వెలపలను, అబహిః=లోపలను, అపార=పారములేని, ప్రాణికోటి=జంతుకోట్లయందు, ప్రపూర్ణా=సంపూర్ణుఁడైనవాఁడా, మహిమ...ర్ణా - మహిమ=మహత్త్వముయొక్క, వినుతి=స్తోత్రరూపమైన, వాణీ = వాక్యములయొక్క, మాధురీ= మాధుర్యమును, వేది= తెలిసిన, అపర్ణా= పార్వతిగలవాఁడా.

తా. బ్రహ్మవలన జనియించిన నారదుఁడు మొదలగువారి సమాజముయొక్క నిశ్చలమై ప్రకాశించుచున్న దహరాకాశమందు సంచరించుచున్నట్టి మిగుల సెట్టనై యున్న కమలములవంటి పదయుగళముగలవాఁడా, వెలపలను లోపలను పారము లేక యసంఖ్యేయంబులగుజంతువులయందుఁ బరిపూర్ణుఁడా, పార్వతీదేవిచేతఁ దెలియఁ బడిన నిజమాహాత్మ్యముయొక్క స్తోత్రవాక్యమాధుర్యముగల లక్ష్మీనాయకా, అని.

మ. ఇది భూమండనకొండవీటిధరణీ•భృద్దుర్గపూర్వాద్రిభా
స్వదిభేశాత్మజవీరభద్రజనజీ•వగ్రాహరాహూయమా
ణదృఢాంచద్భుజకృష్ణరాయమహిరా•ణ్ణామాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీ•యం బై మహింబొల్పగుక్.

టీ. ఇది, భూమండన...దన్ - భూమండన = భూదేవికిభూషణంబైన, ని. 'భూషణంస్యాదలంక్రియా, మణ్డనంచ' యనియమరము. కొండవీటిధరణీభృద్దుర్గ= కొండవీడను కొండదుర్గమునందు, పూర్వాద్రి=ఉదయగిరిదుర్గమునందును, భాస్వత్ = ప్రకాశించుచున్న, ఇభేశాత్మజ=గజపతికుమారుఁడైన, వీరభద్ర=వీరభద్రపాత్రుని యొక్క, జన = ప్రజయొక్క, జీవగ్రాహ = ప్రాణముతో గ్రహించుటయందు, రాహూయమాణ=రాహువువలె నాచరించెడి, దృఢ=బలిష్ఠమైన, అంచత్ = ఒప్పుచున్న, భుజ=భుజములుగలయట్టి, కృష్ణరాయమహిరాణ్ణామ=కృష్ణరాయభూపతి యను పేరుగల, అస్మత్ = నాయొక్క, ఆముక్తమాల్యదక్ = ఆముక్తమాల్యద యందు, హృద్యపద్యము=మనోహరపద్యములుగల, ఆశ్వాసము, ద్వితీయంబై= రెండవదియై, మహిన్=భూమియందు, పొల్పగుక్=ఒప్పగును.

గద్యము. ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీధురీణుండు నాత్రేయగోత్ర పవిత్రుండును వావిళ్లవంశ పయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగు నాముక్తమాల్యదా వ్యాఖ్యానంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# ఆ ము క్త మా ల్య ద

## స వ్యా ఖ్యా న ము.

---

## తృ తీ యా శ్వా స ము.

క. శ్రీ క్షితి నీళా వర దను
జోక్షప్రాణహర దంష్ట్రికోత్కృత్తహిర
ణ్యాక్షక్షపాచర కృపా
వీక్షాదృతబాహులేయ వేంకటరాయా. 1

టీ. శ్రీ...వర - శ్రీ=లక్ష్మికి, క్షితి=భూమికి, నీళా = నీళాదేవికిని, వర = నాథుఁడైనవాఁడా, దను...ర - దనుజోక్ష=వృషభరూపుఁడైన రాక్షసునియొక్క, ప్రాణ=ప్రాణములను, హర=హరియించినట్టివాఁడా, దంష్ట్రి...ర - దంష్ట్రికా=కోఱచేత, ఉత్కృత్త=ఖండింపఁబడిన, హిరణ్యాక్ష=హిరణ్యాక్షుఁడనునట్టి, క్షపాచర=నిశాచరుఁడుగలవాఁడా, కృపా...య - కృపా=దయతోఁగూడిన, వీక్షా=కటాక్షముచేత, ఆదృత=ఆదరింపఁబడిన, బాహులేయ=కుమారస్వామిగలవాఁడవైన, వేంకటరాయా=వేంకటేశుఁడా.

తా. కమలాక్షితినీళాదేవులకు భర్తయైనట్టియు వృషభాసురుని జీవమును హరియించి నట్టియు వరాహావతారమందుఁ దన దంష్ట్రికచేత ఖండింపఁ బడిన హిరణ్యాక్షుఁడు గలయట్టియుఁ గృపాకటాక్షముచేతఁ గుమారస్వామి నాదరించినట్టి వేంకటరాయా! యని గ్రంథకర్త దన యిష్టదైవం బగు వేంకటేశుని సంబోధించి మంగళ మొనర్చెను.

వ. అవధరింపు మట్లరిగి యవ్విష్ణుచిత్తుండు. 2

టీ. అవధరింపుము = చిత్తగింపుము, అట్లరిగి = అత్తెఱంగునవెడలి, అవ్విష్ణుచిత్తుండు.

శా. నిత్యంబు న్శ్రుతిహారి వాద మగుట న్విజ్ఞప్తి లేకంపఁ దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతము న్వంకమైఁ
బ్రత్యుత్థానముఁ జేసి మ్రొక్కఁగ సభాభాగంబు సొత్తెంచి యా
స్నత్యప్రోజ్జ్వల రాజదత్తవరరత్నస్వర్ణపీఠస్థుఁడై. 3

టీ. నిత్యంబున్=ప్రతిదినమందును, వాదమగుటన్=విద్వాంసులకుఁ బరస్పర సంవాదము గలిగియుండుటచేత, ప్రతిహారి=ద్వారపాలకుఁడు, విజ్ఞప్తిలేక=ప్రభువునకు విన్నవింపకయె, అంపన్=అనుపఁగా, తాన్=తాను, (అనఁగా విష్ణుచిత్తుఁడనుట.) అత్యూర్జస్వలుఁడు=మిగులఁదేజముగలవాఁడు, ఔటన్=అగుటచేత, భూపతియు=ప్రభువును, సభ్యవ్రాతమున్=పండితసమూహంబును, శంకమైన్=శంకచేత, ప్రత్యుత్థానముఁజేసి=లేచి, మ్రొక్కఁగన్=నమస్కారముసేయఁగా, సభాభాగంబు=సభాప్రదేశమును, చొత్తెంచి=చొచ్చి, ఔన్నత్య=పొడవౌటచేతను, ప్రోజ్జ్వల=ప్రకృష్టముగఁ బ్రకాశించుచున్నట్టియు, రాజ=ఏలికచేతను, దత్త=ఇయ్యఁబడిన, వర=శ్రేష్ఠములగు, రత్న=రత్నములుదాపిన, స్వర్ణపీఠస్థుఁడై=బంగారుపీఁటయందుఁ గూర్చుండి యున్నవాఁడై.

తా. నిత్యమును విద్వాంసు లేతెంచి ప్రసంగించుట దెలిసి యున్నవాఁడు గాన ద్వారపాలకుండు రాజాజ్ఞఁ బొందకయే లోపలి కనుపఁగాఁ బ్రవేశించిన విష్ణుచిత్తుండు మిగులఁ దేజోవంతుఁ డగుటం జేసి యాభూపాలుండును బండితులును మహాత్ముం డను శంకచేత లేచి నమస్కరింప సభాప్రదేశము సొచ్చి రాజదత్తంబైన రత్నఖచితసింహాసనమందుఁ గూర్చుండి యున్నవాఁడై.

క. ఆతిథ్యము గొని హరి తన
చేతోగతి నొలయ రంతు • సేయని విద్వ
ద్వ్రాతంబుఁ జూచి లాఁతుల
మా తరవా యుడుగ మాట • లాడుం డనుచున్. 4

టీ. ఆతిథ్యముగొని=అతిథిపూజనుగ్రహించి, తనచేతోగతిన్=తనయొక్క చిత్తవృత్తిని, హరి=శ్రీహరి, ఒలయన్=విహరింపఁగా, రంతుసేయని=చప్పుడుసేయకున్న, విద్వద్వ్రాతంబున్=పండితసమూహమును, చూచి=వీక్షించి, లాఁతులమా=క్రొత్తవారమా, తరవాయి=ఉపక్రమము, ఉడుగన్=నిలుపుటకు, మాటలాడుండు=ప్రసంగముఁ జేయుండు, అనుచున్.

తా. సుగమము.

తే. కతిపయోక్తుల కే వారి • ప్రతిభఁ దెలిసి
నగవు దళుకొత్త రాజునె • మ్మొగముఁ జూచి
యీవు మాధ్యస్థ్యమున నున్న • నేముఁ గొన్ని
నొడివెదము మాట లని తద • నుజ్ఞ వడసి. 5

టీ. కతిపయోక్తులన్, కతిపయ=కొన్నియైన, ఉక్తులన్=మాటలచేతనే, వారి=అసభ్యులయొక్క, ప్రతిభన్=బుద్ధిని, తెలిసి=ఎఱింగి, నగవు=నవ్వు, తళుకొత్తన్=అంకురింపఁగా, రాజు=రాజుయొక్క, నెమ్మొగము = ముఖమును, చూచి=కని, ఈవు=నీవు, మాధ్యస్థ్యమునన్=తటస్థభావమునందు, ఉన్నన్=ఉన్నయెడ, ఏము=మేము, కొన్ని మాటలు=కొన్ని యుక్తులను, నొడివెదము=వచించెదము, అని=చెప్పి, తదనుజ్ఞ వడసి=ఆరాజానుమతి నొంది.

తా. విష్ణుచిత్తుండా సభ్యులు వచించుచున్న కొన్ని మాటలు వినుటచేతనే వారలబుద్ధిని తెలిసికొని చిఱునవ్వుతోఁ గూడినవాఁడై రాజుయొక్క ముఖమును జూచి నీవు మాధ్యస్థ్యమునం దున్నయెడ మేము కొన్ని యుక్తులు చెప్పెద మని రాజానుమతి నొంది.

సీ. అందులో నొకమేటి • కభిముఖుం డై యాతఁ,
డనిన వన్నియును ము • న్ననువదించి
తొడఁగి యన్నిటి కన్ని • దూషణంబులు వేగ,
పడక తత్సభ యొడఁ•బడఁగఁ బల్కి
ప్రక్కమాటల నెన్న • కొక్కొకమాటనె,
నిగ్రహస్థాన మ•నుగ్రహించి
క్రందుగా రేఁగినం • గలఁగ కందఱుఁ దీర్చి,
నిలిపి యమ్మొదలివా•నికినె * మగిడి
తే. మఱి శ్రుతి స్మృతి సూత్రస•మాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి • యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంత•ముగ నొనర్చి
విజితు గావించి దయ వాని • విడిచి పెట్టె. 6

టీ. అందులోన్ = ఆవాదులలో, ఒకమేటికి = ఒకప్రౌఢవాదికి, అభిముఖుఁడై=ఎదురుగానున్నవాఁడై, ఆతఁడనినవన్నియును=ఆతఁడు చెప్పినయుక్తుల నన్నిటిని, మున్ననువదించి=ముందనువాదముఁజేసి, తొడఁగి=ఉపక్రమించి, అన్నిటికిన్=ఆతఁడు చెప్పినయుక్తుల కన్నిటికిని, అన్నిదూషణంబులు = అన్నిదోషంబులు, వేగపడక = త్వరపడక, ('ప్రథమాప్రైభక్తికమోర్చిందుశ్చమహాన్వతిక్రియార్థేషు' అను సూత్రముచేత మువర్ణకలోపము.) తత్సభ=ఆసభ్యులు, ఒడఁబడఁగన్ = సమ్మతించునట్లుగ, పల్కి=సంభాషించి, ప్రక్కమాటలన్=పార్శ్వములనున్నవారు చెప్పునట్టి

* మగుడి.

యాయుక్తులను, ఎన్నక=గణనచేయక, ఒక్కొకమాటనె = ఒక్కొకయుక్తిచేతనే, నిగ్రహస్థాన మనుగ్రహించి=నిగ్రహస్థానమును బొందించి యనుగ్రహించి, (నిగ్రహస్థానమనఁగాఁ బ్రసంగదోషములకుఁ బేరు.) క్రందుగాఁ రేఁగిన=దొమ్మిగాఁ బ్రసంగింపరాఁగా, కలఁగక=తొట్రుపాటుపడక, అందఱన్ = ఎల్లరను, తీర్చి = సమాధానపఱచి, నిలిపి=ఉంచి, అమ్మొదలివానికినె = ఆ మొదలివిద్వాంసునకె, మగిడి=తిరిగి, మఱి=మఱియును, శ్రుతి=వేదవేదాంతములు, స్మృతి=ధర్మశాస్త్రములు, సూత్ర=వ్యాససూత్రములు మొదలగు దర్శనసూత్రములు, వీనియొక్క, సమాజమునకు=సమూహమునకు, ఐకకంఠ్యము=ఏకగ్రీవత, కల్పించి=చేసి, ఆత్మమతము=స్వమతము, జగమెఱుంగఁగన్=లోకమెఱుంగునట్లు, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, విజితుఁగావించి=ఓడించి, దయన్=కరుణచేతను, వానిన్=అతనిని విడిచిపెట్టి.

తా. ఆవాదులలో నొక ప్రౌఢవాది కభిముఖుండై యతఁడు సెప్పిన యుక్తులను ముం దనువాదముఁ జేసి యుపక్రమించి పిమ్మట నాయుక్తుల కన్ని దూషణంబులును దాను త్వరపడక సభ్యులు మెచ్చునటులఁ బల్కి యిరుప్రక్కల నున్నవారు సెప్పుచున్నమాటల నెన్నక యొక్కొక్కయుక్తిచేత నిగ్రహస్థానము లొదవిన ననుగ్రహించి సభ్యులు దొమ్మిగా వచ్చి ప్రసంగింపఁ దాఁ దొట్రుపడక యందఱను సమాధానపఱచి యుంచి యామొదలివిద్వాంసునకే మరల వేద శాస్త్ర బ్రహ్మసూత్రములకు నేకవాక్యతఁ గల్పించి చెప్పి పిమ్మట స్వమతము సిద్ధాంత మని లోక మెఱుంగునట్లుగాఁ జేసి యోడించి దయచేత వాని విడిచి.

క. నీ వేమంటివి రమ్మం
చావలి వానికిని మగిడి • యట్లనె వానిం
గావించి యొకఁ డొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి • నందఱఁ గెలిచెన్. 7

టీ. నీవేమంటివి=తొలుతఁ దొమ్మిగఁ బ్రసంగింప వచ్చినవారలలో నొక్కనిం జూచి యీవువల్కినదేమి, రమ్మంచు=రమ్మని యోడించి, అవలవానికిని = అవలనున్న మఱియొకనికిని, మగిడి=అభిముఖుండై, వానిన్=ఆవాదినిని, అట్లనె=మొదలివాది వలెనే, కావించి=చేసి, మఱియు నీప్రకారముగన్, ఒకఁడొకఁడు = ఒకని వెంట నొకఁడుగా, రాన్=రాఁగా, ఆవిప్రుఁడు = ఆవిష్ణుచిత్తుఁడు, వాదసరణిన్=వాద ముఖమున, అందఱన్=వాదులనెల్లను, గెలిచెన్=జయించెను.

తా. మఱియొకనితట్టు తిరిగి నీ వేమంటివి రమ్మని ప్రసంగించి యోడఁగొట్టి యావలివాని కెదురై వానిని నోడఁ గొట్టి యీరీతి నొక్కొక్కఁడుగా రాఁగా నావిప్రుఁడు ప్రసంగించి యందఱఁ బ్రసంగించుసమయమున నోడఁ గొట్టె.

సీ. జగదుద్గతికిని బీ • జము ప్రధాన మన నీ,
క్షత్యాది వీశు న • శబ్దవాదిఁ
బోరి నీశుఁ డేనని • భోగమాత్రేత్యాద్యు,
దాహృతిస్మార్తి మా • యావివాది
ఫలియించుఁ గ్రియయ నా • ఫలమత యిత్యాది,
సర్వేశుఁ గొనని య • పూర్వవాది
శాస్త్రయోనిత్వాది • సరణి నీశ్వరునిఁ దె,
ల్పెడు ననుమాన మ • న్పీలువాది
తే. నిత్యులం దెల్ల నిత్యుఁ డ • న్శ్రుత్యురూక్తి
క్షణికసర్వజ్ఞతేశ సౌ • గత వివాది
ననుపపత్తేర్న యనుసూత్ర • మాది యైన
*వాని నృపతీశుఁ బ్రత్యక్ష • వాదిఁ గెలిచె. 8

టీ. జగదుద్గతికిని - జగత్=జగంబులయొక్క, ఉద్గతికిని=ఉత్పత్తికి, బీజము=కారణము, ప్రధానము=ప్రకృతి, అనన్ = ఇట్లని వాదింపఁగా, వీశున్=విగతేశుఁడనఁగా నీశ్వరుండు జగత్కారణము గాదనునట్టి, అశబ్దవాదిన్=సాంఖ్యుని, ఈక్షత్యాదిన్=ఈక్షత్యాదిసూత్రోక్తుల చేతను, పోరిన్=మిక్కిలి, ఏను=నేను, ఈశుఁడు=ఈశ్వరుఁడు, అనన్=అనఁగా, మాయావివాదిన్=మాయకుఁ గారణత్వముఁ జెప్పుచున్నట్టి యద్వైతిని, భోగ ... న్ - భోగమాత్రేత్యాది = భోగమాత్ర అనునది మొదలుగాఁగల సూత్రముయొక్క, ఉదాహృతి=ఉదాహరణముయొక్క, స్మార్తిన్=స్మరించుటచేతను, క్రియయ = అగ్నిష్టోమాదిసత్క్రియయే, ఫలియించున్ = ఫలముల నిచ్చును, నాన్=అని వాదింపఁగా, సర్వేశుఁగొనని = సర్వేశ్వరునిఁ గొనియాడనట్టి, అపూర్వవాదిన్=మీమాంసకుని, ఫలమతయిత్యాది=ఫలమత యను మొదలగుదానిచేతను, ఈశ్వరునిన్=జగదీశుని, అనుమానము= 'క్షిత్యంకురాదికం సకర్తృకం కార్యత్వాద్ఘటవత్' అనునట్టి యనుమానమే, తెల్పెడున్=ఈశ్వరసద్భావమందు ప్రమాణము, అన్=అనియెడు, పీలువాదిన్ = పరమాణుకారణవాదిని, శాస్త్ర... ణిన్ - శాస్త్రయోనిత్వాది = శాస్త్రయోనిత్వాత్తనునది మొదలగు, సరణిన్=రీతిచేతను, నిత్యులందెల్లనిత్యుండు=నిత్యవస్తువులలో నిత్యుఁడీశ్వరుండు, అన్=అనునట్టి, శ్రుత్యురూక్తిన్-శ్రుతి=వేదముయొక్క, ఉరు=గొప్పయైన, ఉక్తిన్=వాక్యముచేత, క్షణికసర్వజ్ఞతేశ = క్షణికత్వసర్వజ్ఞత్వాను లీశ్వరలక్షణంబులనియెడు, సౌగతవివా

*, వానిసె నిరీశుఁ.

దిన్ = బౌద్ధుని, ని. 'సౌగత శ్శూన్యవాదిని' యని యమరము. అనుపపత్తేర్న యను సూత్రము, ఆదియైనవానిచే = మొదలగువానిచేత, నృపతీశుఁ = నిగ్రహానుగ్రహసమర్థుఁడగు రాజే యీశ్వరుండనునట్టి, ప్రత్యక్షవాదిని = ప్రత్యక్షమే సత్యమని వాదించువానిని, (అనఁగాఁ జార్వాకుఁ డనుట.) గెలిచెన్ = సభయందుఁ గ్రమముగ నందఱ నోడించెను.

తా. పరిదృశ్యమానం బగు నీ జగత్తునకుఁ బ్రకృతి కారణం బని వాదించునట్టి యశబ్దవాదియగు సాంఖ్యుని ఈక్షత్యాది సూత్రములచేతను, నే నీశ్వరుఁ డని వాదించుచున్న యద్వైతిని భోగమాత్రేత్యాది సూత్రములచేతను, కర్మబ్రహ్మవాది యగు మీమాంసకుని ఫలమత ఇత్యాది సూత్రములచేతను, పీలుపాకవాదిని శాస్త్రయోనిత్వాది సూత్రములచేతను, నిత్యత్వసర్వజ్ఞత్వాదు లీశ్వరలక్షణం బనియెడు బౌద్ధుని నిత్యోనిత్యానా మను శ్రుతిచేతను, నిగ్రహ సామర్థ్యము గలిగి కంటికి విషయుం డైయున్న రా జీశ్వరుం డను నట్టి ప్రత్యక్షవాదిని అనుపపత్తేర్న యను సూత్రముచేతను, నిత్తెఱఁగున నా విష్ణుచిత్తుఁడు సభయందు వాదించి, వారల నెల్లఁ గ్రమంబుగ నోడఁగొట్టెను.

పైని చెప్పఁబడిన సూత్రముల యర్థములను శ్రీరామానుజాచార్య విరచిత బ్రహ్మసూత్ర భాష్యమునఁ గనం దగు.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖ సంవిత్తత్త్వబోధైకచుం
చు ద్వైపాయనసూత్రసచ్ఛ్రుతుల నీశు న్మున్నిరూపించి పైఁ
దద్విష్ణుత్వము దాని కన్య దివిష ద్వ్యావర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడె న్ప్రమాణంబులన్. 9

టీ. విద్వ...డు - విద్వత్ = విద్వాంసులచేతను, వందితుఁడు = నమస్కరింపఁబడు, ఆతఁడు = ఆవిష్ణుచిత్తుండు, ఇట్లు = ఈరీతిగా, సుఖ...లన్ - సుఖ = సుఖస్వరూపమును, సంవిత్ = జ్ఞానస్వరూపమునైన, తత్త్వ = పరబ్రహ్మముయొక్క, బోధైకచుంచు = జ్ఞానమునకు ముఖ్యసాధకంబైన, 'తేనవిత్తశ్చుంచుప్చణపౌ' అనిసూత్రము. ద్వైపాయనసూత్ర = వ్యాససూత్రములచేతను, సచ్ఛ్రుతులన్ = వేదములచేతను, ఈశున్ = సర్వేశ్వరుని, మున్ = మున్ను, నిరూపించి = తెల్పి, పైన్ = పిమ్మట, తద్విష్ణుత్వము - తత్ = ఆసర్వేశ్వరునికి, విష్ణుత్వమున్ = వ్యాపకత్వమును, 'విషుౢవ్యాప్తౌ' దానికిన్ = అవిష్ణుత్వమునకు, అన్య...నంబున్ - అన్యదివిషత్ = ఇతర దేవతలకు, వ్యావర్తనంబున్ = లేకుండుటయును, విశిష్టాద్వైతంబును, తేటగాన్ = ప్రత్యక్షముగా, తెలుపన్ = తెలుపుటకు, ప్రమాణంబులన్ = ప్రమాణములచేతను, మాటాడెన్ = సంభాషించెను.

తా. విద్వాంసులచే నమస్కరింపఁబడుచున్న యా విష్ణుచిత్తుండు జ్ఞానస్వరూపమును, సుఖస్వరూపమునైన పరబ్రహ్మయొక్క బోధను బ్రకటింపఁజేయునట్టి బ్రహ్మసూత్రములచేతను వేదములచేతను నీశ్వరుని మున్నుగా నిరూపించి సిద్ధాంతముజేసి యాపిమ్మట నాయీశ్వరునికి వ్యాపకత్వమును దదితర దేవతలకు వ్యాప్యత్వమును విశిష్టాద్వైతంబును బ్రమాణములచేతఁ బ్రత్యక్ష మగునటులఁ దెలుపుటకు సంభాషించెను.

సీ. ఆదినారాయణుం డాయె ♦ నొక్కఁడ బ్రహ్మ,
లేఁడు మహేశుండు ♦ లేఁడు లేదు
రోదసి లేఁడు సూ♦ర్యుఁడు లేఁడు చంద్రుఁడు,
లేవు నక్షత్రము ♦ ల్లేవు నీళ్లు
లే దగ్ని యట్లుండ లీల ♦ నేకాకిత,
చనదు పెక్కయ్యెద ♦ ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొ♦చ్చి యని ఛాందోగ్యంబు,
దెలిపెడు నంతరా♦దిత్యవిద్య
తే. నర్కలోఁ బుండరీకాక్షుఁ ♦ డతఁడ యగుట
కక్షిణీ యని యష్టదృ♦క్త్ర్యక్షదశశ
తాక్షవిధిరుద్రశక్రాదు♦లందు నొకఁడు
కామి కాశ్రుతియే విల♦క్షణతఁ దెలిపె. 10

టీ. ఆదిన్=సృష్ట్యాదియందు, నారాయణుండు=విష్ణువు, ఒకఁడ=ఒక్కఁడే, ఆయెన్=బహురూపములాయెను. బ్రహ్మ=చతుర్ముఖుఁడు, లేఁడు. మహేశుఁడు=శివుఁడు, లేఁడు. రోదసి=భూమ్యంతరిక్షప్రదేశము, లేదు. సూర్యుఁడు, లేఁడు. చంద్రుఁడు, లేఁడు. నక్షత్రములు=చుక్కలు, లేవు. అగ్ని, లేదు. అట్లుండన్=ఆరీతినుండఁగా, లీలన్=విలాసముచేత, ఏకాకిత=ఒక్కఁడై యుండుట, చనదు=యుక్తముగాదు. పెక్కయ్యెదన్=అనేకములయ్యెదన్, అనుచున్=సంకల్పించి, చిదచి...సొచ్చి - చిత్ = చిత్తు, అచిత్ = అచిత్తు, వీనియొక్క ద్వయంబు = రెంటిని (అనఁగా జీవులయందును జడములయందుననుట), చొచ్చి=ప్రవేశించి, ఆయ్యెన్=తాను బహురూపంబులాయెను, అని=ఇట్లని, ఛాందోగ్యంబు=ఛాందోగ్యంబను నుపనిషత్తు, తెలిపెడున్=బోధించుచున్నది. అంతరాదిత్యవిద్యన్=అంతరాదిత్యవిద్యయందు, అర్కలోఁబుండరీకాక్షుఁడతఁడయగుటకు=సూర్యునియందున్న పుండరీకాక్షుండు శ్రీమన్నారాయణుండౌటకు 'కప్యాసం పుణ్డరీకాక్షం పుణ్డరీకే ఇవఅక్షిణీ' యని ద్వివచనముచేతను, అష్ట...దున్ - అష్టదృక్ = ఎనిమిదికన్నులుగలయట్టి, త్ర్య

క్షు=త్రిలోచనుండైనట్టి, దశశతాక్షు = సహస్రలోచనుండైనట్టి, విధి రుద్ర శక్రాదు లందున్=బ్రహ్మేశానేంద్రాదులందు, ఒకఁడు=ఒక్కఁడును, కౌమికి=సూర్యమండలాంతర్వర్తికాఁపోవుటకు, అశ్రుతియే, విలక్షణతన్=వైలక్షణ్యమును, తెలిపెన్=కనఁబఱచెను.

తా. సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుం డొక్కఁడె యుండుటం జేసి యే కాకిత విలాసమునకు యుక్తము గామి ననేకరూపంబులం బొందెద నని సంకల్పించి చిదచిద్ద్వయాత్మకం బైన ప్రపంచమందుఁ దాను బ్రవేశించి బహురూపము లాయె నని ఛాందోగ్యమను నుపనిషత్తు బోధించు చున్న దనియు, ఇదియునుంగాక యంతరాదిత్య విద్యయందు సూర్యునియందున్న పుండరీకాక్షుండు నారాయణుం డనుటకు నక్షిణీ యను ద్వివచనము ముఖ్యసాధకం బనియు, బ్రహ్మరుద్రేంద్రాదులలో నెవ్వఁడుఁ గా దనుటకు అశ్రుతియే వైలక్షణ్యమును దెలుపు చున్న దనియు భావము.

మ. తుల లేకుండు స్వరూప రూప గుణ భూ•తుల్ దోఁచె నేతచ్ఛ్రుతి
న్దలమై లో వెలిఁ దానె యున్కిఁ దెలిపె • న్నారాయణం బారుణం
బుల సామాన్య విశేషరీతినిఖిలం•బు న్శబ్దజాలంబు ని
ర్మలనారాయణశబ్దమందునె తుద • న్పర్యాప్తమయ్యె న్శ్రుతిన్.

టీ. తుల...ల్-తులలేకుండు=సమానములేనట్టి, స్వరూప=నారాయణునియొక్క దివ్యస్వరూపమును, రూప=దివ్యవిగ్రహమును, గుణ=అనంతకల్యాణగుణములును, భూతుల్=దివ్యైశ్వర్యంబును, ఏతచ్ఛ్రుతిన్=ఈవేదముచేత, తోఁచెన్=కానవచ్చెను, దలమై=తఱచుగా, లోవెలిన్=లోపలను బైటను, తానెయున్కిన్=శ్రీమన్నారాయణుండె యున్నవాఁడని (తైత్తిరీయోపనిషత్తునందు), నారాయణంబు=నారాయణమనునైదవపన్నము, తెలిపెన్=తెలుపుచున్నది. శ్రుతిన్=వేదమందలి, ఆరుణంబులన్=అరుణములందును, సామాన్యవిశేషరీతిన్=సామాన్యవిశేషన్యాయముచేతను, నిఖిలంబున్=సకలమైన, శబ్దజాలంబు=శబ్దసమూహము, నిర్మలనారాయణశబ్దమందునె=నారాయణశబ్దములోపలనే, తుదన్=కడపట, పర్యాప్తమయ్యెన్=పర్యవసన్నమాయెను.

తా. సాదృశ్యము లేనట్టి శ్రీహరియొక్క దివ్యస్వరూప దివ్య విగ్రహానంత కల్యాణ గుణ దివ్యైశ్వర్యములు నీ శ్రుతియందు స్పష్టమౌచున్న వనియు, నారాయణుండె సర్వాంతర్బహిర్వ్యాపకుఁ డై తఱచుగా నున్నవాఁ డని తైత్తిరీయస్థమైన నారాయణ మను నైదవ పన్నము దెలుపుచున్న దనియు, నారుణంబులందు సామాన్య విశేష న్యాయముచేత బ్రహ్మేంద్రాది సకల శబ్దములును దుదను నారాయణ శబ్దమందె పర్యవసన్నము లాయెననియు భావము.

క. వా దపహతపాప్మాది, వ్యోదేవ యనంగఁ బరఁగు•సూక్తులమీఁదం
బా దగు నారాయణపద, మే దేవాంతరము లేమి•కీ శ్రుతిఁ దీర్చెన్.

టీ. ఈశ్రుతిన్ = ఈఛాందోగ్యాదిశ్రుతులందు, అపహతపాప్మాదివ్యోదేవ యనంగన్ = శ్రు. 'అపహతపాప్మాదివ్యోదేవఏకో నారాయణః' అనునటుల, పరఁగు= ఒప్పుచున్న, సూక్తులమీఁదన్ = వేదవాక్యములమీఁదను, పొదగు=కుదురై యున్నట్టి నారాయణపదము, ఏదేవాంతరములేమికి = అంతకంటె వేఱెదైవము లేకుండుటను, వాము=వివాదమును, తీర్చెన్ = పోఁగొట్టెను.

తా. 'అపహతపాప్మే' త్యాది శ్రుతివాక్యములమీఁద కుదురై యున్న యీ నారాయణ పదమే శ్రీమన్నారాయణునికంటెఁ బరంబుగ నే దైవమును లేదని నిస్సందేహ మగునటుల భ్రిమాత్మకజ్ఞానజన్య వివాదమును దీర్చెను.

వ. తొల్లి జామదగ్నిభయంబునఁ బరిత్యక్తరాజ్యుం డై వైరాగ్యంబున దివోదాసాత్మజుం డగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గకాంక్షఁ నింద్రు నారాధించిన నతండు సన్నిహితుం డై మాముపాస్వ యనుటయు, ముందు గర్భమునందుండియు నఖండిత తపస్స్ఫలిత వామదేవుం డగు వామదేవుండు సూర్యోహం మనురహం కక్షీవానహ మ్మని శరీరవాచకశబ్దంబు శరీరపర్యంతంబు పోవుటం జేసి చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముం గూర్చి యనుసంధించె ననియుఁ దెలిపి, చేతనుం డైన తా జగత్కారణంబు గామి విబుధులం దెల్ల విజ్ఞానవృద్ధుం డగు నా వృద్ధశ్రవుండు తదనుసంధాన న్యాయంబున నుపదేశించె నని శ్రుతి సూత్రముఖంబుల నిగమాంత శాస్త్ర ఫక్కికఁ జాల వక్కాణింపంబడు నాత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రభృత్యఖిల చిదచిత్ప్రపంచంబు లతనిశరీరంబు లనియు నందె వినంబడు, నట్లగుట నశేష దివిషచ్ఛరీరంబు లన్నారాయణ శరీరంబులే కదా యని ముముక్షువున కప్పుండరీకాక్షు దక్క నేవ్యక్తి నైన నుపాసింపవచ్చునే? విష్ణునకుఁ దత్తత్కాల విగ్రహంబు లగుటం బ్రహ్మ రుద్రార్జున వ్యాస భాను భార్గవాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుల కయుక్తం బని స్మృతి చెప్పు, నదియునుం గాక యీశ్వరునకుఁ జేతనునకు నిత్యసంబంధంబు 'మాతా పితా భ్రాతా వాస శ్శరణం సుహృద్గతి ర్నా

రాయణ' యని సమస్తంబునకుఁ బరాయణంబుగా నతనిఁ బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల దట్టి పరమేశ్వరుం గనుటకుం దగిన యోగంబుఁ జెప్పెద ; ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు విను మని యిట్లనియె. 13

టీ. తొల్లి=పూర్వకాలమందు, జామదగ్నిభయంబునన్=పరశురామునివలని భయముచేత, పరిత్యక్తరాజ్యుండై=రాజ్యముఁ ద్యజించినవాఁడై, వైరాగ్యంబునన్=వైరాగ్యముచేత, దివోదాసాత్మజుండగు=దివోదాసునకుఁగుమారుఁడైన, ప్రతర్దనుండు=ప్రతర్దనుండనువాఁడు, జనార్దనున్=శ్రీహరిని, ఎఱుంగక=తెలిసికొనక, అపవర్గకాంక్షన్=మోక్షేచ్ఛచేత, ఇంద్రున్=పాకశాసనుని, ఆరాధించినన్=ఉపాసనసేయఁగా, అతఁడు=ఆయింద్రుఁడు, సన్నిహితుండై=సమీపించినవాఁడై, మాముపాస్వ=నన్ను నారాధింపుము అనుటయు, (తొలుతఁ దన్ను నారాధించుచున్నవానితో మరలఁ దన్నె యారాధింపుమనుటచేత నతనియంతర్యామి యగు నారాయణుని నుపాసన సేయుమన్న ట్లర్థము సిద్ధించె నదియెట్లనిన), మున్ను=పూర్వమందు, గర్భమునం దుండియు=ఉదరమునందుండియె, అఖండిత=భేదింపఁబడని, తపః=తపంబుచేతను, తులిత=సరిసేయఁబడిన, వామదేవుండగు=రుద్రుఁడుగలవాఁడైనట్టి, వామదేవుండు=వామదేవుండనుజడదారి, సూర్యోఽహం=సూర్యుఁడు నేను, మనురహం=మనువు నేను, కక్షీవానహం=అగ్ని నేను, అని=అనుచు, శరీరవాచకశబ్దంబు=శరీరవాచకంబైన యస్మచ్ఛబ్దంబు, శరీరపర్యంతంబు=శరీరముగల జీవపర్యంతంబు, పోవుటం జేసి=పోవుటచేతను, చిదచిచ్ఛరీరకుండగు-చిత్=జీవుఁడు, అచిత్=శరీరము, శరీరకుండు=శరీరముగాఁగలవాఁడు, చిద్రూపాచిద్రూపదేహముగలవాఁ డనఁగా సర్వశరీరకుం డనుట. అగు=అగునట్టి, అప్పరమాత్మంగూర్చి=ఆపరవాసుదేవునిఁగూర్చి, అనుసంధించెను=చింతించెను, అనియు=అట్లని, తెలిపి=ఎఱింగించి, చేతనుండైన తాన్-జీవుఁడైన తాను, జగత్కారణంబుగామిన్=ఆకాశాదిజగత్తునకు హేతువు గాకపోవుటను, విబుధులందెల్ల=దేవతలయందెల్లను, విజ్ఞానవృద్ధుండగు=విశేషజ్ఞానముచేతఁ బెద్దయైన, వృద్ధశ్రవుండు=దేవేంద్రుఁడు, తద...న్-తత్=ఆయర్థముయొక్క, అనుసంధానన్యాయంబునన్=చింతన యను న్యాయముచేతను, ఉపదేశించెను=ఆరాజున కుపదేశము జేసెను, అని=అనుకొని, శ్రుతిసూత్రముఖంబుల=వేదములచేతను వ్యాససూత్రములచేతను, నిగమాంతశాస్త్రఫక్కికన్=వేదాంతశాస్త్ర వాక్యరీతులచేతను, మిగులన్=విశేషముగ, వక్కాణింపఁబడున్=వ్యాఖ్యానము సేయంబడుచున్నది, ఆత్మయు=జీవాత్మయును, అవనియు=భూమియును, అనల పవన గగన కాలమృత్యుప్రభృతి=అగ్నివాయ్వాకాశ కాలమృత్యువులు మొదలగు, చిదచిత్ప్రపంచంబులు=చిదచిత్తులయొక్క విస్తా

రము, అతని=అప్పరమాత్మునియొక్క, శరీరంబులనియు=దేహములని, ఆందెవినంబడు=ఆవేదమందెవినఁబడును,అట్లగుటన్=ఆలాగగుటచేత,అశే...లు-అశేష=సమస్తమైన, దివిషత్=బ్రహ్మాది దేవతలయొక్క, శరీరంబులు=దేహములు, అన్నారాయణుని శరీరంబులేకదా యని, ముముక్షువునకు=మోక్షేచ్ఛగలవానికి, అప్పుండరీకాక్షుఁదక్కన్ =ఆనారాయణుండుగాక, ఏవ్యక్తినైనను = ఏశరీరమునైనను, ఉపాసింపవచ్చునె=ఉపాసనచేయఁదగునా? విష్ణునకున్=పరమాత్మునకు, తత్తత్కాల విగ్రహంబులగుటన్=సమయోచిత దేహములౌటచేతను, బ్రహ్మరుద్రార్జున వ్యాస భాను భార్గవ వీరులు, ఆది=మొదలగువారియొక్క, భజనంబు=ఉపాసన, త్రైవర్గికునకుంగాక =ధర్మార్థకామాపేక్షగలవారలకేగాని, అపవర్గకాంక్షులకు=ముముక్షువులకు, అయుక్తంబని=తగదని, స్మృతి=ధర్మశాస్త్రము, చెప్పన్=తెలుపుచున్నది, అదియునుంగాక, ఈశ్వరునకున్, చేతనునకు=జీవునకును, నిత్యసంబంధంబు, మాతా=తల్లి,పితా=తండ్రి,భ్రాతా=తోఁబుట్టువు,ఆవాసః=అధిష్ఠానము, శరణం=రక్షకుఁడు, ని. 'శరణం గృహరక్షిత్రోః' యని యమరము, సుహృత్=మిత్రుఁడు,గతిః=ప్రాప్యము,నారాయణః=నారాయణుండె, అని=అట్లని, 'లోపోనమ ఆదికే విసర్గస్య' యను సూత్రముచేత విసర్గలోపము.సమస్తంబునకుఁ బరాయణంబుగాన్=నిఖిలమునకును బరమపదంబుగాన్, అతనిన్=ఆనారాయణుని, ప్రతిపాదించు=తెలుపునట్టి, శ్రుత్యంతరంబు గలదు=మఱియొకశ్రుతిగలదు, అట్టిపరమేశ్వరుంగనుటకున్=తాదృశదేవునిం దెలిసికొనుటకు, తగినయోగంబుసెప్పెదన్=అనుకూలమైనయోగమునువచించెదను, ఖాండిక్యకేశిధ్వజ సంవాదంబు, వినుమని=ఆకర్ణింపు మని, ఇట్లనియె=వక్ష్యమాణక్రమంబుగాఁ బలికెను.

తా. పూర్వకాలంబునఁ బరశురామునకు వెఱచి వైరాగ్యము నొందినట్టి దివోదాసాత్మజుండైన ప్రతర్దనుం డనువాఁడు మోక్షేచ్ఛ గలవాఁడై జనార్దనునిం గానక యింద్రు నారాధింప నతండు ప్రత్యక్షమై నన్నుపాసనసేయుమనఁగా మదంతర్యామి నుపాసన సేయుమన్నట్టియర్థ మూహింపఁబడియె, నెట్లనఁగా మున్ను గర్భమునందుండి యుఁ దపంబునం దీశ్వరునితోఁ దుల్యుం డైనవామదేవుం డనుముని సూర్యుఁడు నేను జంద్రుఁడు నేనగ్నియు నేనను శరీరవాచకశబ్దము శరీరిపర్యంతము వోవుటచేత నుభయశరీరకుం డైనపరమాత్ముం గూర్చి యనుసంధాన మొనర్చె నని తెలిపి జీవుఁడైన తా నుపాస్యుండను గానని జ్ఞానవృద్ధుం డగునింద్రుఁడు దదనుసంధాన న్యాయంబున నుపదేశించెనని వేదవ్యాససూత్రవేదాంతశాస్త్రములయందు వివరింపఁబడియె ననియు, బ్రహ్మ శివుఁడు భూమి మొదలగు పంచభూతములు కాలమృత్యుప్రభృతి నిఖిలం బగు చిదచిద్రూపవిస్తారంబు లతనిశరీరంబులనియు, నైనను శుద్ధంబగు నారాయణ స్వరూపమును దక్క మఱియొకస్వరూపమును భజింపఁగూడదనియు, బ్రహ్మాదులను ధర్మార్థ

కామకాంక్షు లుపాసన సేయుదురుగాని మోక్షార్థు లుపాసన సేయరని స్మృతులు దెలుపుచున్నవనియు, జీవేశ్వరులకు నిత్యసంబంధంబనియు, మాతా పితా భ్రాతా వాసశ్శరణం సుహృద్గతి ర్నారాయణ యని నిఖిలంబు నా నారాయణుండని తెలుపునట్టి కొన్ని శ్రుతులున్నవనియు, నట్టి పరమేశ్వరుం గనుటకు సాధకం బైనయోగంబు గలదు, ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు చెప్పెద విను మని యిట్లనియె.

మ. జనకాఖ్యాఖిలరాజ మొప్పు నిమివం•శం బందు ధర్మధ్వజుం
డను భూజాని మితధ్వజాఖ్య వసుధా•ధ్యక్షుం జగద్రక్షణా
వనజాతాక్షుఁ గృతధ్వజాఖ్యుఁ గనియె • న్వారిద్దఱు న్గర్మఠున్
ఘనవిజ్ఞానుఁ గ్రమంబునం గనిరి త•త్ఖాండిక్యుఁ గేశిధ్వజున్. 14

టీ. జనకా...జము - జనక = జనకుఁడను, అఖ్య = పేరుగల, అఖిలరాజము=సమస్తరాజులుగల, నిమివంశంబు=నిమి యను రాజుయొక్క వంశము, ఒప్పున్=తనరుచు (అనఁగా నా నిమివంశంబునఁబుట్టిన రాజులకెల్ల జనకులను నామము గలదనుట), అందు=అ నిమివంశమందు, ధర్మధ్వజుండను=ధర్మధ్వజుండనునట్టి, భూజాని=భూపతి, మితధ్వజాఖ్య=మితధ్వజుం డనుపేరుగల, వసుధాధ్యక్షున్=అవనీశుని, జగ...న్-జగత్=జగత్తుయొక్క, రక్షణా=పాలనయందు, వనజాతాక్షున్=విష్ణువైనట్టి, కృతధ్వజాఖ్యున్=కృతధ్వజుఁడనువానిని, కనియెన్, వారిద్దఱున్=వారిరువురును, క్రమంబునన్=వరుసగా, కర్మఠున్=యాగాదికర్మశీలుఁడైనట్టి, ఖాండిక్యున్=ఖాండిక్యుఁ డనునతనిని, ఘనవిజ్ఞానున్ - ఘన=అధికమగు, విజ్ఞానున్=జ్ఞానముగల (అనఁగా బ్రహ్మనిష్ఠుఁడనుట), కేశిధ్వజున్=కేశిధ్వజుఁ డనువానిని, కనిరి.

తా. నిమివంశమందుఁ బుట్టిన రాజులకెల్లను జనకు లను నామము గలదనియు, ఆ నిమివంశోత్పన్నుఁ డైనట్టి ధర్మధ్వజుం డనురాజు మితధ్వజుం డనునట్టియుఁ గృతధ్వజుఁ డనునట్టి యిద్దఱు బుత్త్రులుగాఁ బడసెననియు, వా రిరువురును గ్రమంబుగ ననఁగా మితధ్వజుఁడు ఖాండిక్యుఁ డనువానిని, కృతధ్వజుఁడు బ్రహ్మనిష్ఠుం డగుకేశిధ్వజుఁ డనువానినిం గనిరి.

క. వారిరువురుఁ దమలోపల
వేరము గొని రాజ్యకాంక్ష • విజిగీషువు లై
హోరాహోరిం బోరిరి
బారాసిదినంబు లవని • ప్రజలు దలంకన్. 15

టీ. వారిరువురు = ఖాండిక్యకేశిధ్వజులు, తమలోపలన్, వేరము గొని=వైరముఁ బెట్టికొని, రాజ్యకాంక్షన్ = రాజ్యాపేక్షచేతను, విజిగీషువులై=జయేచ్ఛగల

వారలై, హోరాహోరిన్=ఏకతెగక, బారాసిదినంబులు=పండ్రెండు దివసములు, అవనిప్రజలు=భూమియందలిప్రజలు, కలంకన్=భయపడఁగా, పోరిరి=జగడమాడిరి. (బారాసి యనఁగా నేడని కొందఱు).

తా. పిమ్మట నాఖాండిక్యకేశిధ్వజు లిరువురును దమలో విరోధపడి రాజ్యాపేక్షచేత నొకని నొకఁడు జయింప నిచ్ఛఁగలవారై భూమియందున్న ప్రజలు భయంపడునటులఁ బండ్రెండు దినములు ఘోర మగు యుద్ధ మొనర్చిరి.

చ. ప్లలపల వేగ నిచ్చలును • బోఁజులు దీర్చి యతండు నాతఁడున్
వెలువడి వచ్చి యిక్షుమతి • వేణిక యేపిరిగాఁగ వీఁగుచున్
దలపడుచుం బెనంగఁగఁ గృ • తధ్వజనందను సైనికావళీ
హాళహాళికిం జెడ న్విఱిగె • నార్తి మితధ్వజనందనుం డనిన్. 16

టీ. అతండున్=అఖాండిక్యుఁడును, ఆతఁడున్=ఆకేశిధ్వజుండును, నిచ్చలును = నిత్యమును, పలపలవేగ=తెల్లవాఱఁగా, పోఁజులుదీర్చి=బారులుదీర్చికొని, వెలువడి=రణమునకువెళ్లివచ్చి, ఇక్షుమతివేణిక=ఇక్షుమతీనది, ఏపిరిగాఁగన్=ఎల్లగాఁగను, వీఁగుచున్=విక్రమించుచును, తలపడుచున్=తగులు పడుచును, పెనఁగఁగన్ = పోరఁగా, కృత...కిన్-కృతధ్వజనందను=కేశిధ్వజునియొక్క, సైనిక=సేనాపతుల యొక్క, ఆవళి=సమూహముయొక్క, హాళహాళికిన్=రాయిడికి, ఆర్తిన్=ఆపదచేత, మితధ్వజనందనుండు=ఖాండిక్యుఁడు, అనిన్=యుద్ధమందు, చెడన్విఱిగెన్ = పాఱిపోయెను.

తా. ప్రతి దివస మందును దెల్లవాఱఁగానే యిక్షుమతీనది నెల్లఁ జేసికొని పోఁజులఁ దీర్చుకొని జగడముసేయఁగాఁ గేశిధ్వజుని సేనాపతుల ధాటికి నిలువఁజాలక వెఱచి చెడవిఱిగి ఖాండిక్యుండు యుద్ధమందుఁ బరువిడెను.

క. చెడవిఱిగి యడవిఁ బడి యెడ
నెడఁ గట్టులతుదలఁ గోవు • లిడి లోఁ గడకున్
దడుకుఁ బొడిపించి యాకుల
గుడిసెల వసియించె మంత్రి • గురుభటయుతుఁడై. 17

టీ. చెడవిఱిగి=పాఱిపోయి, అడవిఁబడి=అరణ్యముఁ బ్రవేశించి, ఎడనెడన్=అక్కడక్కడను, గట్టులతుదలన్=కొండలమీఁదను, కోవులిడి=కోవరములునిచి, లోన్=లోపలను, కడకున్=తుదవెళ్లను, తడుకుఁబొడిపించి=కంపపాతించి, ఆకుల గుడిసెన్=పర్ణశాలలయందు, మంత్రి...డై-మంత్రి=ప్రధానులతోడను, గురు=గురువులతోడను, భట=బంట్లతోడను, యుతుఁడై=కూడినవాఁడై, వసియించెన్=ఉండెను.

తా. పరువిడి యరణ్యముసొచ్చి యక్కడక్కడనున్న కొండల కోనలయందుఁ గోవరాలుంచి లోపలఁ జుట్టును గంప నాటించి పర్ణశాలలయందు నాఖాండిక్యుఁడు మంత్రి పురోహిత భట సహితుండై వాసము సేయుచుండెను.

శా. ఆ కేశిధ్వజుఁ డంత నా నృపునిరా•జ్యం బెల్ల జేర న్ఫలం
బాకాంక్షింపక గెల్తు మృత్యువు నవి•ద్య న్బుట్టకుండం దుదన్
జా కుండ న్వలె నంచు యోగనిరతిం • జ్ఞానాశ్రయుం డై మఖా
నీకంబు ల్రచియించు చం దొకటికిం • దీక్షించి తా నున్నచోన్.18

టీ. అంతన్=పిమ్మట, ఆకేశిధ్వజుఁడు, ఆనృపునిరాజ్యంబెల్లన్ = ఖాండిక్యుని రాజ్యమంతయును, చేరన్ = రాఁగా, ఫలంబాకాంక్షింపక = యాగాదికర్మఫలంబులంగోరక, మృత్యువున్=సంసారరూపమృత్యువును, గెల్తున్=జయింతును, అవిద్యన్=అజ్ఞానముచేత, పుట్టకుండన్ = మరలజనింపకుండ, తుదన్ = కడపట, చాకుండన్వలెన్=చావకుండవలెననుచును, యోగనిరతిన్=యోగాసక్తిచేత, జ్ఞానాశ్రయుండై=జ్ఞానమునాశ్రయించినవాఁడై, మఖానీకంబు - మఖ=క్రతువులయొక్క, అనీకంబున్= సమూహమును, రచియించుచు = ఒనరించుచు, అందు = ఆక్రతువులయందు, ఒకటికిన్=ఒకజన్నమునకు, దీక్షించి=దీక్షఁగైకొని, తాన్=తాను, ఉన్నచోన్=ఉండఁగా.

తా. పిమ్మట నా ఖాండిక్యుని రాజ్యమంతయుఁ దనస్వాధీనమై యుండఁగాఁ గర్మఫలంబుల నపేక్షింపక మృత్యువును గెలువవలెననియు, నజ్ఞానముచేత మరలఁ బుట్టక కడపటఁ జావులేకుండవలెననియు,నపేక్షించి యోగస్థితిచేతను జ్ఞానము నాశ్రయించి యసంఖ్యేయంబు లగుక్రతువులం జేయుచు నందొక క్రతువునకు దీక్షవహించి యున్న సమయంబున.

చ. పులు మఖశాలికానికట•భూముల మేయుచు నేటివెంటఁ బె
ల్లలమెదునీఱుముం దరసి • యామ్యపతాకన ఘర్మధేను వా
కెలవుల నాడు వాలభుజ•గిం గని గోండ్రని యంగలార్చుచున్
గళగతఘంటమ్రోయ నుఱు•కం బిడుగుం బలె దాఁకి యుద్ధతిన్.

టీ. ఘర్మధేనువు=యాగధేనువు, మఖశాలికానికటభూములన్=యజ్ఞశాలాసమీపభూములయందు, పులు=కసవును, మేయుచున్, ఏటివెంటన్ = నదివెంబడి, పెల్ల...న్-పెల్లలమెదు=మిగులదట్టమైన, ఈఱుమున్=పొదరింటిని, సూ. 'సస్వాత్తదరోమ్తత' యని తద్ధర్మార్థకవిశేషణమున కచ్చుపరమైనప్పుడు నకారాగమము రాఁగా నలమెదునీఱ మనియాయెను. తరసి = అనుకొని, యామ్య ... కనన్ -

యామ్య=యమసంబంధియైన, పతాకనన్ = ధ్వజపటమనఁగా, ఆకెలవులనాడు = ఆపార్శ్వమునందుఁ గదలుచున్న, వాలభుజగికన్=పామువంటి తోఁకను, కని=చూచి, గోండ్రినియంగలార్చుచున్=గోండ్రినిమిడుకుచును, గళగతఘంట - గళగత=మెడనున్న, ఘంట, మ్రోయన్=ధ్వనించుచుండఁగా, ఉఱుకన్=పరువెత్తఁగా, పిడుగుంబలెన్=అశనివలె, తాఁకి=స్పృశించి, ఉద్ధతిన్=వడిచేతను.

తా. యాగధేనువు యజ్ఞశాలాసమీప ప్రదేశములందుఁ గసవు మేయుచు నేటివెంట దట్టమగు పొదరింటి నానుకొని యమ సంబంధియైన ధ్వజపట మను నటుల నా పార్శ్వమునం గదలుచున్న పామువంటి పులితోఁకను జూచి గోండ్రిని యంగలార్చుచు మెడ నున్న ఘంట మ్రోయునటులఁ బరువిడినను వదలక పిడుగు వలె వెంబడించి వడిచేత తాఁకెను.

ఉ. గబ్బు సమక్షికం బయి మొ•గంబడువ న్దరుపర్ణము ల్పడన్
ద్రొబ్బుచుఁ గార్మొగిళ్లరొద•తోఁ బురణించెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞగాఁగఁ జెవు•లూఁదిన వల్లవుఁ డుర్విఁ గూలఁగా
బెబ్బులి గొంతుక్రో ల్లఱచి • పెల్లున మార్మెడఁ ద్రెళ్లఁదాఁటుచున్.

టీ. గబ్బు=దుర్గంధము, సమక్షికంబయి=ఈఁగెలతోఁగూడినదై, మొగంబడువన్=ముఖమునఁ గొట్టుచుండఁగా, తరుపర్ణముల్పడన్=చెట్లనున్న యాకులురాలునట్లుగా, ద్రొబ్బుచున్=త్రోయుచును, కార్మొ...తోన్-కార్మొగిళ్ల=వర్షాకాలపు మేఘములయొక్క, రొదతోన్=ధ్వనితోడను, పుర...గాడ్పు - పురణించెడు=సమానమగునట్టి, బొబ్బరింత=ఱొప్పుటయొక్క, గాడ్పు=గాలి, ఉబ్బి=ఉల్బణమై, విసంజ్ఞగాఁగన్=ఒడలెఱుఁగకుండునట్లుగాను, చెవులూఁదినన్=కర్ణములఁ బ్రవేశింపఁగా, వల్లవుఁడు=గొల్ల, ఉర్విన్=భూమియందు, కూలఁగాన్=పడఁగా, బెబ్బులి=పెద్ద పులి, గొంతుక్రోల్=గొంతుక్రోవి, కఱచి, పెల్లునన్=అతిశయముచేత, మార్మెడన్= మాఱుమెడతో, త్రెళ్లన్=పడునట్లుగా, దాఁటుచున్=లంఘించుచును.

తా. ఈఁగెలతోఁ గూడిన దుర్గంధము ముఖమునపుఁ గొట్టుచుండఁ జెట్లయందున్న యాకులు రాలునటుల నూఁకుచును మేఘధ్వనివంటి రొదచేత నిండియున్న ఱొప్ప వలని గాలి యుబ్బి స్మృతి దప్పునట్లుగాఁ జెవులూఁదినఁ బసులకాపరియైన గొల్లవాఁడు నేలఁ బడఁగాఁ బెద్దపులి ధేనువు మెడ గొంతికి మాఱుమెడతోఁ బడునటుల దాఁటెను.

ఆ. తనువుఁ గొమ్ము గొరిజఁ • గొనకుండ మలపుచుఁ
జప్పు డెసఁగఁ దోఁక • నప్పళించి

శోణితంబుఁ గ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చు నవసరమున. 21

టీ. ఆవ్యాఘ్రము, కొమ్ముల్ = ఆగోవుయొక్క శృంగమును, గొరిజల్ = గొరిసెలను, కొనకుండల్ = తాఁకకుండ, తనువున్ = దేహమును, మలఁపుచు = మరలించుచు, చప్పుడెసఁగన్ = ధ్వనించునటుల, తోఁకన్ = వాలమును, అప్పళించి = తాటించి, శోణితంబున్ = రక్తమును, గ్రోలుచున్ = పానముసేయుచు, నేర్పుమైన్ = నేర్పుతోను, ఘర్మగవిన్ = యాగధేనువును, గవికిన్ = కొండగుహకు, ఈడ్చునవసరమునన్ = ఈడ్చు సమయమందు.

తా. ఆ పులి యాగోవుయొక్క కొమ్ములు గొరిసెలు దాఁకకుండ దానిశరీరము మరలిచి తన తోఁకను జాడించుచు రక్తపానము సేసి తన సామర్థ్యమునఁ గొండ గవికి నీడ్చుచున్న సమయంబున.

చ. పొలమరు లందుఁ గూఁత లిడ భూసురు లన్నది *వార్చివార్చి మ్రాఁ
కుల తుద లెక్కి చప్పటలు గొట్టి యదల్పఁగ సాహిణీలు మా
వులఁ బఱపంగ వైచి సెలవు ల్వెస నాకుచు బోయె వృషమం
డలికయి †తూలుచు న్ఘుటఘుటధ్వని సారె మలంగి చూచుచున్.

టీ. అందున్ = అక్కడ, పొలమరులు = పొలముఁదిరుగువారు, కూఁతలిడన్ = కూఁతలు పెట్టఁగా, భూసురులు = బ్రాహ్మణులు, అన్నదిన్ = అనదియందు, వార్చివార్చి = సంధ్యవార్చి, మ్రాఁకులతుద లెక్కి = కొనమ్రాఁకుల కెక్కి, చప్పటలుగొట్టి = చప్పట్లుగొట్టి, అదల్పఁగన్ = అదలింపఁగా, సాహిణీలు = రౌతులు, మావులఁబఱపంగన్ = గుఱ్ఱములనెక్కి తఱుమఁగా, వైచి = ఆధేనువునువిడిచి, సెలవులు నాకుచు, వెసన్ = గొబ్బున, వృషమండలికయి = చెట్లు మెండుగ నుండుచోటికి, తూలుచున్ = తూఁగుచు, ఘుటఘుటధ్వనిన్ = ఘుటఘుటధ్వనిచేత, సారె = మాటిమాటికి, మలంగిచూచుచున్ = మరలిచూచుచును.

తా. ఆ ప్రాంతములందుఁ బొలముఁ దిరుగువారలు చూచి కూఁతలిడఁగా విని బ్రాహ్మణు లానదియందు సంధ్యవార్చి చెట్లపై నెక్కి చప్పట్లు గొట్టి యదలించుచుండ నంతలో రౌతులు గుఱ్ఱములనెక్కివచ్చి తఱుమఁగా నా పెద్దపులి సెలవులనాకుచు శీఘ్రముగా మిగుల జెట్లు గలిగియున్న చోటికి ఘుటఘుటధ్వనిఁ జేయుచుఁ బలుమాఱు వెనుకఁ దిరిగి చూచుచు వెళ్లెను.

క. చుఱుచుఱుకున నెత్తు రువెలి
కుఱుకుచు రొద సేయ నఱితి యొడపిన యార్పుల్

* లోనవార్చి. † తేలుచు.

పఱవ మిడిగ్రుడ్లు వడఁకఁగఁ
గొఱప్రాణముతోడఁ దన్ని • కొను నమ్మొదవున్. 23

టీ. చుఱుచుఱుకునన్, నెత్తురు=రక్తము, వెలికి=వెలపటికి, ఉఱుకుచున్=బయలువెడలుచు, రొదసేయన్=చప్పుడుసేయఁగా, అతితియొడపిన=మెడగండిపలనసె, ఊర్పులు=నిట్టూర్పులు, పఱవన్=వెడలఁగాన్, మిడిగ్రుడ్లు=మిట్టగ్రుడ్లు, వడఁకఁగన్=వణఁకుచుండఁగా, కొఱప్రాణముతోడన్ = కొనయుసురుతోడ, తన్నికొను=తన్నుకొనుచున్న, ఆమ్మొదవున్=ఆగోవును.

తా. సుగమము.

సీ. విన్నవించుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త,
మడిగె రా జడిగిన • నడుగు మనిరి
వారు కసేరువుఁ • దా రెఱుంగక పోయి,
యతఁడును శునకుని • నడుగు మనియె
నతఁడు దాను నెఱుంగ • నని పల్కి *నృప విను,
మా ఋత్విజులపెండు • నాకసేరు
వేను నెఱుంగ లే • మిఁక నొక్కయేమెకా,
దిల మఱి యెవ్వాఁడు • నెఱుఁగఁ డెవ్వఁ
తే. డేని సప్తాంగములు నీకు • నిచ్చి చెట్లు
వట్టి పెన్రాలతిప్పలు • వట్టి తిరుగు
నట్టిఖాండిక్యుఁ డొక్కఁడ • యరయ నెఱిఁగె
నేనెఱుఁగు వేఁడు మది కర్జ•మేని యనిన. 24

టీ. విన్నవించుటయున్=ధేనువుకథను రాజునకుఁ దెలుపఁగా, రాజు, ఋత్విజులన్=ఋత్విజులను, ప్రాయశ్చిత్తమడిగెన్, అడిగినన్=అడుగఁగా, వారు, తారెఱుంగకపోయి=తా మెఱుంగక, కసేరువున్=కసేరువను ఋషిని, అడుగుమనిరి, అతఁడును=ఆకసేరువును, శునకునిన్=శునకమహర్షిని, అడుగుమనియెన్, అతఁడు=ఆశునకుండు, తానున్=తానును, ఎఱుంగన్=ఎఱుఁగను, అనిపల్కి=అట్లని చెప్పి, నృపా=ఓరాజా, వినుము=ఆలకింపుము, ఆఋత్విజులపెండును=ఋత్విక్సమూహమును, ఆకసేరువును, ఏనున్=నేనును, ఎఱుంగలేము=ఎఱుఁగఁజాలము, ఇఁకనొక్కయేమెకాదు=ఒకమేముమాత్రమె యెఱుంగనివారము కాము, ఇలన్=భూమియందు,

---

* కృప.

ఎవ్వాఁడును=ఎట్టివాఁడును, ఎఱుఁగఁడు=తెలిసికొనఁడు, ఎవ్వఁడేని=ఎవ్వఁడైన, నీకు, సప్తాంగములు=స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రబలదుర్గము లనియెడి సప్తాంగములను, ఇచ్చి=ఒసంగి, చెట్లువట్టి=వృక్షములంబట్టి, పెనాఱితిప్పలువట్టి=పెద్దజాతి గుట్టలఁబట్టి, తిరుగున్=సంచరించుచున్నవాఁడో, అట్టి ఖాండిక్యుఁడు, ఒక్కండ=ఒకఁడుమాత్రమె, అరయన్=విచారింపఁగా, ఎఱిఁగెనేని=ఎఱింగియుండెనేని, ఎఱుఁగున్=ఎఱిఁగియుండును, అది=అడుగుట, కర్జమేని=కర్తవ్యమాయెనా, వేఁడుము=అడుగుము, అనినన్=అనఁగాన్.

తా. ఆ ధర్మధేనువుయొక్క వృత్తాంతము రాజునకు విన్నవింప నతఁడు ఋత్విజులను ప్రాయశ్చిత్తమడుగఁగా దమకుఁ దెలియదు గానఁ గసేరు వనుఋషి నడుగుమనిరి, వానినడుగఁగ నాకసేరువు శునకుని నడుగుమనియె, నాశునకు నడుగఁగా నతఁడు నాకుం దెలియదని పల్కి, ఋత్విజులకును గసేరువునకును నాకును దెలియదు గదా, భూమియం దెవ్వరికిని దెలియదు, తెలిసియున్నయెడ నెవ్వఁడు సప్తాంగముల నీకిచ్చి యడవిపాలై చెట్లు గుట్టలువట్టి తిరుగుచున్నవాఁడో యట్టి ఖాండిక్యునికిఁ దెలిసి యుండవచ్చును గాన ప్రాయశ్చిత్త మడుగుట యవశ్యకముగాఁ గర్తవ్యమాయెనేని యతని నడుగవలయునని చెప్పెను.

చ. నరపతి పల్కె మౌని వర • నారిపు నిష్కృతి వేఁడ బోయిన
న్ధర హతుఁ జేసెనేని సవ•నంపు ఫలం బొడఁగూడుఁ గా కమ
త్సరగతిఁ జెప్పెనేని మఖ•తంత్ర మతంత్రముఁ గాక పూర్ణమా
నిరుదెఱఁగు న్మదీప్సితమె • యేగెద నంచు రథాధిరూఢుఁ డై. 25

టీ. నరపతి=రాజు, పలికెన్ = ఆశునకునితో ననియెను, మౌనివర = మునిశ్రేష్ఠుఁడా, నారిపున్ = నాశత్రువును, నిష్కృతిన్ = ప్రాయశ్చిత్తమును, వేఁడఁబోయినన్ = అడుగఁబోతినేని, ధరన్=నేలపై, హతుఁజేసెనేని = చంపెనా, సవనఫలంబు=యజ్ఞఫలంబు, ఒడఁగూడున్=సిద్ధించును, కాక=అట్లుకాక, అమత్సరగతిన్=మత్సరపుమార్గము విడిచి, చెప్పెనేని=ప్రాయశ్చిత్తము వచించినయెడ, మఖతంత్రము=యజ్ఞకృత్యము, అతంత్రము గాక=క్రమము తప్పక, పూర్ణమౌన్ = నెఱవేరును, ఇరుదెఱఁగున్=రెండువిధములు, మదీప్సితమె=నాచే గోరఁబడినదే, ఏగెదనంచున్=పోయెదనని, రథాధిరూఢుఁడై=అరదము నెక్కినవాఁడై.

తా. ఆ కేశిధ్వజుం డనురాజు శునకునితో నోయిమునిశ్రేష్ఠుఁడా ! నాయొక్క శత్రువును ప్రాయశ్చిత్త మడుగఁబోయిన సమయంబున నేలపైఁ జంపెనేని యజ్ఞమధ్యంబున శరీరము విడుచుటచేత యజ్ఞఫలము చేకూరును. లేక మాత్సర్యము వదలి

ప్రాయశ్చిత్తము సెప్పెనేని యజ్ఞానుష్ఠానము పరిసమాప్తి నొందును. గాన నీరెండు విధంబులు నా మనోరథంబు లగుటచేతఁ బోయెద నని చెప్పి రథము నెక్కెను.

క. హరిణాజినోత్తరీయుఁడు
నిరాయుధుఁడు నగుచు నతని • నెల వగు నడవిన్
జొర *గొట్టికాండ్రు డెక్కెముఁ •
బరికించి యెఱింగి కలయఁ•బడి కూఁత లిడన్. 26

టీ. హరి...డు - హరిణాజిన=జింకచర్మము, ఉత్తరీయుండు=పైవస్త్రముగాఁ గలవాఁడును, నిరాయుధుఁడును=ఆయుధము లేనివాఁడును, అగుచున్ = ఐ, అతని నెలవగు=ఆఖాండిక్యుని స్థానమైన, అడవిన్=అరణ్యమును, చొరన్ = ప్రవేశింపఁగాన్, గొట్టికాండ్రు=అచ్చటనున్న వేగువాండ్రు, డెక్కెముఁ బరికించి=డెక్కెమును జూచి, ఎఱింగి=కేశిధ్వజుండని తెలిసి, కలయఁబడి = కూడి, కూఁతలిడన్= కూఁతలు పెట్టఁగా.

తా. జింకచర్మము నుత్తరీయంబుగా ధరించి నిరాయుధుండై యా ఖాండిక్యునకు నివాసస్థానమగు నడవిఁ జొచ్చి పోఁగా నచ్చటనుండు వేగువాండ్రు డెక్కెముఁ జూచి కేశిధ్వజరాజని యూహించి కలసి కూఁతలువేయ సాగిరి.

ఆ. వలస బెదర నృపతి • కలఁగక ప్రజ వగ
లార్పఁ బనిచి కనమ•లందు నిలువ
వేలు వేఱ యేర్చి• విలుమందిఁ బనిచి తాఁ
దడుకు పెండె మలుక • వొడమ వెడలి. 27

టీ. వలసబెదరన్=వలసవచ్చియున్న జనము భయపడఁగా, నృపతి=ఖాండిక్యుఁడు, కలఁగక=చలింపక, ప్రజవగలు = జనులచింతలు, ఆర్పన్=మాన్పుటకు, పనిచి=కొందఱఁబంపి, కనుమలందు నిలువన్ = గండ్లుకాచుటకు, విలుమందిన్= విలుకాండ్రను, వేలువేఱయేర్చి=ఏర్పఱచి, పనిచి=పంపి, తాన్=తాను, అలుక= కోపము, పొడమన్=అంకురింపఁగా, తడుకుపెండెము=తెట్టువాకిటితలుపు, వెడలి= వెళ్లివచ్చి.

తా. వలస వచ్చియున్న ప్రజలు బెదరఁగా నాఖాండిక్యుఁడు చలింపక ప్రజల గోడు మాన్పుటకుఁ గొందఱ నియమించి గండ్లు గాచుటకు విలుకాండ్ర నేర్పఱిచి పంపి తాను గోపయుక్తుండై తడికపెండెము వెడలి వచ్చెను.

---

* గోటె.

క. వచ్చు రిపుఁ *జూపులనె చుఱుఁ
బుచ్చుచు సిరిఁ గొనుట మగుడఁ • బొడముట రుష ము
చ్చిచ్చునను వెచ్చమరి వి
ద్యుచ్చలచాపజ్యఁ దూపుఁ • దొడుగుచుఁ బలికెన్. 28

టీ. వచ్చురిపున్—వచ్చు—తనదిశకువచ్చెడి, రిపున్ — శత్రుఁడైనకేశిధ్వజుని, చూపులనె=చూపులచేతనే, చుఱుఁబుచ్చుచున్—దహించుచు, సిరిఁగొనుట = రాజ్యముఁ దీసికొనుట, మగుడఁబొడముట=మగలనచ్చుట, రుష=రోషము గలుగుటయను నీ, ముచ్చిచ్చునను=మూఁడగ్నులచేతను, వెచ్చమరి=వేఁడిగలిగి, విద్యు...న్ - విద్యుత్=మెఱుపువలె, చల=కదలుచున్నట్టి, చాపజ్యన్ = వింటియల్లెయందు, తూపుఁ దొడుగుచున్=బాణముదొడుగుచు, పలికెన్=వచించెను.

తా. తన దిక్కునకు వచ్చుచున్న కేశిధ్వజుని ఖాండిక్యుండు చూపులచేతనే దహించుచు రాజ్యముఁ దీసికొనుటయు మగల వచ్చుటయు రోషము గలుగుటయు నీ మూఁడు విధంబులైన యగ్ని చేతఁ వేఁడిమిని బొంది మెఱుపువలెఁ జపలమైనట్టి వింటియల్లెయందు బాణముఁ దొడుగుచుఁ బలికెను.

మ. ధన ధాన్య ద్విర దాశ్వ గోధనసమే•తం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక తాటకేయ ఫల భు•క్కూటాకృతిం జింకతో
లున నాచ్ఛన్నుఁడ వై ప్రశాంతుగతిమా•లోఁ జొచ్చి ప్రాణంబులున్
గొన నేతెంచితె దుర్మతీ కెడపెద • న్ఘోరంపుభల్లంబునన్. 29

టీ. ధన...బు-ధనము, ధాన్యము, ద్విరద—ఏనుంగులు, అశ్వములు, గోధన=గోవులనెడి ద్రవ్యములతో, సమేతంబు=కూడిన, ఎల్లసామ్రాజ్యముం గొనియున్=సామ్రాజ్యమంతయుఁ గైకొనియును, చాలక=తృప్తిపొందక, తాట...తిన్-తాటకేయ=తాటకాపుత్త్రుఁడైన, ఫలభుక్=మాంసభక్షకుఁడైన మారీచునియొక్క, కూటాకృతిన్=కపటాకారముతో, ని. 'మాయానిశ్చల యంత్రేషు కైతవానృతరాశిషు, అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గేకూటమస్త్రియామ్' మ్మని యమరము. జింకతోలునన్=కృష్ణాజినముచేత, ఆచ్ఛన్నుఁడవై=కప్పఁబడినవాఁడవై, ప్రశాంతుగతిన్—శాంతునింబలె, మాలోన్=మాలోపల, చొచ్చి=ప్రవేశించి, ప్రాణంబులున్గొనన్=ప్రాణములనుం దీసికొనుటకు, ఏతెంచితె=వచ్చితివా, దుర్మతీ—ఓరిదుర్బుద్ధీ, ఘోరంపుభల్లంబునన్=ఘోరమైనయమ్ముచేత, కెడపెదన్=పడవేసెదను.

తా. ధనధాన్యాది సకల సామ్రాజ్య సమృద్ధంబగు రాజ్యముం గైకొనియును దృప్తి లేక మాయా వేషము ధరియించిన మారీచునింబలె జింకతోలుఁ గప్పుకొని

* జూచుటయు మఱిఁ.

వచ్చి మాలోఁ జొచ్చి మదీయ ప్రాణంబుల హరింప వచ్చితివా దుర్బుద్ధీ నిన్ను బెడిదపు బాణమునఁ బడ వేసెద నని ఖాండిక్యుండు వచించెను.

మహాస్రగ్ధర.

అనినం జేయెత్తి యోహా • యలుగక వినుకా • నాతతాయి న్ప్రమాదం
బున వైకల్యంబు యాగం • బునకుఁ బొడమ నే • భూసురశ్రేణి వేఁడన్
నిను నావేదించి పంపె • న్నృప యతఁడెఱుఁగు • న్నిష్కృతిన్వేఁడు పోహా
మ్మని కోప మ్మెన్నరోప • మ్మెన్న విడువు మె • ల్లైన మే లింక నన్నన్. 30

టీ. అనినన్=ఇట్లనఁగా, కేశిధ్వజుండు, చేయెత్తి=హస్తముఁ బైకెత్తి, ఓహో, అలుగక=కోపింపక, వినుము=ఆకర్ణింపుము. ఆతతాయిన్=వధోద్యతుఁడను, (వధార్హుం డనియుఁ జెప్పవచ్చును), కాన్=కాను, శ్లో. 'అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహర్తారౌ షడేతే హ్యాతతాయినః, ఆతతాయి నమాయాంతం హన్యాదేవా విచారయన్' అని మనుస్మృతి, ప్రమాదంబునన్=మాంద్యముచేత, యాగంబునకున్=యజ్ఞమునకు, వైకల్యంబు=వికలత్వము, పొడమన్ = పుట్టఁగా, ఏన్=నేను, భూసురశ్రేణిన్=విప్రసంఘమును, వేడన్=ప్రాయశ్చిత్తమడుగఁగా, నృప=రాజా, అతఁడు=ఖాండిక్యుఁడు, ఎఱుఁగున్=తెలిసినవాఁడు, నిష్కృతిన్=ప్రాయశ్చిత్తమును, వేఁడుము=అడుగుము, పొమ్మని, నినున్=నిన్ను, ఆవేదించి=నిరూపించి, పంపెన్=పైనము సేసెను. ని. 'పత్త్రిరోప ఇషుర్ద్వయోః' అని యమరము. విడువుము, ఎల్లైనన్=ఏవిధంబైనను, ఇంకన్=ఇఁకమీఁదను, మేలు=క్షేమము, అన్నన్=అనఁగా.

తా. ఖాండిక్యుండు చంపెద ననఁగా విని కేశిధ్వజుండు చేయెత్తి యోహో కోపింపకుము. మఱి 'హన్యాదేవా విచారయన్' అను మను వచనప్రకారము విచారింపకయే వధించుటకు నే నాతతాయిని గాను. బుద్ధిమాంద్యమువలన జన్నమునకు వైకల్యమొదవఁగా, విప్రసంఘమును ప్రాయశ్చిత్తము వేఁడ నందులకు, నోయి రాజా! యాఖాండిక్యునకుం దక్క నెవ్వరికిం దెలియదు గాన, నతని వేఁడుము పొమ్మని నిన్నావేదించి పనిచిరి గాన వచ్చితిని. రోపమును వదలి ప్రాయశ్చిత్తము సెప్పినను లేక బాణమును విడిచి వధించినను, నిఁకనుం దేవిధం బైనను క్షేమంబే యని పలికెను.

వ. అనిన నతండు తరుషండంబు సొచ్చి మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్ప మంతనంబునకుం జొచ్చిన మంత్రు లిట్లనిరి. 31

టీ. అనినన్ = ఆకేశిధ్వజుండిట్లని చెప్పఁగా, అతండు = ఆఖాండిక్యుఁడు, తరుషండంబుసొచ్చి=చెట్లగుంపులోపలికిఁబోయి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృ

జనంబులకున్ = ప్రధానులు పురోహితులు మొదలగు నాప్తజనంబులకును, తద్వృత్తాంతంబు సెప్పి = ఆకేశిధ్వజుని యొక్క వృత్తినిం జెప్పి, మంతనంబులకున్ = ఆలోచించుటకు, చొచ్చినన్ = ప్రవేశింపఁగా, మంత్రులు=ప్రధానులు, ఇట్లనిరి.

తా. సుగమము.

క. పాలు గల వాఁడు మన కొక
జాలి యిడక తానె తార • సానకు వచ్చెన్
వేళ యిదె లెమ్ము నృప కృప
చాలు న్గారాకు మేపి • చంపకు ప్రజలన్. 32

టీ. పాలుగలవాఁడు=దాయాదుఁడయినవాఁడు, మనకొక జాలియిడక=మన కొక వ్యథపెట్టకయె, తానె, తారసానకు వచ్చెన్=తలపడుట కేతెంచెను, 'వికృతౌ క్వచిచ్ఛలోపో మో ర్దీర్ఘశ్చాత ఆదిమస్యభవే' త్తను సూత్రముచేత ములోపమును బూర్వవర్ణ దీర్ఘంబునుం గలిగె. వేళయిదె=సమయమిదె, నృప = రాజా, కృప చాలును=దయ చేసినదిచాలును, ప్రజలను=మీ ప్రజలను, కారాకుమేపి=ముదికూర దినిపించి, చంపకుము=వధింపకుము, లెమ్ము.

తా. మంత్రులు దాయాదుఁడైనవాఁడు మన కొకశ్రమ నియ్యక తానే తార సమునకువచ్చెఁ గాన నిదె సమయము; రాజా! శత్రువు విషయమయి మీదయ చాలును, మీసేవకులగు ప్రజలను ముదికూరఁ దినిపించి చంపకుము, శీఘ్రముగ యుద్ధమునకు లెమ్ము.

ఉ. అంటలు గట్టి * చేలకును • నాండ్రును బిడ్డలుఁ గూరఁగోయఁబోఁ
గంటకము ల్పదాగ్రముల • † గాడఁగ దూసిననొప్పిఁ గూయిడన్
గంటికి నిద్ర గాన కొదు•గంబడి వేఁగెద మిందు నొక్క మా
కంటయ కాదు నీవు పడు•నట్టియవస్థ వచింప శక్యమే. 33

టీ. ఆండ్రును=భార్యలును, 'నిత్యం దారాదేశ్చ స్యాల్లో ర్లులయో రశ్చ తత్రస్త' అను సూత్రముచేత నాండ్రు, బిడ్డలు, అంటలుగట్టి=గుంపులుగట్టుకొని, చేలకున్=చెలికలకు, కూరఁగోయఁబోన్, కంటకముల్=ముండ్లు, పదాగ్రములన్= కాళ్లకొసలయందు, గాఁడఁగన్=నాటఁగా, దూసిననొప్పిన్ = విడఁదీసిననొప్పి చేత, కూయిడన్=కూఁతలువెట్టఁగన్, కంటికినిద్రగానక = కంటికినిద్రయేయుండక, ఒదుగంబడి=ఒదిగి, వేఁగెదము = వేఁగుచున్నారము, ఒక్కమాకంటయకాదు = మాకుమాత్రమనుటేకాదు, ఇందున్ = ఇక్కడ, నీవుపడునట్టియవస్థ = నీవుపడు కష్టము, వచింపన్ శక్యమే=చెప్పఁదరమా.

* చెలికలకు. † గాడ నొదర్చిన.

తా. అందుఱి బిడ్డలును పొలములయందుఁ గూరలు గోయం బోవుతటిఁ గాళ్లు ముండ్లునాటినం దీయఁగానే నొప్పిచేతఁ గూఁతలిడఁ గంటికి నిద్ర దొట్టక యిచ్చట నొదిగికొని వేఁగుచున్నార మిట్టి శ్రమ మాకు మాత్రమె కాదు నీవు పడునట్టి యవస్థయు చెప్పఁదరము గా కున్నది గదా.

తే. స్వామ్యమాత్యసుహృత్కోశ • జనపద బల
దుర్గములు స్వామి గలిగినఁ • దొలుతఁ గలవు
అంగి సుఖియైన నంగంబు • లటకు మునుపె
చాల సుఖు లౌట మనకు • దృష్టంబు గాదె. 34

టీ. స్వామ్య...లు-స్వామి=ప్రభుత్వము, అమాత్య=మంత్రులు, సుహృత్ = ఆప్తులు, కోశ=భండారము, జనపద=దేశము, బల=చతురంగబలము, దుర్గములు = కోటలు, ఇవి, స్వామి=ప్రభువు, కలిగినన్=కలిగినట్లాయెనేని, తొలుతఁగలవు = అమాత్యాదులుముందేకలరు, అంగి=శరీరి, సుఖియైనన్=సుఖముగలవాఁడాయెనేని, అంగంబులు=కరచరణాదులు, అటకుమునుపె=అంతకుముందఅనే, చాలసుఖులౌట= మిగుల సుఖముగలవౌట, మనకు దృష్టంబుగాదె=మనకు దృష్టాంతముగావా.

తా. స్వామ్యమాత్యాది సప్తాంగములు రాజు గలిగెనేని యటకు మున్నె య మాత్యాదులుం గలరు. శరీరి సుఖియైన యెడఁ గరచరణాద్యవయవములు మున్నె సుఖంబులం బడసి యుండుట మనకు దృష్టాంతముగా నుండలేదా యని నుడివిరి.

క. అతనిపనిఁ దీర్ప రాజ్య
ద్వితయము నినుఁ జేరు నెట్టి • వెఱవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజా*నీతిరక్ష • ణము ధర్మంబుల్. 35

టీ. అతనిపనిఁదీర్పన్ = ఆకేశిధ్వజునిం జంపింతివేని, రాజ్యద్వితయము = మీయుభయుల రాజ్యములు, నినున్=నిన్ను, చేరున్ = పొందును. ఎట్టివెఱవుననైనన్=ఏయుపాయము చేతనైనను, అరిజయము=శత్రుసంహారము, ధనోన్నతియు= ధనమార్జించుటయు, ప్రజానీతిరక్షణము=ప్రజలయొక్క నీతి చెల్లించుటయు, ఇవి, క్షితిపులకున్=రాజులకు, ధర్మంబుల్=ధర్మములు.

తా. ఆ కేశధ్వజుని వధియించితి వేని మీ యిరువుర రాజ్యములు నిన్నుఁ జేరును. ఎట్టి నేర్పు చేతఁ గాని శత్రుసంహారము సేయుటయు ధన మార్జించుటయుఁ బ్రజలను నీతిప్రకారముగఁ బాలించుటయు నివి క్షత్రియ ధర్మంబులు.

* సదయ.

క. అన్యాయంబున దుస్సహ
మన్యుం డగుప్రబలరిపుని • మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబుగఁ బ్రజాళి • సంరక్షింపన్. 36

టీ. దుస్సహమన్యుండగు = సహింపరాని యాగ్రహముగలవాఁడైన, ప్రబల రిపునిన్=బలవంతుఁడైన శత్రువును, అన్యాయంబునన్ = అనీతిచేత, మడి...కిన్-మడియించిన = మడియించుటవలని, ధర్మన్యక్కృతికిన్ = ధర్మతిరస్కారమునకు, ప్రజాళిన్=ప్రజలసంఘమును, సన్యాయంబుగన్ = న్యాయయుక్తముగా, సంరక్షింపన్=పరిపాలింపఁగా, నిష్కృతి=అదె ప్రాయశ్చిత్తము, అగున్.

తా. మిగుల కోపయుక్తుఁడైన శత్రువు నన్యాయముగ వధియించిన పక్షమున ధర్మతిరస్కారమగు నందులకు న్యాయముగా దయతోఁ బ్రజాపాలన మొనరించిన యెడ నదియె ప్రాయశ్చిత్త మగుఁ గాక; నిరాయుధుఁ డైనచ్చిన పగవానిం జంపిన యెడఁ బ్రాయశ్చిత్త మొనరింప నమ్చునని చెప్పిరి.

క. తనరాష్ట్రము చెడ వచ్చిన
ననిమిషపతి విప్రుఁ డనక • యాచార్యుఁ ద్రిశీ
ర్షునిఁ దునుమఁడె విడువుము దయ
నిను నమ్మిన ప్రజలు నవయ • నీ దయ యేలా. 37

టీ. తనరాష్ట్రము=తనరాజ్యము, చెడవచ్చినన్=హానిఁబొందరాఁగా, అనిమిష పతి=దేవేంద్రుండు, విప్రుఁడనక=బ్రాహ్మణుండనక, ఆచార్యున్ = గురువైనట్టి, త్రిశీర్షున్=విశ్వరూపుని, తునుమఁడె =వధింపఁడా, దయన్ = శత్రునిమీఁది కృపను, విడువుము=విడలుము, నినునమ్మినప్రజలు, నవయన్=కష్టపడఁగా, నీదయ=నీకృప, ఏలా=ఏటికి.

తా. దేవేంద్రుండు తన రాజ్యమునకుఁ గీడొనరించుచున్న యాచార్యుండగు విశ్వరూపుని బ్రాహ్మణుం డని విచారింపకయే వధింపలేదా. శత్రునిమీఁద నున్న కృప విడువుము. నిన్ను నమ్మియుండు ప్రజలు కష్టపడుచుండఁగా నీ దయవలన నేమి ప్రయోజనం బని పలికిరి.

క. శిష్టు నిను నింతఁ జేసిన
దుష్టాత్ముని బిలుకు మార్చి • దురితము విడవన్
నష్టంబుగ భూవల్లభ
యిష్టాపూర్తములు సేసి • యెసఁగఁగ రాదే. 38

టీ. భూవల్లభ=రాజా! శిష్టుఁ = శిష్టుఁడవైనట్టి, నినుఁ = నిన్ను, ఇంతఁజేసిన, దుష్టాత్మునిఁ=దురాత్ముని, పిలుకుమార్చి=చంపి, పిదపఁ=పిమ్మట, దురితము=పాపము, నష్టంబుగఁ=నశించునటుల, ఇష్టాపూర్తములు సేసి=క్రతువులు వాపీకూపాది నిర్మాణములు సేసి, ని. 'అథ క్రతుకర్మేష్టం పూర్తంఖాతాదికర్మ' యని యమరము. ఎసఁగఁగరాదే=ఒప్పరాదే.

తా. పూజ్యుండ వైన నిన్ను వ్యథపెట్టిన దుష్టుండగు శత్రునిం జంపి పిదపఁ బాపములు పోవుటకుఁ గాఁ గ్రతువులు వాపీ కూపాది ధర్మములు సేయఁ గూడదా యని వచించి రనుట.

తే. ఇంక రెన్నాళ్లు సూచి నీ • వంకఁ దెగువ
గలుగ కుండినఁ బ్రజ లూళ్లు • దలఁచి పోవ
మౌని వగుట యె యొండె వి • హీనసంధి
నతనిఁ గను టొండె గా కొండు • మతము గలదె. 39

టీ. ఇంకఁ=ఇఁకను, రెన్నాళ్లుసూచి = రెండుదినములు సూచి, నీవంకఁ=నీయందు, తెగువ=తెంపు, కలుగకుండినఁ = లేకయుండెనేని, ప్రజలు = జనులు, ఊళ్లుదలఁచిపోవఁ=తమతమయూళ్లు స్మరించి లేచిపోయినయెడల, మౌనివగుటయె=మునివగుటకాని, విహీనసంధిఁ = హీనమగుసంధిచేత, అతనిఁగనుటొండె = ఆకేశిధ్వజునిఁ జేరుటగాని, ఈరెండువిధములు దక్క, ఒండుమతము = గౌరవమైన మఱియొక మార్గము, కలదె=కలదా, లేదనుట.

తా. రాజా! ఇఁకమీఁద రెండు దినములు సూచి జనులు నీయందుఁ దెగువ పుట్టకుండెనేని వారి వారి యూళ్లు తలంచుకొని వెళ్లెదరు. పిదప నీవు మునివృత్తి నాశ్రయింపవలెను; లేక యతనితో హీన సంధియైనను జేయవలయు. ఈరెండు విధములు దక్క గౌరవంబైన మఱియొకమార్గము లే దనిరి.

క. జనవర తపమునకుం జొ
చ్చినఁ గన్నులు మూసికొంటె • సెల వింతియకా
క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె పరిభవము శల్య • మెదలో మెఱమఁ. 40

టీ. జనవర = రాజా! తపమునకుఁ = తపస్సునకు, చొచ్చినఁ = ప్రవేశించినను, కన్నులు మూసికొంటె = కన్నులు మూసికొనుటయె, సెలవింతియకాక = ఇంతేప్రయోజనము గాని, నిదిధ్యాసకు=ధ్యానమునకు, బ్రహ్మంబు=పరబ్రహ్మము,

ఎనయునె=సందర్భించునా, పరిభవముశల్యము = తిరస్కారమనియెడియలుఁగు, ఎద లోన్=హృదయమున, మెఱమన్=మెఱముచుండఁగా.

తా. ఓ రాజా! తపం బొనర్చుట కేతెంచినను గన్నులు మూసికొనుటే ప్రయోజనముగాని తిరస్కార మనియెడి యలుగు హృదయమందు మెఱముచుండఁగా బ్రహ్మానుసంధాన మనుకూలింపదు.

క. అవమతిఁ బితృఘ్ను లగు భూ
ధవుల వెదకి పిల్లపిల్ల•తరము దునిమి భా
ర్గవుఁడు ముని యయ్యె మఱి వై
భవము వలదు శాంతి కైనఁ•బగ దెగ కగునే. 41

టీ. అవమతిన్=అవమానముచేత, పితృఘ్నులగు=తండ్రినిఁ జంపినట్టి, భూధవులన్=రాజులను, వెదకి, పిల్లపిల్లతరము, తునిమి=చంపి, భార్గవుఁడు=పరశురాముఁడు, మునియయ్యెన్=జడదారియయ్యెను, మఱి=మఱియును, వైభవము=ప్రభుత్వము, వలదు=అక్కఱలేదు, శాంతికైనన్=ఉపశాంతికైనను, పగదెగక=పగఁదీర్చికొనక, అగునే=సిద్ధించునా, సిద్ధింపదనుట.

తా. పరశురాముం డవమానముచేతఁ దనతండ్రినిఁ జంపిన రాజులను వెదకి పిల్లపిల్లతరము చంపి పిమ్మట మౌని యయ్యెను కాన నటువలెఁ బ్రభుత్వము వలను, పోనీ, శాంతికైనను బగఁ దీర్పకయె సిద్ధింప దని పల్కెరి.

తే. పగయు వగయును లేక యే•పాటి గన్న
నలరు సామాన్య సంసారి • యగుట మేలు
మదిఁ దగిలె నేని శాంతిచే • మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చిన•రాజునకును. 42

టీ. పగయు=ద్వేషము, వగయును=విచారమును, లేక, ఏపాటికన్నన్=ఏమాత్రము గలిగినను, అలరు...రి – అలరు=సంతసించునట్టి, సామాన్య సంసారి అగుటమేలు=పరిపాటి సంసారి యగుటయే మేలు, రాజ్యభూమిక–రాజ్య=ప్రభుత్వమనెడి, భూమికన్=వేషమును, తాల్చినరాజునకును – తాల్చిన=ధరియించిన, రాజునకును=భూపాలునకు, మదిన్=బుద్ధిని, తగిలెనేని=శత్రుకృత తిరస్కారగ మంటినట్లాయెనా, శాంతిచేన్=శమముచేత, మఱవఁదగదు=మఱవరాదు.

తా. ఒకనితో ద్వేషమును జింతయును లేక యేపాటి కలిగినను సంతసించునట్టి పరిపాటి సంసారి యగుట యుత్తమము. రాజ్య మను భూమికను ధరియించిన

రాజునకు శత్రుకృత తిరస్కారము మదిం దగిలెనేని శాంతచిత్తుఁడై సమాధమైనుండ దుపకారము.

క. పులి మల డిగి యూళ్లకు న
క్షులరుజ రా జనము మాన్పఁ • గోఁ బనిచి గవిన్
*నెలకొన సురియలు గొని చని
పొలియునొ యూరఁ గుయి రేఁగి • పొడుచునొ చెపుమా. 43

టీ. పులి=వ్యాఘ్రము, (ఈనినపుడు) అక్షులరుజన్=కన్నులకలఁకచేత, మల డిగి=పర్వతముడిగి, ఊళ్లకున్=గ్రామములకు, రాన్=రాఁగా, జనము=ప్రజ, మాన్పఁగోఁబనిచి=దయచే మాన్పకొననిచ్చి, గవిన్=గుహాయందు, నెలకొనన్=స్వస్థమైయున్న దానిమీఁద, సురియలుగొని=ఆయుధములువట్టి, చని=పోయి, పొలియునో=దానిచేతఁజచ్చునో, లేక, ఊరన్=కన్నుల నొప్పితో వచ్చినప్పుడు గ్రామమందున్నవారందఱు, కుయి రేఁగి=గుంపులయి కూఁతలుపెట్టుచు, పొడుచునో, చెపుమా=వచింపుమా.

తా. పులి యీనినప్పుడు కన్నుల కలఁకతోఁ గొండఁ దిగి గ్రామములకు రాఁగా నందఱు పోగై కూఁత లిడుచు వచ్చి యపాయము నొందిన పులినిఁ జంపుదురో, లేక దాని నేత్రవ్యాధిని దయచేసి మాన్పకొన నిచ్చి, దానికి నెలవగు గవియందు స్వస్థముగా నుండు తఱి జన మాయుధములం బట్టి పోయి యా పులిచేతఁ జచ్చునో వచింపుము.

క. ఈవేళ బలియు నతనిం
బో విడిచితి పొమ్ము వాఁడు • పోయిన రాజ్యం
బేవిధిఁ గ్రమ్మఱు నావెర
వీవెర వని వ్రేలు మడచి • యేర్పడఁ జెపుమా. 44

టీ. ఈవేళన్=ఈసమయమున, బలియునతనిన్=బలవంతుఁడగు నా కేశిధ్వజుని, పోవిడిచిపొమ్ము=పోవునట్లుగ విడిచిపెట్టితివి పో, వాఁడుపోయినన్, రాజ్యంబు=సామ్రాజ్యము, ఏవిధింగ్రమ్మఱున్=ఏప్రకారము మరలవచ్చును, ఆవెరవు=సామ్రాజ్యమువచ్చెడి యాయుపాయము, ఈవెరవని=ఈయుపాయ మని, వ్రేలుమడచి=అంగుళమునంచి, ఏర్పడన్=తెలియునటుల, చెపుమా=వచింపుమా.

తా. ఈ సమయమందు మిగుల బలవంతుఁడగు కేశిధ్వజుని విడిచి పెట్టితివి పో వాఁడు పోయిన పిమ్మట సామ్రాజ్య మేవిధంబున మరల వచ్చునో యా యుపాయం బిది యని వ్రేలు మడచి చెప్పుము.

---

* నెలవుకొని సురియ గొని.

తే. అలసతఁ బరున్న మనుజుండు • కలియుగంబు
ద్వాపరం బెన్నఁ గూర్చున్న • వాఁడు త్రేత
యుత్థితుఁడు యాయి మఱి కృత • యుగ మ టన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మ • ణమున వినవె. 45

టీ. అలసతన్=ఆయాసపడుటచేతను, పరున్నమనుజుండు = పండిననరుఁడు, కలియుగంబు=కలియుగము వంటివాఁడు, కూర్చున్నవాఁడు, ఎన్నన్ = విచారింపఁగా, ద్వాపరంబు = ద్వాపరమువంటివాఁడు, ఉత్థితుండు = లేచినవాఁడు, త్రేత=త్రేతాయుగమువంటివాఁడు, మఱి=మఱియును, యాయి=సంచరించువాఁడు, కృతయుగము=కృతయుగమువంటివాఁడు, అటన్నన్=అట్లనునట్టి, నముచిదమనోక్తిన్=ఇంద్రుని వాక్యమును, ఋగ్బ్రాహ్మణమునన్ = ఋగ్వేదమందలి బ్రాహ్మణమందు, వినవే=విన్నవాఁడవుకావా. (అనఁగా నిరుద్యోగుఁడుగా నున్నవాఁడు పరమ నికృష్టుఁ డనుట.)

క. ఛిద్రప్రహారి రాష్ట్రో
పద్రవ పరిహారి యాప్త • భాషణ రుచి వే
ళోద్రిక్తుఁ డన్యవేళా
నుద్రిక్తుఁ డనల్పకాల • ముర్వి భరించున్. 46

టీ. ఛిద్రప్రహారి - ఛిద్ర=తన రాజ్యమందుఁ బుట్టిన దోషంబులను, ప్రహారి=పోఁగొట్టువాఁడును (శత్రువున కేదేని యిక్కట్టు వచ్చినప్పుడు సమయించువాఁడును), రాష్ట్రోపద్రవపరిహారి=రాజ్యమునకు శత్రువులవలన యుపద్రవమును బోఁగొట్టువాఁడును, ఆప్త=ఇష్టులయినవారియొక్క, భాషణ=వాక్యములయందు, రుచి=ప్రీతిఁగలవాఁడును, వేళా=శత్రువును వధింపఁదగిన సమయముదొరకినప్పుడు, ఉద్రిక్తుఁడు=త్వరపడినవాఁడు, అన్యవేళన్=సమయము కానియప్పుడు, అనుద్రిక్తుఁడు=త్వరపడక యుండువాఁడును, అనల్పకాలము=బహుకాలము, ఉర్విన్ = భూమిని, భరించున్=వహించును.

తా. తనరాజ్యమునఁ బుట్టిన దోషములను వెంటనే పోఁగొట్టుచుఁ దనరాజ్యమునకు శత్రువుల వలని యుపద్రవము లంటకుండఁ జేయుచు శత్రుభంజనావసరము సిద్ధించినప్పుడాప్తుల ప్రీతి వాక్యముల విని ప్రయత్నపడుచును నానసమయములయందుఁ ద్వరపడక నిమ్మళించుచు నిత్తెఱంగునఁ బ్రవర్తించురాజు బహుకాలము పుడమిఁ బాలించును.

వ. లే లె మ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. 47

క. మీ నొడివినయది కార్యం
బౌ నిప్పని సేయ రాజ్య ♦ మంతయు మనకు౯
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కటి యిందు వాసు ♦ లరయఁగ వలయు౯. 48

టీ. మీనొడివినయది=మీరన్నవాక్యము, కార్యంబౌ౯=కర్తవ్యమవును, ఇప్పనిసేయ౯=ఈకార్యము సేయఁగా, రాజ్యమంతయు౯ = ఎల్లరాజ్యము, మనకు౯, వానికి౯=ఆకేశిధ్వజునకు, పరలోకము=స్వర్గము, జితమౌ౯ = గెలువఁబడినదౌను. (అనఁగాఁ గలుగుననుట). ఒక్కటి=ఒక్కసారిగా, ఇందు౯=ఈరెంటియందు, వాసులు=ఎక్కువతక్కువలు, అరయఁగవలయు౯=విచారింపవలయును.

తా. మీరన్నది చేయఁ దగినది యౌను. ఈలాగునఁ జేయఁగా మనకు నెల్ల రాజ్యంబును వానికిఁ బరలోకమును సిద్ధించుచున్నది యయిన నొకసారిగా నీ రెంటి యొక్క తారతమ్యము విచారింప వలయు నని చెప్పెను.

క. పర*లోకసుఖము శాశ్వత
మరయ మహీరాజ్యసౌఖ్య ♦ మల్పానేహః
పరిభోగ్యం బిందుల కై
దురితము కావించి తొలఁగు♦దునె పరమునకు౯. 49

టీ. పరలోకసుఖము=పరలోకానందము, అరయ౯=విచారింపఁగా, శాశ్వతము=నిత్యము, మహీరాజ్యసౌఖ్యము=భూపాలనమువలనిసుఖము, అల్పానేహఃపరిభోగ్యంబు=స్వల్పకాల మనుభవింపఁదగినది. ని. 'కాలోదిష్టోఽప్యనేహాపి' యని యమరము. ఇందులకై=ఈయల్పసుఖమునకై, దురితము=పాపము, కావించి=చేసి; పరమునకు౯=పరలోకసుఖమునకు, తొలఁగుదునె=దూరమగుదునా.

తా. విచారింపఁగాఁ బరలోకానందము నిత్యమును, రాజ్యానంద మనిత్యమును గాన నల్పకాలానుభవయోగ్యం బైన రాజ్యమునకై పాప మొనర్చి పరలోకమునకు దూరీభూతుఁడను కా నొల్ల ననియె.

క. బద్ధాంజలిపుటు దీను౯
† గ్రుద్ధతఁ దనమఱుఁగుసొరఁగఁ ♦ గూల్చుట కడు కీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి నను కణ్వవాక్యములు ♦ దలఁప రొకో. 50

* లోకము శాశ్వతసుఖ. † గ్రుద్ధుండై శరణు చొరఁగ.

టీ. స్ఫురణన్ = ప్రకాశముచేత, మొగుళ్ళపైన్ = మేఘములమీఁద, మొదలన్ = ప్రథమమందు, పొల్చి = ఒప్పి, జ...తిన్ - జల = ఉదకముయొక్క, స్రుతిన్ = స్రవణముచేతను, నాఁడునాఁటికిన్ = దినదినమునకు, కరఁగుచున్ = కరఁగిపోవుచు, పుట్టుచున్ = ఉత్పత్తియగుచు, ఉం...మ ఎల్లన్ - ఉండు = ఉన్నటువంటి, మణికార్ముక = ఇంద్రధనుస్సుయొక్క, రక్తిమ ఎల్లన్ = ఆరుణ్యమంతయును, వెల్లిన్ = ఏఱుదయందు, కెన్నురుగులుగట్టినట్టులు = రక్తవర్ణముగల ఫేనములయినట్లు, కనుంగొననయ్యెన్ = చూడసొంపై యుండెను, కరఁగిన = ద్రవించి స్రవించిన, వింటియప్పసరుకై పడిన్ = ఆమణిధనుస్సుయొక్క యాకుపచ్చవర్ణమువలె, తె...కన్ - తెట్టెలుపెట్టు = గుంపులైయున్న, పచ్చికన్ = పచ్చికపట్లయందు, సురేంద్రగోపములు = ఆర్ద్రిపురుగులు, కనుంగొనన్ ఒప్పెన్ - అని క్రిందికి నన్వయము.

తా. ఇంద్రధనుస్సుకరఁగఁగా నైనరక్తిమము గెన్నురువువలె ఆర్ద్రిపురుగులును, కరఁగినపసరువలె పచ్చికలును కానవచ్చెనని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

చ. పెళపెళ మబ్బు బిట్టుఱుమ • భీతి విదూరశిలాంకుర *చ్ఛటో
త్పులకినియై ప్రియు న్నిదుర • వోవుహరి న్వడిఁ గౌఁగలింపఁగాఁ
దలరి ధరిత్రి సాఁచుగఱుఁ • దాల్చినకే లనఁ గంకణంపుమ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ • దాల్చి నదు ల్వడిఁ జొచ్చెవారిధిన్.

టీ. మబ్బు = మేఘము, పెళపెళన్ = పెళపెళమను, బిట్టుఱుమన్ = విశేషముగా గర్జింపఁగా, భీతిన్ = భయముచేతను, వి...నియై - విదూరశిలా = వైదూర్యములయొక్క, అంకుర = మొలకలయొక్క, ఛటా = సమూహముచేతను, (ఛల యనుపాఠమున వ్యాజముచేత నని యర్థము.) ఉత్ = ఉద్గతమైన, పులకినియై = రోమాంచముగలదై, మేఘములుఱుమఁగా వైదూర్యాంకురములు పుట్టుట ప్రసిద్ధము. శ్లో. 'విదూరభూమిర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాకయేవ' అని కాళిదాసమహాకవిప్రయోగము. ప్రియున్ = ఇష్టుఁడైనట్టియు, ని...రిన్ - నిదురఁబోవు = నిద్రించుచున్న, హరిన్ = శ్రీకృష్ణస్వామిని, వడిన్ = వేగముచేత, కౌఁగిలింపఁగాన్ = ఆలింగనమొనరించుటకొఱకు, తలరి = త్వరపడి, ధరిత్రి = భూమి, చాఁచు...లు - చాఁచు = ప్రసరింపఁజేసినట్టియు, గఱుఁదాల్చిన = పులకాంకురితమైనట్టి, కేలుఅనన్ = హస్తమోయన్నట్లు, కంక...లన్ - కంకణంపు = కంకణపఙ్క్తులనియెడు వలయములయొక్క (జాత్యేకవచనము.) మ్రోఁతలన్ = శబ్దములచేతను, పులు = పచ్చికసవు, తేలన్ = మునుంగకపైనుండునట్లు, వండు = బురద, పయిన్ = మీఁదను, తాల్చి = ధరియించి, నదుల్ = ఏళ్లు, వడిన్ = వేగముతో, వారిధిన్ = సముద్రమందు, చొచ్చెన్ = ప్రవేశించెను. ఉత్ప్రేక్షాలంకారము.

* చ్ఛలా.

తా. మేఘములు పెళపెళమని యుఱుముఁగా భూదేవి భీతినొంది నిద్రవో వు తనభర్తయగు శ్రీమహావిష్ణువును గౌఁగిలించుటకై ఱెక్కఁ జాఁచిన గఱుఁదాల్చినట్టిహస్తమో యన్నట్లు కంకణధ్వనులు విస్తరిల్లఁగా పండునీళ్లతోఁ బచ్చికసవును పైనిఁదాల్చి ప్రవాహములు సముద్రమును బ్రవేశించె నని తాత్పర్యము.

తే. కేకిషడ్జంబె తక్కఁ గో॰కిలపుపంచ
మం బఱుటఁ దోయిపదరులు ॰ మది పొసఁగమి
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో॰ నమృత మయ్యెఁ
బ్రోషితల చేరికకు నంపు॰బోటివోలె. 102

టీ. కేకిషడ్జంబె తక్కన్ = నెమలియొక్క షడ్జస్వరముదప్ప, ని. 'షడ్జం మయూరో వదతి పికః కూజతి పఞ్చమ' మ్మని యమరము. కో...బు - కోకిలపు= కోయిలయొక్క, పంచమంబు=పంచమస్వరము, అఱుటన్=లేకపోవుటవల్ల, తో... లు - తోయి=మేఘములయొక్క, పదరులు = ధ్వనులు, (ఉరుములనుట.) మదిన్ పొసఁగమిన్=మనంబునకుఁ దగనిపై యుండుటవలన, అదియున్=అషడ్జస్వరమును, ప్రియున్=వల్లభుఁడైన సముద్రుని, కూర్పన్=కూర్చుటకై, నదులచోన్ = సరిత్తులప ట్లను, అమృతమయ్యెన్=సుధారసమాయెను. (హితమాయె ననియర్థము.) ప్రోషితలన్ =విరహిణులయిన స్త్రీలను, చేరికకున్ = నాథులపొందునకు, అంపు...లెన్ - అంపు=పంపునట్టి, బోటివోలెన్ = మందయానవలె, హితమయ్యెనని క్రిందికినన్వ యము. శ్లో. 'దేశాంతరగతే కాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా' యని వారిలక్షణము.

తా. వర్షాకాలమునందు నెమిళ్ళయొక్క షడ్జస్వరముదప్ప కోయిలలయొక్క పంచమస్వరంబు లేమింజేసి మేఘములయొక్క గర్జనధ్వను లుల్లంబునకు నిష్టములుగాక యాషడ్జస్వరమే విరహిణులైయున్న వామలోచనలను దమతమనాథులచెంతకుఁ జేర్చు నట్టిబోఁటివలె నదులకు వానికిం బ్రియుండయిన సముద్రునిఁగూర్చుట విషయమై యిష్టమాయెననుట. ఇచ్చట మయూరమునకు నదీసముద్రములకు దౌత్యవర్ణనముఁ జేయుటవలన దూతీసామ్యము చెప్పఁబడెను గనుక నుపమాలంకారము.

తే. తతతనువు రాహు సోమామ్ను॰తంబు మ్రింగఁ
జక్రి దునిమిన మెడగంటి॰చాయఁ బోలిచె
నసితమేఘస్థమణిధను ॰ వాసుదర్శ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్య॰బింబ మడరె. 103

టీ. అ...వు-అసిత=నల్లనైన, మేఘస్థ=మేఘమందున్న, మణిధనువు=ఇంద్ర ధనుస్సు, త...హు-తత=విస్తారమయిన, తనువు=దేహముగల, రాహువు=సైంహికే

యుండు, సోమామృతంబు=చంద్రసుధను, మ్రింగఁగ=కబళింపఁగా, చక్రి=శ్రీమహావిష్ణువు, తు...యన్-తునిమిన=ఖండించిన, మెడ=కంఠమండలి, గంటి=గాయము యొక్క, చాయన్=పోలికచేతను, పొలిచెన్=ఒప్పెను, ప్రతిసూర్యబింబము=ప్రతిఫలితసూర్యబింబము, అసుదర్శనంబనఁగన్=తునిమియావంకనిలిచియున్న చక్రమో యన్నట్లు, నింగిన్=ఆకాశమందు, అడరెన్=ప్రకాశించెను.

తా. మితిలేని శరీరముగల రాహువు చంద్రునియందున్న యమృతకళ గ్రసింపరాఁగా శ్రీమహావిష్ణువుచేత ఖండింపఁబడిన కంఠమండలి గాయముమాడ్కి మేఘమధ్యమందు నింద్రధనుస్సును ఆరాహుకంఠమును ఛేదింపవచ్చియున్న చక్రమువలెఁ బ్రతి సూర్యబింబమును గానవచ్చుచుండె నని భావము.

చ. స్వరుఖరతాబ్రసాహిరిపుజాలమదాచిరరుక్శిఖిప్రభా
కరకబకాతివాస్స్రితికిఁ గా లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు *నాఁ గలయట్టిసప్తసా
గరములు మేఘుఁ డానె నొకొ కా యనఁగాఁ గనుపట్టె వీనిచేన్.

టీ. వీనిచేన్ = స్వరుఖరతాదిగుణములు గలిగియుండుటచేత, స్వ...కిన్-కాన్-స్వరు=పిడుగునకు, ఖరతా=తీక్ష్ణతగలుగుటకొఱకును, అబ్ర...స-అప్=ఉదకమునకు, రస=మాధుర్యముగల్గుటకొఱకును, అహిరిపుజాల=నెమిళ్ళగుంపులకు, మద=గర్వముగలుగుటకొఱకును, అచిరరుక్=మెఱుపులనియెడు, శిఖి=అగ్నికి, ప్రభా=దీప్తిగలుగుటకొఱకును, కరక=వడగండ్లకొఱకును, బక=కొంగలకొఱకును, అతివాస్స్రితికిఁగాన్=శుద్ధోదకమును వర్షించుటకొఱకును, ని. 'శతకోటిస్స్వరుశ్శంబోదంభోళిరశనిర్ద్వయోః, నీలకంఠో భుజంగభుక్, వర్షోపలస్తుకరకః, ఆపస్త్రీభూమ్ని వార్వారి' యనియంతటఁ నమరము. మేఘుఁడు=అభ్రము, లవణ=ఉప్పుయొక్కయు, ఇక్షు=చెఱకుపాలయొక్కయు, సురా=కల్లుయొక్కయు, అజ్య=నేతియొక్కయు, దధి=పెరుగుయొక్క, ఉదాకరములు=సముద్రములును, దుగ్ధ=పాలయొక్కయు, శుద్ధజల=మంచినీళ్ళయొక్కయు, కంధులు=సముద్రములు, నాన్ కలయట్టి=అనుపేళ్ళతోనుండునట్టి, (లోనగునట్టియనుపాఠములు పొసఁగియుండమింజేసి దిద్దుపాటుచేయఁబడెను.) సప్తసాగరములన్=సప్తసముద్రములను, ఆనెనొకొకా=పానముచేసెనా యేమి, అనఁగాన్=అనునట్లు, కనుపట్టెన్=చూపట్టెను. హేతూత్ప్రేక్షాలంకారము.

తా. మేఘములయందు స్వరుఖరతాది గుణములు గనుపట్టుటంజేసి తత్తద్గుణహేతుభూతంబు లైన సప్తసముద్రములయందు నీ జలధరంబు లుదపాన మొనరించెనో యన్నట్లు గానంబడుచుండెననుట.

* లోనగునట్టి.

మ. తనిమం బచ్చ మెఱుంగుగోఁచియు మణీ•ధనోజ్జ్వలాపాఢముం
గొని పుట్టం గొడు గబ్బ నెమ్మిపురియా•కు ల్విప్పి శబ్దంబు మిం
చ నతస్ఫారరజోబలిత్వమున ను•చ్చస్ఫూర్తి మిందన్ని వే
ఘనసీలాంగుఁడు గాంచెఁ బాద*సలిలౌ•ఘంబు౯ మరుత్సృష్టము౯.

టీ. తనిమన్=సూక్ష్మత్వముతోఁగూడిన, ప...యు౯- పచ్చ=పచ్చని, మెఱుంగు=మెఱుపనియెడు, గోచియు౯=కౌపీనమును, మ...ము౯-మణీధన్వ=ఇంద్రచాపమనియెడు, ఉజ్జ్వల=వెలుంగుచున్న, ఆపాఢము౯=దండమును, 'పాలాశో దండ ఆపాఢ' యని యమరము. కొని=వహించి, పుట్టంగొడుగబ్బ౯=పుట్టగొడుగులనుగొడుగులు గలుగఁగా, నె...ల్- నెమ్మిపురి=నెమలిపింఛ మనియెడు, ఆకు ల్విప్పి=పాత్తమందలియాకులువిచ్చి, శబ్దంబుమించ౯=ఉఱుములనియెడు వేదవాక్యములు బయలుదేఱఁగా, (కేకాధ్వనులనియెడు వేదవాక్యములనియైనఁ జెప్పవచ్చును.) న...న౯- నత=అడఁగిన, స్ఫార = అతిశయమైన, రజోబలిత్వమున౯=పరాగమును బలిచక్రవర్తిగలుగుటచేతను, ఉ...ర్తి౯- ఉచ్చ=ఉన్నతమైన, స్ఫూర్తి౯=పటిమచేతను, వే=శీఘ్రముగ, మిందన్ని=ఆకాశమందునిలిచి, ఘనసీలాంగుఁడు-ఘన=మేఘమనెడు, నీలాంగుఁడు = వామనుఁడు, మరుత్=దేవతలచేతను వాయువుచేతను, సృష్టము౯ = కల్పింపఁబడిన, పాదసలిలౌఘంబున్ = పాదోదక ప్రవాహమును (వానకాళ్ళను), కాంచె౯ = పొందెను. రూపకాలంకారము.

తా. మేఘుఁడు మెఱుపు మొదలగు లక్షణములను వహించియుండఁగాఁ బసపు గోచి మొదలగువానిని ధరించియున్న వామనస్వామిగా రూపింపఁబడెను.

క. ఘనవృష్టికతన ఫణు లే
పున నలవల్మీకరంధ్ర•ములు మూయఁగ నె
త్తినగొడుగు లనఁగ ఛత్రా
కనికాయం బవని నెల్ల•కడలం బొడమె౯. 106

టీ. ఘనవృష్టికతన౯=ఎక్కుడు వానగల్గుటచేతను, ఫణులు = సర్పములు, ఏపునన్=ఉదుటుచేతను, అల=ప్రసిద్ధములయిన, వల్మీకరంధ్రములు - వల్మీక=పుట్టలయొక్క, రంధ్రములు=బిలములను, మూయఁగన్=కప్పుటకొఱకు, ఎత్తిన=పైనినిలిపిన, గొడుగులనఁగ౯ = ఛత్రములనునట్లు, ఛత్రాకనికాయంబు = పుట్టగొడుగులయొక్క సమూహము, అవని౯=పుడమియందు, ఎల్లకడలన్ = సకలదిక్కులయందును, పొడమెన్=పుట్టెను.

* పతితౌ.

తా. మిక్కుటంబగు వర్షములు గురియుచుండఁగా సర్పములు దమ నివాస స్థానంబులయిన పుట్టలకలుఁగు మాయుటకై యెత్తిన ఛత్రములో యన్న ట్లెల్లదిక్కులయందును బుట్టగొడుగులు కానవచ్చెనని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. సారెకు మింట మేఘుఁడు ని•జస్ఫురణం బఱఁ గ్రూర మారా పురోం
గారకయోగమూఁది తిరు•గ న్సకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ నంతలును • నింతలునై పడుతన్నభశ్చ్యుతాం
గారశిశుప్రతానముల•కై వడి రాలె సురేంద్రగోపముల్. 107

టీ. మేఘుఁడు=వలాహకుఁడు, మింటన్=అంతరిక్షమందు, సారెకున్=మాటిమాటికిని, ని...బు - నిజ=తనయొక్క, స్ఫురణంబు=స్ఫూర్తి, అఱన్=చెడునట్లు, క్రూరమా=కఠినమైనట్టి, పురోంగారకయోగమూఁది = పురోంగారకమను నవయోగమువహించి, తిరుగన్ = అచ్చటనుండి మరలఁగా, శ్లో. 'పురోంగారేత్వనావృష్టిః పురశ్శుక్రే ప్రవర్షతి' అని జ్యోతిశ్శాస్త్రమునందున్నది. సకుటుంబమున్=దారపుత్రాదులతోనున్న, తద్గ్రహంబున్=ఆ యంగారక గ్రహమును, ఎంతేరుషన్=అధికమైన కోపముచేతను, ద్రొబ్బన్=క్రిందికిఁ బడఁద్రోయఁగా, అంతలు నింతలునై=ఇంతంత తునియలై, పడు=పడుచున్నట్టియు, త...డిన్-తన్న భః=ఆ యాకాశమువలనను, చ్యుత=జారిన, అంగార=అంగారకునియొక్క, శిశుప్రతానములకైవడిన్=పిల్లలగుంపులవలె, సి. 'అంగారాభూసుతోల్ముకే' యని రత్నమాల. సురేంద్రగోపముల్=ఇంద్రగోపపురుగులు, రాలెన్=పడెను.

తా. ఇంద్రగోపపురుగులు పుడమియందురాలఁగా మేఘుఁ డంతరిక్షమునందుఁ దనమహిమను నంగారకగ్రహము పురోంగారకయోగమును వహించి యడంచుచుండం జూచి,పిమ్మట నా యోగమును వదలి వెళ్లుచున్న యా యంగారకగ్రహమును, దారపుత్రాదులతో నత్యంతరోషముచేత భూమిపయిం బడఁద్రోయఁగాఁ దుత్తుమురులై పడుచున్న దానిపిల్లలో యన్నట్లుండె నని భావము.

క. కాకోదరాహితుల వ
ల్మీకంబులఁ దూర్చె మెఱసి • మేఘుం డని గుం
పై కవ గూడి పొగడె నన
భేకధ్వను లెసఁగె వృత్త•భేదానుకృతిన్. 108

టీ. కాకోదరాహితులన్ - కాకోదర=సర్పములనియెడు, అహితులన్ = శత్రువులను, మెఱసి=మెఱుపుల మెఱయఁజేసి, మేఘుండు=ఘనుఁడు, వల్మీకంబులన్ = పుట్టలను, తూర్చెన్=ప్రవేశింపఁజేసెను, అని=ఈలాగని, గుంపై=మొత్తములై,

కవగూడి=జోడుజోడుగాఁ గూడినవై, పొగడెనన౯=స్తోత్రము చేసెనో యనునట్లు, వృత్తభేదానుకృతి౯-వృత్తభేద=మందాక్రాంతాది వృత్తభేదముల యొక్క, అనుకృతి౯ = అనుకరణము చేతను, భేకధ్వనులు=కప్పకూఁతలు, ఎసఁగె౯=అతిశయించెను.

తా. అపుడు మందాక్రాంతాదివృత్తభేదముల ననుకరించు భేకధ్వనులు గలుఁగగా మేఘుఁడు దమకు శత్రువులైన సర్పములను మెఱపుల మెఱయంజేసి పుట్టలలోఁ బ్రవేశింపఁ జేసెనని తలంచికొని సంతోషించి గుంపుగూడి యీ మేఘమును బొగడుచున్నవో యన్నట్లుండెననుట. క్రియానిమిత్తక్రియాస్వరూపోత్ప్రేక్ష.

తే. మొగులు మై చీఁకటుల నెక్కు•జిగిమెఱుఁగుల
బగలు రాతిరి రాతిరి • పగలు చేసె
సకలమును నిద్రఁ బుచ్చు కే•శవుని నిద్రఁ
బుచ్చుఘనునకు నిట్టి ద•ద్భుతమె *తలఁప. 109

టీ. మొగులు=మేఘుఁడు, మై చీఁకటుల౯ - మై=శరీరముయొక్క, చీఁకటుల=అంధకారము చేతను, ఎక్కుజిగి మెఱుఁగుల౯=అధికమైనకాంతిగల మెఱుపుల చేతను, పగలు=దినమును, రాతిరి=రేయిగా, రాతిరి=నిశను, పగలు = దివముగాను, చేసె౯=కావించెను. సకలమును=సర్వప్రపంచమును, నిద్రఁబుచ్చు = ప్రళయకాలమందుఁ దనయుదరంబుననునిచికొని నిద్రింపఁజేయునట్టి, కేశవుని౯=శ్రీమహావిష్ణువును, ని...కు౯ - నిద్రఁబుచ్చు=సుప్తిఁబొందించుచున్న, ఘనునకు౯=మేఘునకును, అధికునకును, (భగవంతుండు వర్షాకాలమందు యోగనిద్రాసక్తుఁడని ప్రసిద్ధము గాన నిద్రఁ బుచ్చునని ప్రయోగించెను.) ఇట్టిది=పగలు రాత్రి, రాత్రిపగలుగాఁజేయుట, తలఁప౯ = విచారింపఁగా, అద్భుతమె=ఆశ్చర్యమా! (కాదనుట.) అర్థాపత్త్యలంకారము.

తా. పెనుచీఁకటిచేతను జొక్కపుమెఱుపులచేతను మేఘుఁడు రాత్రిని బగలుగను బగటిని రేయిగ నొనర్చె ననఁగా నంధకారము గ్రమ్ముకొనునట్లుగాఁ జుట్టికొని వర్షించుచు మెఱుపులు మెఱయుచుండె నని భావము.

తే. ధూళి యడఁగిన మఱిమింటఁ • దోఁచె శంప
జలధరద్రోణి మన్ను ప•ర్జన్యుఁ డెత్తి
ఖనదిఁ ద†చ్ఛ్రీవిభూషేచ్ఛఁ • గడుగ మెఱయు
మృదుమహీగతవసురజో•రేఖ యనఁగ. 110

టీ. ధూళి=దుమ్ము, అడఁగిన౯=అడఁగఁగా, మఱి=పిమ్మటను, మింట౯ = అంతరిక్షమందు, శంప=మెఱుపు, తోఁచె౯ = కనుపించెను, పర్జన్యుఁడు =

* యనఁగ. † త్ప్రీతి.

ఇంద్రుఁడు, జ...ణిన్-జలధర=మేఘమునియెడు, ద్రోణిన్=దోనెయందు, (అనఁగా జలగడుగువాఁడు మసికట్టుకడిగెడు పలకయనుట.) మన్నున్=భూమియందలి ధూళి రూపమైన మృత్తికను, ఎత్తి=ఉంచికొని, ఖనదిన్ = ఆకాశగంగయందు, తచ్ఛ్రీవిభూషేచ్ఛన్ - తచ్ఛ్రీ=అగగనలక్ష్మికి, విభూషేచ్ఛన్=భూషణముకొఱకైన యిచ్ఛ చేతను, కడుగన్=శోధనము చేయఁగా, మెఱయు=జ్వలించుచున్న, మృదుమహీగత=మృదువైనభూమియందున్న, వసు=బంగారముయొక్క, రజః=రవలయొక్క, రేఖ యనఁగన్=చాలనఁగా, తోఁచె నని క్రిందటి కన్వయము.

తా. వర్షముచేత భూమియందలి మన్నుడఁగంగాఁ బిమ్మటఁ గానవచ్చినవిద్యుల్లత పర్జన్యుఁడు మేఘ మనుదోనెయందు భూపరాగము నెత్తికొని గగనలక్ష్మికి భూషణములు చేయవలయునన్న యిచ్ఛచేత నాకాశగంగయందుఁ గడుగఁగాఁ బ్రకాశించుచుండెను.

తే. స్థూలపరిపక్వకాననో దుంబరాగ్ర
రంధ్రముల వాననీరు సా రంగ వెడలె
మశకపఙ్క్తులు దావధూ మంబు లడఁగ
రచ్చ సేయంగ వెడలె వి శ్రాంతి కనఁగ. 111

టీ. స్థూ...లన్-స్థూల=గొప్పలై, పరిపక్వ=పండియున్న, కానన = అడవియందలి, ఉదుంబర=మేడి పండ్లయొక్క, అగ్ర=తుదలయందున్న, రంధ్రములన్=బెజ్జములయందు, వాననీరు సారంగన్=వర్షోదకము ప్రవేశింపఁగా, మశకపఙ్క్తులు=దోమలచాళ్ళు, దావధూమంబులడఁగన్=కాఱుచిచ్చులపొగలణఁగఁగా, విశ్రాంతికిన్=శ్రమనుబోఁగొట్టుకొనుటకొఱకు, రచ్చసేయంగన్=కొలువుసేయుటకు, వెడలెననఁగన్=బయలుదేఱె నన్నట్లు, వెడలెన్ = బయలుదేఱెను.

తా. మెండువానలు గురియుటచేత నడవియందలి పరిపక్వములైన మేడిపండ్లనుండి దోమలగుంపులు వెడలఁగాఁ గాఱుచిచ్చులు చల్లాఱుటంజేసి విశ్రాంతికొఱకుఁ గొలువుచేయ నాలోచించి బయలువెళ్లెనో యన్నట్లుండెను.

స్రగ్ధర. గ్రావాళిం గేతకీకో రకకుటజరజో రాజిదూర్వాంకురశ్రీ
తో వీక్షింపం దినానుత్రుటి మఱుపడుచుం దోఁచు చిప్లా తిరోభా
వావిర్భావంబులం బా యక నొరయ నభ స్సభ్రము ల్గప్పి పై నెం
తే విప్పై పింఛికల్ బ ర్హిణులు దిరుగఁ బె ల్లింద్రజాలంబుఁ జూపెన్.

టీ. గ్రావాళిన్ - గ్రావ=పర్వతములయొక్క, ఆళిన్=సమూహమందు, ని. 'అద్రిగోత్రగిరిగ్రావాచలశైలశిలోచ్చయాః' యని యమరము. కే...జి-కేతకీకోరక=

మొగిలిమొగ్గలయొక్కయు, కుటజ=కొండమల్లెమొగ్గలయొక్క, ని. 'కలికాకోరకః పుమా'ననియు, 'కుటజో గిరిమల్లికా' యనియు నమరము. రజోరాజి=పరాగపఙ్క్తి, దూ...తోన్-దూర్వాంకుర=గరికమొలకలయొక్క, శ్రీతోన్=సంపదతో, వీక్షింపన్=చూడఁగా, ది...టిన్ - దిన=పగటియొక్క, అనుత్రుటిన్=ప్రతిక్షణమందును, 'స్త్రియాంమాత్రాత్రుటిః పుంసి' యనియమరము. మఱుపడుచున్=కనుపడక యుండుచును, తోఁచుచున్=కనుపడుచును, ఇట్లౌ=ఈప్రకారమయిన, తిరోభావావిర్భావంబులన్-తిరోభావ=కనుపడకయుండుటను, ఆవిర్భావంబులన్=కనుపడుటను, పాయక=ఎడతెగక, పొరయన్=పొందఁగా, నభస్స=శ్రావణమాసము, అభ్రిముల్=మేఘములను, కప్పి=పఱపి, పైన్=మీఁద, బర్హిణులు = నెమిళ్లు, పింఛికల్=పురుషులు, ఎంతేవిప్పి=మిక్కిలి వ్యాప్తములై, తిరుగన్=ఆడుచుండఁగా, పెల్లు=అధికంబైన, ఇంద్రజాలంబున్ = ఇంద్రజాలమనుశాబరవిద్యను, చూపెన్ = కనుపఱచెను.

తా. వర్షాకాలంబునఁ బుష్పించుచున్న కుటజకేతకామల పరాగములును గరిక కాంతులును గొంతవడిఁ గన్పట్టియుఁ గొంతవడిఁ గన్పడకయు నిట్లు తిరోధానావిర్భావంబుల నెడతెగక పొందఁగా శ్రావణమాసం బనునైంద్రజాలికుఁడు మేఘంబులను తెరవేసి నెమిళ్ళయొక్క వెడల్పులైన పింఛములు వ్యాపింపఁజేసి యతిశయంబైన యింద్రజాలవిద్యను గనుపఱచెనని తాత్పర్యము. భస్మమును దూర్వయును నెమిలి పింఛము నింద్రజాలసాధనములు. తిరోధానావిర్భావము లింద్రజాలగుణములు. ఇవి యన్నియు నప్పుడు కలిగియున్న వనుట.

తే. గిరులతటజంబుతరువులఁ • దొరఁగుపండ్లఁ
బుట్టె జంబూనదులు గాన • బొదవుమొయిలు
మేన నవి సోఁకునెడలుగా • మితిఁ దటిచ్ఛ
లంబునను శుద్ధజాంబూన•దంబు లయ్యె. 113

టీ. గిరుల=కొండలయొక్క, తట=చరులయందుఁబుట్టిన, జంబుతరువులన్=నేరేడుచెట్లనుండి, తొ...న్-తొరఁగు=రాలుచున్న, పండ్లన్=ఫలములవలన, జంబూనదులు=నేరేడుపండ్లరసపుఁటేళ్లు, పుట్టెన్=ఉదయించెను, కానన్=అడవియందు, పొ...నన్-పొదవు=అలముకొన్న, మొయిలు = మేఘముయొక్క, మేనన్=శరీరమందు, అవి=ఆ జంబూనదులు, సో...గా - సోఁకు=తాఁకునట్టి, ఎడలుగా = తావులేగదా, మితిన్=మేరదప్పక, త...ను-తటిత్=మెఱుపనియెడు, ఛలంబునను=వ్యాజముచేత, శు...లు-శుద్ధ=చొక్కములైన, జాంబూనదంబులు=సువర్ణములు, అయ్యెన్=ఆయెను.

తా. మేఘములయందుండు మెఱుపును జూడగాఁ గొండలయందలి చరులయందు జనించియున్న నేరేడుచెట్లనుండి రాలుచున్న పండ్లయందుఁ బుట్టిన జంబూనదము లడవియందెల్లదిశలనుండఁగా నందలముకొన్న మేఘములయొక్క దేహములందు నవి సోఁకినందున జంబూనది ప్రవహించినచో స్వర్ణమగునట్టి మర్యాదదప్పక తటిత్తు లనువ్యాజమును పొంది మెయిళ్ళు శుద్ధజాంబూనదమయంబు లాయెననుట. అపహ్నవాలంకారము.

తే. సురభిబడిఁ జన్న సప్తలా•శోకకమల
కువలయామ్రాళికిఁ గదంబ•కుటజనీప
కకుభయూథికలను సాయ•కములు మరున
కేను గల్గి గేదఁగిసురె • యెక్కుడయ్యె. 114

టీ. సురభిబడిన్=వసంతునివెంబడిగా, చన్న=పోయినటువంటి, ని. 'సురభిస్తుగవిస్త్రీయాం, వసంతచైత్రయోః పుంసి త్రిషు సౌమ్యసుగంధినోః' అని రత్నమాల. సప్తలా=విరజాజియొక్కయు, 'సప్తలానవమాలికా' యని యమరము. అశోక=కంకేళియొక్కయు, కమల=పద్మముయొక్కయు, కువలయ=కలువయొక్కయు, ఆమ్ర=చూతముయొక్కయు, ఆళికిన్ =సమూహమునకు, క...లు - కదంబ=కడిమిపుష్పమును, కుటజ=కొడిసెపుష్పమును, నీప=కడపపువ్వును, ( అమరమున గదంబనీపములు పర్యాయములుగాఁ జెప్పఁబడియున్నను శుకుఁడు'బిల్వవకుళామ్రకదంబనీపాః' అన భిన్నజాతిగాఁ బ్రయోగించియున్నారు గనుక నీ గ్రంథకర్తయును రెంటిని వేఱుగాఁ జెప్పె నని యెఱుఁగఁదగును.) కకుభ=మద్దిపువ్వును, 'ఇంద్రద్రుఃకకుభో ఽర్జునః' యని యమరము. యూథికలు=అడవిమొల్లయును, 'గణికాయూథికాంబష్ఠా' యని యమరము. అను=అనునట్టి, సాయకములు=బాణములు, మరునకున్ = మన్మథునకు, ఏనుకల్గి=పంచబాణములకుఁ బ్రతినిధి పంచబాణములుగల్గియు, గేదఁగిసురె=మొగలిరేకను సురియకత్తి, ఎక్కుడయ్యెన్=శ్రేష్ఠమాయె నని యర్థము. అఱవయాయుధమాయెనని భావము.

తా. వసంతునితోడ నరిగిన సప్తలాశోకాది పంచబాణములకు బదులుగా నీవర్షర్తువందుఁ గదంబకుటజాది పంచసాయకములు గల్గియుఁ గేతకీకుసుమం బెక్కుడయ్యె ననఁగా నీ ఋతువు వసంతర్తువుకంటె నతిశయముగా స్మరోద్దీపక మాయె ననుట.

క. నటనపరకేకిపాత్ర
స్ఫుటయువనికలన మొగుళ్లు • పొదవెన్ భూభృ

త్తటుల నవి యాకు దినుచిట
పోటరవము సెలంగెఁ దాళములచప్పుడునై. 115

టీ. న...లుఅనన్ - నటన=నాట్యమునందు, పర = ఆసక్తములైన, కేకి=నెమళ్లనియెడు, పాత్ర=నాట్యస్త్రీలయొక్క, స్ఫుట = వ్యక్తమైన, యవనికలనన్=నీలితెరలోయనఁగా, 'ప్రతిసీరాయవనికాస్యాత్తిరస్కరణీచసా' యని యమరము. భూభృత్తటులన్=కొండలచరులయందు, పొదవెన్=వ్యాపించెను, అవి=ఆ మేఘములు, ఆకు దిను=పర్ణములను దినుచున్న, చిటపోటరవము=చిటపోటయనుధ్వని, తాళములచప్పుడునై=తాళధ్వనియై, ( నాట్యోపయోగితాళంబులనుట. ) చెలఁగెన్=ఒప్పెను. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

తా. అప్పుడు నెమళ్లనియెడు నాట్యస్త్రీలు నర్తనంబుసేయఁగా మబ్బులు కొండలలోని యాకులు మేయుచుండఁ గల్గిన చిటపోటధ్వనులు తాళంబులుగా నా మేఘములు నీలపుతెరగుడ్డలుగా నొప్పుచుండె ననుట.

చ. జలధర ముప్పుతోఁ బులు సొసంగురసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచి దాటఁబె
న్బులుసుఁ గఱుళ్లఁ గ్రాయ నవె పో వడగండ్లన రాలెఁ గాని నాఁ
డిలఁ బడువానిఁ దిన్నయపుడే చలిఁ బండ్లు వడంగ నేటికిన్. 116

టీ. జలధరము=మేఘము, ఉప్పుతోన్ = లవణముతోఁగూడిన, పులుసు=ఆమ్లము, రసంబు=రుచిని, ఒసంగునని=ఇచ్చునని, అప్పయోధిన్ = ఆ లవణసముద్రమును, ఇంపొలయఁగన్=ప్రీతిగల్గునటుల, క్రోలి=పానముఁజేసి, పైన్=ఆ పిమ్మటను, దధిపయోధియున్=పెరుఁగుసముద్రమును, క్రోలఁగన్=త్రావఁగా, ప్రాఁచి దాటన్ = అది ప్రాచీనమైనదిగాన, ( పులిసినపెరుఁగనుట. ) పె...ళ్లన్-పెన్బులుసు=మిగులఁ బుల్లనైన, కఱుళ్లన్=పెరుఁగుగడ్డలను, క్రాయన్=వెళ్లఁగక్కఁగా, అవెపో=అట్లువెళ్ళఁగ్రక్కఁబడిన పెరుఁగుగడ్డలే, వడగండ్లనన్=కరకలనునట్లుగా, రాలెన్=పతనమునొందెను, కానినాఁడు = ఈ వడగండ్లు దధికణములు కాకపోయెనేని, ఇలన్=భూమియందు, పడువానిన్=పతనమగుచున్న యావడగండ్లను, తిన్నయపుడే=తినఁగానే, పండ్లు=దంతములు, చలివడంగ నేటికిన్=జిల్లుమని చల్లపడవలసిన నిమిత్తమేమి ?

తా. అపుడు రాలుచున్న వడగండ్లను నోటిలోవేయఁగాఁ బండ్లు జివ్వనితీపుగలవై పులుసు దగిలిన దంతములమాడ్కి వస్త్వంతరముల నములుటకు శక్తి చాలకుండుటంజేసి మేఘము పులుసుతో నుప్పు గలిపినట్లయిన మిక్కిలి రుచిగా నుండు నని తలంచి ముందు లవణసముద్రమున నీరు ద్రావి యాపిమ్మట దధిసముద్రమును పానము చేయఁ

గా నది ప్రాఁచిదౌటవలన మిక్కిలి పులుసుగా నుండెను గాన దాని వెళ్ళఁ గ్రక్కఁగానే యాగడ్డలే వడగండ్లనవ్యాజమున రాలుచున్న వని యుత్ప్రేక్షించినాఁడనుట.

తే. అప్పు డసల్లకు డిగక మే॰ఘాళి పొదవు
నచలములపైనె నొడ్డిక॰ట్టగుమృగాలి
చూడఁ జూపట్టె మీఁదిప॰ర్జన్యధన్వి
నృపున కగుతెరవేటయా॰యితమనంగ. 117

టీ. అపుడు=ఆ వర్షాకాలమునందు, అసల్లకుడిగక=బురదలలోదిగక, మేఘాళి=మబ్బులచాళ్లు, పొదవు=చుట్టుకొన్న, అచలములపైనె=కొండలమీఁదనె, దొడ్డికట్టగు=దొడ్డిలోఁ దోలఁబడినవానివలె నిలిచియున్న, మృగాళిఁ = లేళ్లగుంపు, (ఇదికర్తృపదము.) చూడన్=వీక్షింపఁగా, మీ...న్వి - మీఁది=పయినున్న, పర్జన్య=ఇంద్రుఁడనియెడు, ధన్వి=ధనుర్ధరుఁడైన, నృపునకున్=రాజునకు, అగు=అయినటువంటి, తెరవేఁటయాయితము=సిద్ధమయిన తెరవేఁట, అనంగన్ = అనునట్లు, చూపట్టెన్=కానవచ్చెను. ( తెరవేఁటయనఁగా గొప్పయధికారులు వేఁటకు వెడలు నవసరంబున ననుగతులయిన వేఁటకాండ్రచేత మృగము లొక్కచోటఁ గూడియుండునట్లుగఁ జుట్టును తెరవేసి సమకూర్చుట).

తా. ఆ వానకాలమునందు జడిసి బురదలకు డిగ్గక మబ్బులగుంపుచేతఁ జుట్టును వ్యాపింపఁబడియున్న కొండలపైని దొడ్డికట్టుగా నిలువంబడియున్న మృగములను జూడగాఁ బర్జన్యుం డనువిలుకాఁడగు దొడ్డరాజునకై సిద్ధపఱుపఁబడిన తెరవేఁటయో యన్న ట్లుండెను.

చ. తడి తల డిగ్గి ముంప జడ॰తం దుద ఱెప్పలఁ గన్ను విప్పి పు
ల్లొప్పడుచుచు నీరు ముంగఱల॰పోలిక ముక్కునఁ గూడ నోటఁ గొం
తొడియుచు గూఁటికట్ల సగ ॰ మొత్తుచు ఱెక్కవిదిర్పు మున్నుగా
వడఁకుచు కాక చేష్టుడిగె ॰ పక్షము పక్షులు జానువుల్ చొరన్.118

టీ. తడి=నీరు, తలడిగ్గి=తమశిరంబులనుండిదిగి, ముంపన్=ముంచుకొనఁగా, (అనఁగా వర్షము దొత్తఁ బక్షులశిరంబులుదడిపి పిమ్మట వానిశరీరంబులను దడుపఁగా ననుట.) జడతన్=జాడ్యముచేతను, తుదరెప్పలన్=పక్ష్మాగ్రములచేత, కన్నువిప్పి=నేత్రములుదెఱచి, పుల్లొప్పడుచుచు=కన్నులుపులకరించుచును (అనఁగాఁ దెఱవఁగూడని కన్నుల నతిప్రయత్నమునఁదెఱచి లోనినీళ్లు వెలుపరించుచు),నీరు=వర్షోదకము, ముంగరలపోలికన్=ముక్కు అలకైవడి, ముక్కులఁగూడన్=నాసికలయందు ప్రేలఁగా, నోటన్=వదనముచేతను, కొంతొడియుచు=కొంతస్వీకరించుచును, గూఁటికట్లన్=గూటిపుడకయందు, సగము=అర్ధము, ఒత్తుచున్=తుడుచుచును, పక్షులు=పిట్టలు,

జానువుల్=తమమోఁకాళ్ళు, వక్షము=ఎద, చొరన్=చొచ్చియుండఁగా, వడఁకు టెకాక=కంపమొందుటయేకాక, ఱెక్కవిదిర్పు మున్నుగాన్=పక్షవిధూననము మొదలయిన, చేష్ట=వ్యాపారము, ఉడిగెన్=మానెను.

తా. ఆసమయంబునఁ బిట్టలు గూండ్లయందు ముద్దలుగాఁ దడుపంబడి చలికి వడంకుట దక్క నొండుచేష్ట లుడిగి యుండె ననుట.

క. చెందు నెఱసంజ కుంకుమ
క్రందునఁ గెంపెక్కు దివికిఁ • గాశ్మీరత రా
నిందుశిలాత్వము రవి గని
యెం దోయముఁ గురియ నేల • యిటు గాకున్నన్. 119

టీ. చెందు=ప్రాప్తమైన, నెఱసంజ=పూర్ణసంధ్యారాగమనియెడు, కుంకుమ=కుంకుమపువ్వుయొక్క, క్రందునన్ = అతిశయముచేత, కెం...కిన్ - కెంపెక్కు=ఎఱుపెక్కిన, దివికిన్ = ఆకాశమునకు, కాశ్మీరత = కాశ్మీరదేశత్వము, రాన్ = రాఁగా, రవి = సూర్యుఁడు, ఇందుశిలాత్వము = చంద్రకాంతమణియగుటను, కనియెన్ = పొందెను. ఇటుగాకున్నన్ = సూర్యుఁడు చంద్రశిల గాకుండెనేని, తోయమున్ = జలమును, కురియ నేల=వర్షింప నిమిత్తమేమి?

తా. సంధ్యాకాలమునందు వర్షించుచుండఁగా నెఱుపుఁజెందినసంధ్య యను కుంకుమపువ్వుచేత నెఱ్ఱనైన యాకసంబునకుఁ గాశ్మీరదేశత్వము రాఁగా సూర్యుఁడు తద్దేశోద్భవం బని ప్రసిద్ధికెక్కిన యిందుశిలాత్వమును బొందెను. అటుగాకపోయెనేని యాసూర్యుఁ డుదకంబుల వర్షించుటకు హేతు వేమని ప్రజలు తలంచునట్లుండెనని భావము.

చ. అలజలరాశి నీటఁ బగ • లర్కకరావళి చూలు దాల్పఁగా
నలమిన యీర్ష్య రాత్రి ధవ•ళాంశుకరావళి దాము దాల్పఁ ద
జ్జలముల నాన మూఁగికొను•చాడ్పున నాడి వహించెఁ జూలు మ
బ్బుల నిల ముంచ నీలఘన•పుంజమువల్ల బలాకమాలికల్. 120

టీ. అల=ప్రసిద్ధమైన, జలరాశి=సముద్రముయొక్క, నీటన్=ఉదకముచే, పగలు=పవటియందు, అర్కకరావళి = సూర్యకిరణసమూహము, 'బలిహస్తాంశవః కరా' యనియమరము. చూలుదాల్పఁగాన్=గర్భముధరియింపఁగా, అలమినయీర్ష్యన్=జనించిన యసూయచేత, రాత్రిన్=రేయియందు, ధవళాంశుకరావళి=చంద్రకిరణసమూహము, తామున్=తామును, తాల్పన్=గర్భములుధరియించుటకొఱకు, తజ్జలములన్=ఆసముద్రోదకములను, ఆపన్=పానముచేయుటకై, మూఁగికొనుచాడ్పనన్=చుట్టుకొనినట్టుండెల, ఆడి=సంచరించి, బలాకమాలికల్=తెల్లకొంగలచాళ్ళు,

'బలాకౌబిసకంఠిక'యని యమరము.మబ్బులన్=చీఁకట్లచేతను, ఇలన్ = భూమిని, ము...ల్లన్ - ముంచు=కప్పుచున్న, నీలఘన = కాలమేఘముయొక్క, పుంజమువల్లన్=సమూహమునలనను, చూలు=గర్భమును, వహించెన్=ధరియించెను.

తా. తెల్లకొంగలు రాత్రులయందు నంధకార మగునట్లు భూమియందుఁ గప్పియున్న నల్లమబ్బుళ్లను మాలికలుగాఁ జుట్టికొని యానీళ్ళుత్రాగి గర్భము ధరింపఁగా సూర్యకిరణములు పగటియందు సముద్రోదకముచేత గర్భముధరియింపఁజూచి యీర్ష్యగలవియై చంద్రకిరణములు దామును గర్భముల ధరియించుటకొఱకు నాసముద్రోదకములం బీల్చుటకై తిరుగుచున్నట్లుండె ననుట.

క. ఉఱుము విని యలకకై దివి
వెఱఁ బఱచుమరాళపటలి • విడిచినఁ బడు న
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళ•దీధితి రాలెన్. 121

టీ. ఉఱుమున్=గర్జితమును, విని=ఆలకించి, అలకకై=అలకాపురమునకేగుటకై, దివిన్=అంతరిక్షమునందు, వెఱన్=భయముచేత, ప...లి - పఱచు = పఱువిడుచున్నట్టి,మరాళపటలి=అంచలగుంపు, విడిచినన్=వదలఁగా, పడు=పతనమునొందుచున్నట్టి, అ...నన్-అక్కఱచిన=ఆయంచలుగొఱికిన, బిసలవవిసరము = తామరతూఁడుతునుకలసమూహముయొక్క, తెఱఁగునన్=చందమునను, వడగండ్లు=వర్షోపలములు, ధవళదీధితిన్ = తెల్లనికాంతితోడను, రాలెన్ = పడెను.

తా. సుగమము.

క. తటిదుత్సారితఫణిభృ
త్పటలి నిరన్నంబు లయ్యెఁ • దక్కవు బర్హుల్
నటన మతిహర్షహేతూ
త్కటలాభం బిడునె మది క్షుధ నీర్వట్టున్. 122

టీ. బర్హులు=నెమళ్లు, త...లిన్ - తటిత్=మెఱుపులచేత, ఉత్సారిత=పోఁదోలఁబడిన, ఫణభృత్=పాములయొక్క, పటలిన్=సమూహముచేత, నిరన్నంబులయ్యెన్=నిరాహారములైనప్పటికిని, నటనము=నాట్యమాడుటను, తక్కవు = మానవు, అ...బు-అతిహర్ష=అత్యంతసంతోషమునకు, హేతు=కారణముయొక్క, ఉత్కట=అధికమైన, లాభంబు=ప్రాప్తి, మదిన్=మనంబునందు, క్షుధన్=ఆకలిని, నీర్వట్టున్=దప్పిని, ఇడునె=కలుగఁజేయునా ? (చేయదనుట).

తా. సంతోషము సగము లా వన్న నానుడిప్రకార మనుట. అర్థాంతరన్యాసాలంకారము.

సీ. రవిఁ జూచి కుడుచువా • రలకును గృకలాస,
ములకును దృష్టి మిం • న్నులనె నిలిచె
సంధ్యార్ఘ్యదాయిద్వి • జశ్రేణి కిలు సేరు,
మొదవులకును భ్రాంతి • మది జనించె
హాలజీవిసందోహ • ములకు బలాకికా,
విసరంబులకు మంచి • వెదలు దొరకె
నెలమిఁ బొల్పగుయూధి • కలకు సంతలకూట,
ములకును మఱి విచ్చు • మొగ్గ లొదవె
తే. నతిథిసంఘంబునకు నీని • నట్టియెనుప
కదుపులేఁగలగమికి వా • కట్టు లెసఁగె
మంటిమిద్దెలవారికి • మరుపనులకు
నెలఁత వాసినవారికి • నిదుర చెడియె. 123

టీ. రవిన్=సూర్యుని, చూచి=వీక్షించి, కుడుచువారలకును = భోజనము సేయువారికిని, కృకలాసములకును = తొండలకును, 'సరటఃకృకలాసస్స్యా' త్తని యమరము. దృష్టి=చూపు, మిన్నులనె=అంతరిక్షమందే, నిలిచెన్=ఉండెను. (ఆదిత్యునిఁజూడక భుజింపమను నియమముగలవారలకుఁ దద్దర్శనాపేక్షచేతను, దొండలకు వానిపాలసుసంమన నీరుచొచ్చిన వాని దేహము లూడుచున్నవిగానఁ గొమ్మలం దూర్ధ్వముగ నిలిచియుండుటచేతను గనుచూపు లంతరిక్షమందె యుండుననుట.) సం... కిన్-సంధ్యార్ఘ్యదాయి-సంధ్యా=సాయంకాలమునందు, అర్ఘ్యదాయి=అర్ఘ్యప్రదానము చేయునట్టి, ద్విజశ్రేణికిన్=పుడమివేల్పులసంఘమునకును, ఇలుసేరు మొదవులకున్=ఇండ్లకువచ్చుచున్న పసులకును, భ్రాంతి=సాయంకాలమనుభ్రమము, మదిన్=బుద్ధియందు, జనించెన్=పుట్టెను. హాలజీవిసందోహమునకున్ = వ్యవసాయముఁజేయు జనసమూహమునకును, బలాకికావిసరంబులకున్ = తెల్లకొంగలగుంపులకును, మం...లు-మంచ=అనుకూలమైన, వెదలు=చల్లఁబడ్డచేలు, చక్కఁగా మొలచుటయు =గర్భధారణమును, దొరకెన్=ప్రాప్తించెను. శ్లో. 'గర్భం బలాకాదధతేఽబ్దయోగాన్నాకేనిబద్ధావలయం సమంతా' త్తని కర్ణోదయమందుఁ బ్రయోగము. ఎలమిన్ = ఉత్సాహముతో, పొ...కున్-పొల్పగు=ఒప్పుచున్న, యూధికలకున్=మొల్లల భేదములకును, సంతలకూటములకును = సంతలకువచ్చి కూడియున్న జనములకును, (సంత యనఁగా గ్రామాంతరములనుండి వర్తకులు నానావిధంబులైన సరకులందెచ్చి బస్తీగా నుండుగ్రామమునకు వెలపలనునిచి యావస్తువులను విక్రయించెడు బజారు.)

మతి=మిక్కిలియును, విచ్చుమొగ్గలు=పరువిడుటయు, మొగ్గలువిచ్చుటయును, ఒదవెన్=కలిగెను. (అనఁగా వర్షాకాలమునందుఁబుష్పించునట్టియూథికలు వికసించినవనియు, వర్షము రాఁగా సంతకువచ్చినప్రజ లూళ్ళకువిచ్చిపోయిరనియు భావము. అతిథిసంఘంబునకున్=అతిథిసమూహమునకును, ఈ...కిన్-ఈనినట్టి, ఎనుప = గేదెలయొక్క, కదుపు=సంఘముయొక్క, లేఁగలగమికిన్ = దూడలసమూహమునకును, వాకట్టులు=వాగ్బంధనములు, ఎసఁగెన్=అతిశయించెను, (మేరదప్పినవర్షముగురియుచుండఁగా సంచరించుట కుపాయమొందని యతిథులకు నన్నము లేనందునను-గేదెకదుపుల లేఁగలకుఁ జలిచేత దవడలుమూసికొని పాలుగుడువఁగూడనందునను వాగ్బంధనములాదవె ననుట.) మంటిమిద్దెలవారికిన్=మంటితోమేడలేర్పఱచుకొన్నవారికిని, మరుపనులకు=మన్మథవ్యాపారములకు, నెలఁతన్=స్త్రీలను,(ఇది జాత్యేకవచనము.) పాసినవారికిన్=ఎడఁబాసినవారికిని, నిదురచెడియె=నిద్రలేకపోయెను (అనఁగా మంటిమిద్దెలుగలవారికిఁ బైనున్నమన్ను వర్షముచేతఁగఱఁగి యింటిలోనురియుటచేతను, మన్మథవ్యాపారములకు స్త్రీలులేనివారికి విరహవేదనగల్గుటచేతను నిదురలేకయుంట ప్రసిద్ధము. మఱుపనులకు నెలఁతఁబాసినవారికనుదాని కితరవ్యాపారార్థము స్త్రీలనెడఁబాసినవారికని కొన్నివ్యాఖ్యానములలోనున్నది. మరుపనులకును నిద్రలేకపోయెననియైనం జెప్పవచ్చును. ఆపక్షమున నది యధికముగా జరగెననిభావము.)శ్లో. 'వర్ణ్యానామితరేషాం వాధర్మైక్యం తుల్యయోగితా' యను లక్షణముచేత నొప్పియున్న తుల్యయోగితాలంకారము. రెండవగీటున భ్రాంతిమదలంకారము.

ఉ. కాలునిదున్న నందినయి • గంటలుదున్నక మంటినా మహా
కాలునినందిదున్ననయి • కర్దమమగ్నత లేక మంటి నా
హాలికు లెన్నఁడుం దెగని • యారులచేలును జౌడుమళ్లునుం
గా లలి నేరు సాఁగి రిలఁ • గల్గుపసింగొని పేద మున్నుగన్. 124

టీ. కా...న్న-కాలుని=యమునియొక్క, దున్న = వాహనమైనమహిషము-'కాలో దండధర శ్శ్రాద్ధదేవః' యని యమరము. నందినయి=వృషభమై, గంటలు=అవురుదుబ్బలను, దున్నక=కృషిచేయక, మంటినాన్=బ్రదికితిననఁగా, మహాకాలునినంది=రుద్రునకు వాహనంబైనవృషభము, 'మహాకాలో మహానటః' యని యమరము. దున్ననయి=దున్నపోతనై, కర్దమమగ్నతలేక=బురదలయందుఁ గాళ్ళూదిగఁబడలేక - 'పంకో స్త్రీ శాదకర్దమౌ' యని యమరము. మంటినాన్=బ్రదికితిననునట్లుగ, హాలికులు=కృషీవలులు, ఎ...ను-ఎన్నఁడుందెగని=ఏ దినమందును దున్నని, ఔరులచేలును=గంటలుగల చెలికలును, చౌడుమళ్లునుంగాన్=ఊషరములగు కేదారములుగా, లలిన్=ఆసక్తిచేతను, పేదమున్నుగాన్=దరిద్రుఁడు మొదలుగా, ఇ...సిన్ కొని - ఇలఁగల్గు=

భూమియందున్న, పసింగొని=పశుమాత్రమునంతయును గూర్చి, ఏరుసాఁగిరి=మడక కట్టిదున్నిరి.

తా. దున్నపోతులకు వెలిదుక్కి కష్టముగనుక యమునికి వాహనమగుటవల్ల దున్నక సుఖించితినని యామహిషంబును, ఎద్దులకు రొంపి దుక్కి కష్టముగనుక నీశ్వరునకు వాహనమ్మైనందున దున్నవలసినది లేదని యావృషభంబును నెంచునట్లుగాఁ బుడమియం దెల్లెడలనుండు పశువులం దెచ్చి బీదలు మొదలగు హాలికులు బీటిచేలు చవటికయ్యలుగూడ దున్నిరనుట.

క. వరజుబడి రొంపిఁ ద్రొక్కం
జరణంబులఁ బెనఁగి పసిఁడి • చాయకడుపులం
బొరి నీరుకట్టె లమరెను
బిరుదులు హాలికులు దున్నఁ • బెట్టిరొ యనఁగన్. 125

టీ. వరజుబడిన్=గనిమ వెంబడిని, రొంపిఁద్రొక్కన్ = మడిలోనీరువెళ్ళకుండునట్లు బురదనుద్రొక్కఁగా, చరణంబులన్=పాదములను, పెనఁగి=చుట్టి, పసిఁడిచాయకడుపులన్=బంగారువన్నెగల యుదరములతోఁగూడిన, నీరుకట్టెలు=నీరుత్రాట్టుపాములు, పొరిన్=ఔద్ధత్యముచేతను, హాలికులు=కర్షకులు, దున్నన్=దుక్కియందు, బిరుదులు=తమకు సరియెవ్వరును గారని గండపెండెరములు, పెట్టిరొయనఁగన్=ధరియించిరో యన్నట్లు, అమరెన్=ఒప్పెను.

క. నాని శిఖి వంటచెఱకుల
చే నఱ నవి వెండి వంట • చెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల
బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి • పొగయమి వృష్టిన్. 126

టీ. శిఖి=అగ్ని, వంటచెఱకులచేన్=వంటకట్టియలచేతను, నాని = తడిసి, అఱన్ = చల్లాఱఁగా, (ఎడతెగని వానలచేతఁ దడిసియున్నకట్టెలను నిప్పుమీఁద వేయఁగానే యాయగ్ని చల్లాఱెననుట.) అవి=ఆయింధనములు, వెండి=మఱియును (అనఁగా విచారింపఁగాననుట.) వంటచెఱకులెయగుటన్ = వంటకుయోగ్యముయిన చెఱకులని యన్వర్థము లగుటచేతను (అనఁగా బెల్లమువండుటకుఁ దగిన చెఱకులు రసఘనములైయుండి గానిగయందుంచి త్రిప్పఁగా నెట్లు రసమును వెళ్లఁగ్రక్కునో యాతీరుననే ప్రొయిలోనఁ బెట్టఁగానే కట్టియలు నీరు వడియుటంజేసి వంటచెఱకు లన్నపేరు సార్థక మాయెననుట.) బోనంబు=అన్నము, ప్రజకున్=జనమునకు, జక్కులబోనంబులెయయ్యెన్ = కామేశ్వరునిఁగొల్చు జక్కులవాండ్రవ యన్నమాయెను. అనఁగా శూద్రులయొక్క పెండిలిమొదలగు నుత్సవములయందు జక్కులవాండ్రు,

అరివేణిపెట్టిన శూన్యభాండములను దలమీఁద మోచికొని బోనాలుబోనాలనిపల్కుట ప్రసిద్ధముగానఁ దత్తుల్యంబాయె నని భావము. ప్రాయ్యా=అధిశ్రయణి, వృష్టిన్=వర్షముచేతను, పాగయమిన్=రాఁజకయుండుటచేత నని క్రిందికన్వయము.

సీ. ఇల్లిల్లు దిరుగ నొ♦క్కిం తబ్బు శిఖి యబ్బె,
నే నింటిలోఁ బూరి ♦ యిడి విసరక
రాఁజదు రాఁజిన ♦ *రవులుకొల్పాసలె,
గాని కల్గదు కూడు ♦ దానఁ గలిగె
నేని కూరగుట మం ♦ దైనఁ బెన్పొగ సుఖ,
భుక్తి సేకూర దా ♦ భుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తలకె తీరు ♦ బహుజనాన్నము దీర,
నారుల కొదవుఁ బు♦నఃప్రయత్న
తే. మాజ్యపటముఖ్యలయ మెన్న ♦ రాలయాంగ
దారులయ మెన్న రంతిక♦కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ ♦ బడక మరుఁడు
వెడవెడనె యార్వ నొగిలి ర♦జ్జడిని గృహులు. 127

టీ. ఇల్లిల్లు=ప్రతిగృహమునకును, తిరుగన్=వెళ్లఁగా, శిఖి=అగ్ని, ఒక్కింత=కొంచెము, అబ్బున్=దొరకును, అబ్బెనేని=లబ్ధంబాయెనా, ఇంటిలోఁబూరి=ఇంటిపైకసవును, ఇడి=దానిపైనునిచి, విసరక రాఁజదు = వీజనముసేయక యంటికొనదు. రాఁజినన్=అంటికొనినను, రవులుకొల్పాసలెకాని=ప్రజ్వలింపఁజేయు నపేక్షయె కటిదక్క, దానన్=ఆమఁటవలన, కూడు=అన్నము, కల్గదు=దొరకదు ( రవులుకొల్పాసాలఁగాని యను పాఠమునందు గృహములలోని వాసములను విఱిచి పెట్టకగాని రగులదని యర్థము.) కలిగెనేని=అన్నమైనప్పటికిని, కూరగుట=శాకపుగుట, మందు=ఔషధము ( అనఁగా దుర్లభమనుట.) ఐనన్=శాకమైనను, పెన్పొగన్=ప్రబలంబైన ధూమముచేతను, సుఖభుక్తిచేకూరదు=సుఖకరమైనభోజనముదొరకదు. ఆభుక్తికిడినన్=ఆభోజనమున కొసంగినను, బహుజనాన్నము=ఇంటిలో నున్నవారలకెల్ల వండిన యన్నము, ప్రాగ్భోక్తలకే = తొలుబంతి భోజనముఁ జేయువారలకే, తీరున్=సరిపోవును ( ఆకాలమునకువచ్చిన యతిథులఁ బరిహరింపరామింజేసి వారలకిడుటచేతఁ బక్వాన్నము సరిపోవు ననుట.) తీరన్=సరిపోఁగా, నారులకు=ఉవిదలకు, పునఃప్రయత్నము=మరలవంటయొనర్చుట, ఒదవున్=కలుగును, అంతికకున్=ప్రాయ్యకి, నా...ము - ఆజ్య=నేతిచేతఁ దడుపఁబడిన, పటముఖ్య=కోకలు లోనైన

* రవులుకొల్పాసాలఁ.

వానియొక్క, లయమువిన్నరు=నష్టమువిచారింపరు, ఆ...ము - ఆలయ=ఇంటియొక్క, అంగదారు=వాసాలయొక్క, లయము = నాశమును, ఎన్నరు = లెక్కింపరు (ప్రొయ్యిమండుటకై నేతిలో బట్టలుదడిపిపైచియు వాసాలు పెటికిపైచియును వానినష్టమును లెక్కింపకుండిరనుట.) అ...ణి - అరజనిక=రాత్రిదివములను, పచన=పాకముసేయుటచేతను, నాంధః=అన్నములేకయుండిన, గృహిణి = ఇల్లాలు, రామిన్=రాకపోవుటవలన, పడకన్=శయ్యయందు, మరుఁడు = పచ్చవిల్తుఁడు, వెడవెడనె=పెళపెళమని, అర్వన్=వేగిరింపఁగా, అజ్జడిన్=అముసారునందు, గృహులు=గృహస్థులు, నొగిలిరి=కృశించిరి. (అనఁగాఁ దొట్రుపడి రనుట.)

తా. ఆసమయంబునందు నెల్లదిక్కులనుండు సతీపతులంద ఱాహారమజ్జనశయనాదులయందుఁ గ్లేశము నొందున ట్లెడతెగక జడివానలు గురియుచుండె ననుట.

చ. పిడుగుల కల్కి లోఁ దొలిచి • భీరులు కంచముఁ జల్లుదీధితు
ల్గడపల వెళ్ళిరాఁ బొగలఁ • గావిరిబ్రుంగెడు పుల్లగృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నూళ్ళ నిల • యెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గిన స•విద్యుదురుస్తనయిత్నులో యనన్. 128

టీ. పిడుగులకున్=అశనిపాతములకు, అల్కి=వెఱచి, భీరులు=భయస్వభావముగల స్త్రీలు, 'భీరుర్బిమ్బాధరాఙ్గనా' యని నిఘంటువు. కంచము=భోజన పాత్రమును, లోఁదొలిచి=కడపలకులోపలనేకడిగి, చ...ల్-చల్లు=త్రిప్పినీరుబైటఁ జల్లఁగాఁబుట్టిన, దీధితుల్=కాంతులు, కడపలవెళ్లిరాన్=దేహళులదాఁటిరాఁగా, పొగలన్=ధూమములచేతను, కా...లు-కావిరిబ్రుంగెడు=ధూమ్రవర్ణము గప్పినట్టి, (వర్షాకాలమందుఁ దడిసిన గృహములకుఁ బొగచుట్టికొనియుండుట ప్రసిద్ధము.) పుల్లగృహంబులు=పూరి యిండ్లు, ఎల్లెడన్=ఏదెసఁజూచినను, ఊళ్ళన్=గ్రామములయందు, ఇలయెల్లను=భూమియంతయును, ముంచి=వాననీళ్ళచేత నిండింపఁజేసి, రసాతలంబుపైన్=పాతాళమువిూఁద, విడియఁగన్=ఆక్రమింపవలయునని, ద...లో అనన్-ఉరు=గొప్పలయిన, దండుడిగ్గిన=భూమియందుసేనానమేతమైవిడిసిన, సవిద్యుత్=మెఱుములతోఁగూడిన, స్తనయిత్నులోయనన్=మేఘములోయనునట్లు, కనుపట్టెన్=చూపట్టెను. ఉత్ప్రేక్ష.

చ. గొడుగుల గాలిఁ గూల్చి మఱి • కోలలతోడన పాఱ నాన్చెఁ జే
డ్పడ జడి మేఘుఁ డట్లకట • పాంథులపైఁ దన కెంత వైరమో
తడిసినమేన నింకి యది • దారవియోగజవహ్నిఁ గొంత కొం
తుడిపె విధాతరక్ష విష • మొక్కొకమా టమృతంబు సేయఁగన్.

టీ. మేఘుఁడు=జలధరుఁడు, గొడుగులన్=ఛత్రములను, గాలిన్=వాయువుచేతను, కూల్చి=ఎగురఁగొట్టి, మఱి=పిమ్మట, కోలలతోడన=గొడుగుకఱ్ఱలుమాత్రము చేతఁబట్టి, పాఱన్=పఱువిడుచుండఁగా, జడిన్=వర్షముచేతను, చేడ్పడన్=బాధపడునట్లుగ, నాన్చెన్=తడిపెను, అట్లు=ఆలాగుతడుపునట్లు, అకట = అయ్యో, తనకున్=మేఘునికి, పాంథులపైన్=పథికులమీఁద, ఎంతవైరమో=ఏపాటివిరోధమో (నాన్చెనని క్రిందికన్వయము.) విధాతరక్ష=విరించియొక్క రక్షణము, విషము=గరళమును, ఒక్కొకమాటు=ఒక్కొకపర్యాయము, అమృతంబుసేయఁగన్ = సుధగాఁజేయుటవలన, అది=ఆవర్షము, తడిసిన మేనన్=నానినశరీరమందు, ఇంకి=ఇగిరి, దారవియోగజనహ్నిన్=భార్యలవిరహమువల్లఁబుట్టినయగ్నిని, కొంతకొంతుడిపెన్=కొంతవడిఁబోఁగొట్టెను. ఈపద్యమునందుఁ బూర్వార్థంబున వ్యాఘాతాలంకారంబు నుత్తరార్థంబున విచిత్రాలంకారము. శ్లో. 'స్యాద్వ్యాఘాతో తథాకారి తథాకారిక్రియేతచేత్, విచిత్రంయత్ప్రియత్నశ్చే ద్విపరీతఫలేప్సయోః' అని వానికిలక్షణము.

తే. దవులఁ జల్లని దూఱ నం•తకమునుపటి
జల్లునీరాని వచ్చునా•జల్లు మొదలి
గాలి యెలగోలుచేఁ గొమ్మ•గదలి జల్లు
దలపడకమున్న వంగుళ్లఁ• దడిపెఁ దరులు. 130

టీ. తరులు=వృక్షములు, దవులన్=దూరమునందు, జల్లని= వానయనుకొని, దూరన్=వానిక్రిందికిబోఁగా, అంతకమునుపటిజల్లు=దూరమునుండి వచ్చువానకంటె మున్నుగురిసియున్నవానయొక్క, నీరాని=ఉదకముగలవై, వచ్చునాజల్లు=దూరమున వచ్చుచున్నయావానయొక్క, మొదలి=ముందుగవచ్చిన, గాలియెలగోలుచేన్=ఎలగోలుగాలిచేతను, (దండునకు ముందుగాఁబోయి హెచ్చరికచేయుటకు నెలగోలని చెప్పుట ప్రసిద్ధము.) కొమ్మగదలి=శాఖ చలనమునొంది, జల్లుదలపడకమున్న=వచ్చుచున్న వర్షము రాకమునుపే, వంగుళ్ళన్=నమ్రములైయున్నకొమ్మలు మొదలగువానిచేతను, తడిపెన్=నాన్చెను, పథికుల నని పూర్వపద్యమునునుండు కర్మ నధ్యాహరింపవలయును.

చ. రయమున వృష్టికై యొదిఁగి• రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి• నాతనిపై నృపతిం గజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు • మబ్బొకయించుక విప్ప విచ్చుమొ
గ్గయి మఱి పాఱి పోదురు స•మస్తదిశాగతులైనయధ్వగుల్.131

టీ. స...ల్-సమస్తదిశ=సకలదిశలనుండి, అగతులైన=వచ్చినట్టి, అధ్వగుల్ = తెరువరులు, రయమునన్=వేగముచేత, వృష్టికై=వానకై, ఒదిగి=పోఁటుచాలక య

డంగికొని, రచ్చలపైన్=ధర్మపుచావిళ్ళ యరుఁగులమీఁద, హయపతిమీఁదన్=అశ్వపతిపైని, దంతిపతిన్=గజపతిని, అతనిపైన్=ఆగజపతిమీఁదను, నృపతిన్=నరపతిని (అశ్వపతి ప్రబలుఁడు, వానికంటె గజపతి ప్రబలుఁడు, గజపతికంటె నరపతి ప్రబలుఁడనియనుట.) ఉగ్రతన్=కోపముతోడను, విధియింతురు=నిర్ణయింతురు, గజాదినిర్ణయములన్-గజ=యేనుఁగులు, ఆది=మొదలగువానియొక్క, నిర్ణయములన్=నిశ్చయించుటలయందు, మొత్తులాడుదురు=కలహపడుదురు (అనఁగా నశ్వపతి యెక్కుఁడనియొక్కండును, గజపతియ ప్రబలుండని మఱియొక్కండును, నందఱికంటె నరపతి యధికుండని యన్యుండును, వానికంటె వీనికి నశ్వము లెక్కువనియు, వీనికంటె వానికి గజంబులు తక్కువనియు, నీ మొదలగు గజాదిసంఖ్యానిర్ణయాభినివేశములచేతఁ గలహించుచుందురనుట.) మబ్బు = మేఘము, ఒకయించుక విప్పన్=కొంచెము విడువఁగా, మఱి= పిమ్మట, విచ్చుమొగ్గయి=ప్రోగువీడినవారలై, పాఱిపోదురు = ఎవ్వరిదారిని వారు వెళ్ళుదురు.

తా. బాటసారులకుఁ ద్రోవ జరగకుండునట్లు జడివానలు గురియుచుండెనని భావము.

క. తనరె బలిభుక్తతులు నిం
డినగ్రామశ్రీల కఱితి • నీలము లగుటం
గనియెఁ దృణగ్రాహిత ననఁ
గొనుకసవులఁ జైత్యతరుల • గూండ్లిడుభ్రమలన్. 132

టీ. బలిభుక్తతులు = కాకులగుంపులు, 'ధ్వాంక్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసా అపి' యని యమరము. నిండిన గ్రామశ్రీలకున్=సంపూర్ణగ్రామలక్ష్ములకు, అఱితి=కంఠమునందున్న, నీలములగుటన్=ఇంద్రనీలమణులౌటచేత, తనరెన్ = ఒప్పెను, చైత్యతరులన్=ఉద్యానపాదపములందు, 'చైత్యమాయతనే బుద్ధబింబేచోద్యానపాదపే' యని విశ్వము. గూండ్లిడుభ్రమలన్-గూండ్లిడు=గూండ్లుపెట్టుటకొఱకు, భ్రమలన్=తిరుగుటచేతను, కొనుకసవులన్=పట్టికొనిపోవుతృణములచేతను, తృణగ్రాహితన్ = తృణగ్రాహిత్వమును, కనియెన్=పొందెను, అనన్=అనునట్లు, తనరె ననిక్రిందికన్వయము.

తా. నీలములు తృణగ్రాహులుగాన నావిధంబుగఁ గాకుల గుంపులు గ్రామసమీపముననుండు నుద్యానమందలి చెట్లయందుఁ గూండ్లు గట్టికొనవలయునన్న యిచ్ఛచేతఁ గఱచికొనిపోవుచున్న కసవులం జూడఁగా దండియైన గ్రామలక్ష్ములు కంఠమునందు ధరియించిన హారమందలి నీలమణులు తృణంబులను గ్రహించుచున్నవో యన్నట్లుగా నొప్పె ననుట.

మ. వసతుల్వెల్వడి వానకై గుడిసె మోవన్రాక తానానియే
వసగా నిల్చినజమ్ముఁగూడఁ బొలమంబళ్ళ్మోయుచుం బట్టి పె
న్మసురం దీగెడుకాఁపుగుబ్బెతలపెన్గుబ్బల్పునాసల్వెలిం
బిసికిళ్లుం బిసికిళ్లు హాలికుల కర్పించె న్నభస్యంబునన్. 133

టీ. వసతుల్వెల్వడి=గృహములు బయలువెళ్లి, వానకై = వర్ష బాధానివర్తికొఱకు, గుడిసెమోవన్రాక=పొలములోఁ గాపునిమిత్తమై వేయఁబడ్డకుటీరముదగిలికొనఁగా లోపలికిరాక, తాన్=తాను, ఆనియే=తగిలికొనియే, పసగాన్=ఒప్పిదముగా, ని...డన్-నిల్చిన=నిలుపంబడియున్న, జమ్ముగూడన్=జమ్ముచేగట్టఁబడ్డగూడను, (జమ్ముగూడ కావలిగుడిసెలోనికి రాక గుడిసె దగిలి నిలిచియుండఁగా ననుట.) పొలమంబళ్ళ్మోయుచున్ = కృషి సేయుభూమికి నంబలిమోచికొనుచు, పట్టి = ధరియించి, పెన్మసురంబున్=జడివానయందు, ఈ...ల్-ఈగెడు=గుడిసెలోపలం దూరునట్టి, కాఁపుగుబ్బెతల=కాఁపువాండ్రవనితలయొక్క, పెన్గుబ్బల్=గొప్పనైనకుచములును, పునాసల్=పూర్వసస్యంబులైన సజ్జలుమొదలయినవియును (పునర్వసుకార్తెయందుఁ జల్లఁబడ్డధాన్యములు గనుకఁ బునాసలని వ్యవహారము.) వెలిన్=వెలుపలను, హాలికులకున్ = కృషిఁజేయు శూద్రులకు, పిసికిళ్లున్=కుచగ్రహణంబులును, పిసికిళ్లు = కంకులనల్పుటలును, నభస్యంబునన్=భాద్రపదమాసమునందు, అర్పించెన్=ఒసంగెను.

మ. గురుగుం జెంచలి దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారికో
గిరము *ల్మెక్కి తమిం గొమల్పొలము వోగ్రేఁపుల్మెయుల్మాకమేఁ
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. 134

టీ. గురుగున్=కురకటశాకమును, చెంచలి=తువిన్నకశాకము, తుమ్మి=ద్రోణశాకము, లేఁదగిరిసాకున్ = కోమలమైన తంటెపుకూరయును, తింత్రిణీపల్లవోత్కరమున్=చింతచిగురును, కూడన్=వానితోఁగలిపి, నూనియలతోన్=తైలములతో, పొరంటి=పొరఁటి, కట్టావి = చుట్టు నావిరి బొటి మిగుల వేఁడియయిన, కుట్టారికోగిరముల్=కుఱుచయారికకూళ్లు, (మూఁడు నెలలకుఁ బండునవి కుఱుచయారిక లనియు నయిదునెలలకుఁ బండునవి పెద్దారికలనియుం జెప్పుదురు.) మెక్కి=తిని, తమిన్=రాత్రియందు, కొమల్=కొడుకులు, (చెట్లకు శాఖలవంటివారు గనుక నిట్లు చెప్పవచ్చును.) పొలముపోన్=చేలుగాయఁబోగా, రెడ్లు = పెత్తనముచేయుకాఁపులు, ప్రభుత్వైకాప్తిన్ = అధికారమొకటియబ్బుటచేత, అజ్జడిన్ = ఆ ముసురునందు, క్రేఁపుల్ =

* ల్మెసి.

దూడలు, మెయుల్ = దేహములను, నాఁకన్ = లేహనమొనరింపఁగా, మేఁకెరువుంగుంపటి=మేఁకలయెరువున నెత్తియుంచిన కుంపట్లుగల, మంచ మెక్కిరి=ఖట్వారోహించిరి, (వానకుఁదడిసియు నని దూడలను మంచపుఁగోళ్లకుంగట్టి నవి దేహములను నాఁకుచుండఁగా శయనించిరనుట).

సీ. మణియష్టిఁ గేలిబ • ర్హిణషడ్జసుధ వీను,
లోలాడఁ బ్రొద్దెక్కి • మేలుకాంచి
ఘుమఘుమవత్సుమ • గంధరాజాంగమ,
ర్దనపైఁ జిరోష్ణమ • జ్జనము లాడి
మిసిమిదువ్వలువ బ • న్నసరంబు మొగలిఱే,
కులఁ దాల్చి జా మెక్కి • కొలువొసంగి
జాంగలామిషముతో • శాల్యన్న మధికహ,
య్యంగవీనంబుగా • నారగించి
తే. మృగమదము మించుతములంపు • టిఱుల మోవి
దలముగా సాగరుహసంతి • వెలుఁగ సౌధ
శిఖరవాతాయనాగతా • చిరరుగంశు
నతదృగవరోధములతోడ • నగిరి నృపులు. 135

టీ. మణియష్టిన్ = మణిమయమైనదండమునందున్న, కే...ధ - కేలిబర్హిణ=పెంపుడునెమళ్లయొక్క, షడ్జ=షడ్జస్వరమనియెడు, సుధ = అమృతము, వీనులోలాడన్=చెవులునిండఁగా, ప్రొద్దెక్కి=సూర్యోదయంబైన మఱి కొంతసేపటికి, మేలుకాంచి=నిద్రలేచి, ఘు...పైన్ - ఘుమఘుమవత్=ఘుమ్మనివాసించుచున్న, సుమగంధరాజ=ఈపేరిటి ద్రవ్యముయొక్క, అంగమర్దనపైన్ = నలుఁగుబెట్టినమీఁదట, చిరోష్ణ=మిక్కిలివేఁడిమిగలయుదకములచేత, మజ్జనములు=జలకములు, ఆడి=సలిపి, (చిరోష్ణమజ్జనములాడి యని యున్నందున నుష్ణశబ్దమునకు నుష్ణోదకమని యర్థముఁ జెప్పవలయును.) మిసిమిదువ్వలువన్=సరిగ తళతళలాడుదుప్పటిని, బన్నసరంబున్=బన్నసరములను హారములను, మొగలిఱేకులన్=మొగిలిపువ్వులను, తాల్చి=ధరియించి, జామెక్కి=జాముప్రొద్దెక్కినవెనుక, కొలువొసంగి=సభఁజేసి, జా...తోన్ - జాంగల=మరుభూమియందలి, ఆమిషముతోన్ = మాంసముతోడను, (అనఁగా మరుభూమియందు సంచరించెడు కౌఁజు, పూరేఁడు, ఉడుము, ఏఁనుఁబంది మొదలగు వాని మాంసమనుట.) 'పలలంక్రవ్యమామిష'మ్మని యమరము. శాల్యన్నము=రాజనపుసాదమును, అధికహయ్యంగవీనంబుగాన్=అప్పుడు వెన్నగాఁచిననేయి యెక్కుడు

గాఁ గలుగునట్లు 'తత్తుహైయ్యంగవీనం యద్ధ్యోగోదోహోద్భవంఘృత'మ్మని యమ రము. ఆరగించి=భోజనముఁజేసి, మృగమదముమించు = కస్తూరియొక్కవగాఁగల, తములంపుటిరులు=విడెముకాంతులు, (కస్తూరి యధికమగుటవలన నల్లగా నుండుటచేత నిరులనుట.) మోవిదళముగాన్=పెదవిదట్టముకాఁగా, సాగరుహసంతివెలుఁగన్= అగరుచెక్కతో నించినకుంపట్లు ప్రజ్వలించుచుండఁగా, సౌ...న్-సౌధ=ఉప్పరిగె లయొక్క, శిఖర=పైయంతస్తులయందున్న, వాతాయన=గవాక్షములనుండి, ఆగత= వచ్చినట్టి, అచిరరుక్=మెఱుపులయొక్క, అంశు=కాంతులచేతను, నత=వంపఁబడిన, దృక్=చూపులుగల, అవరోధములతోడన్=అంతఃపురస్త్రీలతో, 'శుద్ధాంతశ్చావ రోధశ్చ' యని యమరము. నృపులు=రాజులు, నగిరి=ఆనందించిరి.

వ. ఇట్లు సాంద్రసలిలధారాసారమాసరంబు లగు వార్షికవాసరంబులు
ప్రశాంతం బగుటయుఁ దదనంతరంబ. 136

టీ. ఇట్లు=ఇవ్విధంబుగా, సా...లు - సాంద్ర=ఘనమైన, సలిల = ఉదక ములయొక్క, ధార=ధారలయొక్క, ఆసార = సమ్యక్ప్రవర్షణములచేతను, మాస రంబులగు=వ్యాప్తములైన, వార్షికవాసరంబులు =వానకాలపుదినములు, ప్రశాంతంబగు టయున్=శాంతింపఁగా, తదనంతరంబ=అటుపిమ్మట.

ఉ. రాజమరాళలబ్ధగిరి•రంధ్రము శాలివనీశరావలీ
వైజననంబు యజ్వహుత•వాజహుతాశము భాస్వదిందిరాం
భోజసమాగమం బుదిత•బోధభుజంగశయోపచార నీ
రాజనఫుల్లహల్లకస•రం బుదయించె శరద్దినం బిలన్. 137

టీ. రా...ము - రాజమరాళ=రాజహంసలచేత, లబ్ధ = పొందఁబడిన, గిరి రంధ్రము=క్రౌంచపర్వతముయొక్క బిలముగల్గినట్టియు, (అంచలు మానససరోవరం బున వర్షాకాలము వెళ్లఁబుచ్చి శరదృతువురాఁగాఁ గ్రౌంచపర్వతపుబిలములోఁజొచ్చి దశార్ణాదిదేశంబులకువచ్చుట ప్రసిద్ధము.) శాలివనీ=రాజనపుంజేలను,శరావలీ=రెల్లుగం టలసమూహమునకును, వైజననంబు=ఈనునెలయైనదియును, 'సూతిమాసోవైజననః' యని యమరము. యజ్వ = విధ్యుక్తప్రకారము జన్నముఁజేసినవారిచేత, హుత= హోమముచేయఁబడ్డ, వాజి=హవిస్సుగల, హుతాశనము = శ్రౌతాగ్నిగలదియును, (అపుడు సోమయాజులు నూతనాన్నభోజనముకొఱకు నాగ్రయణేష్ట్యాదికముఁజేసిర నుట, లేక, వాజివాజపేయము గలయదియైనఁ జెప్పవచ్చును. శరద్వాజపేయము ప్రసిద్ధము.) భా...బు - భాస్వత్=వెలుంగుచున్న, ఇందిరా=లక్ష్మికి, అంభోజ=

కమలములతోడి, సమాగమంబు=కలయికగలదియును, (శరదృతువునందుఁ గమలములకు వికసనముగల్గుటంజేసి వానియందే లక్ష్మి నివసించె ననుట.) ఉ...బు-ఉదిత=జనించిన, బోధ=మేల్కొనుటగల, భుజంగశయ=దామోదరునకు, ఉపచార=పూజనార్థమైన, నీరాజన=నివాళియయిన, ఫుల్ల=పూచియున్నట్టి, హల్లక = చెంగల్వలుగల,సరంబు=కొలంకులుగలిగినట్టి, 'హల్లకంరక్తసంధ్యక'మ్మని యమరము. అనఁగాఁ జాతుర్మాస్యము లప్పటికిఁ గడచినవిగాన భగవంతుండు నిద్రమేలుకొనఁగా శరల్లక్ష్మి నీరాజనమెత్తెనో యన్నట్టుంబలెఁ జెన్నొందియున్న యెఱ్ఱచెంగల్వలతో నొప్పియున్న కొలంకులు గలదనుట.) శరద్దినంబు=శరద్వాసరము, ఇలన్=భూమియందు, ఉదయించెన్=కనుపడెను, వికసించినచెంగల్వలను నిద్రమేలుకొన్న యీశ్వరునకు శయనోపచారనీరాజనముగా వర్ణించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. వర్షర్తుధర్మములయిన వర్షించుట మొదలగు చిహ్నములు మాని శరదృతుధర్మములు గానవచ్చె నని తాత్పర్యము.

క. కరము పొగ రెక్కె నంబర
మురువిద్యుద్దీపకళిక • లుమిసిన ధూమ
స్ఫురణ బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలాసి•తామలరుచులన్. 138

టీ. కరము=మిక్కిలి, అంబరము=గగనము, ఉ...లు - ఉరు=అధికమైన, విద్యుత్=మెఱుపులనియెడు, దీపకళికలు=దీపాంకురములు, ఉ...నన్-ఉమిసిన=చిమ్మినటువంటి, (శ్లో. 'నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాదిగౌణవృత్తివ్యపాశ్రయమ్, అతిసుందరమన్యత్ర గ్రామ్యకక్ష్యాంవిగాహతే' అనిఆచార్యదండి చెప్పియున్నారుగాన నుమిసిన-అనునది మొదలగువానికి గౌణార్థముతెకాని ముఖ్యార్థములు చెప్పఁగూడదు.) ధూమ=పొగయొక్క, స్ఫురణన్=స్ఫురించుటచేత, పొగచూరెననఁగాన్=ధూమితమాయెనో యన్నట్లు, హ...లన్-హరిమణి=ఇంద్రనీలములవలెను, జంబూఫల=నేరేడుపండ్లవలెను, అసిత=నల్లనైన, అమల=స్వచ్ఛములై యున్న, రుచులన్=కాంతులచేతను, పొగరెక్కెన్=మదించెను. ఉత్ప్రేక్షాలంకారము.

ఆ. సాంధ్యరాగలహరి • సామిరంజితములై
తిరిగె మింట నిదుర • దెలిసినట్టి
యిందిరాధిపతికి • నెత్తుకర్పూరనీ
రాజనంబు లన శ•రద్ఘనములు. 139

టీ. శరద్ఘనములు=శరత్కాలమేఘములు, సా...లై - సాంధ్య=సంధ్యాసంబంధియయిన, రాగ=రక్తిమయొక్క, లహరి=తరంగములచేతను, 'మహత్సూల్లోలకల్లో

లా లహర్యుత్త లికేసమే' అని యమరశేషము. సామి=సగము, రంజితములై=కెంపువ ర్ణములుగలవిగాఁ జేయఁబడినవై, ని...కిన్-నిదురజెలిసినట్టి=నిద్రమేల్కాంచిన, ఇంది రాధిపతికిన్=లక్ష్మీరమణునకు, ఎ...నన్-ఎత్తు=పట్టినటువంటి, కర్పూరనీరాజనంబుల నన్=ఘనసారపునివాళులోయన్నట్లు, మింటన్=అంతరిక్షమునందు, తిరిగెన్=సం చరించెను, 'సామిత్వర్థేజుగుప్సనే' యనియు, 'ఇందిరాలోకమాతామా' యనియు నమరము. ఉత్ప్రేక్షాలంకారము.

చ. అళిగరుదంచలామల త•దంతరబింబిత యయ్యెఁ బాకని
ర్దళితమహాఫలౌఘహరి•తచ్ఛదకర్కరికావనాలి నాఁ
గలమవన భ్రమచ్ఛుకని•కాయములోపల సాంధ్యరక్తిమం
బలఁతిగఁ దాల్చి మింటఁ గన•నయ్యె విపాండుపయోదఖండముల్.

టీ. వి...ల్-విపాండు=మిగులఁ దెల్లనైన, పయోద=మబ్బులయొక్క, ఖండ ముల్=శకలములు, క...ము-కలమవన=పండినరాజనపుచేలమీఁద, భ్రమత్=తిరుగు చున్న, శుకనికాయము=చిలుకలగుంపు, లోపలన్=శరత్కాలమేఘములలోపల, సా ...బు-సాంధ్య=సంధ్యాకాలసంబంధియైన, రక్తిమంబు=అరుణ్యమును, అలఁతిగన్= కొంచెముగా, తాల్చి=ధరియించి, పా...లి-పాక=పండుటచేతను, నిర్దళిత=మిక్కిలి విరిసిన, మహత్=గొప్పవైన, ఫల=పండ్లయొక్క, ఓఘ=సమూహముగల్గియు, హరిత చ్ఛద=పచ్చనియాకులుగల, కర్కరికావనాలి=దోసతోఁటలగుంపు, అ...త-అళి= తుమ్మెదలయొక్క, గరుత్=ఱెక్కలయొక్క, అంచల = కొనలవలెనున్న, అమల = నిర్మలమయిన, తత్=ఆకాశముయొక్క, అంతర=నడుమను, బింబితయయ్యె నాన్= ప్రతిఫలించెనోకోయన్నట్లు, కననయ్యెన్=చూడనొప్పెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. పండినవైరులమీఁద సంచరించుచున్న చిలుకలగుంపును దమయందుంచు కంతసంధ్యాకాలికరక్తిమము ధరియించిన తెల్లని మేఘఖండములును బరిపక్వములై పండి విరిసినగొప్పపండ్లును బచ్చనయినయాకులునుం గల దోసతోఁటలు ద్విరేఫముల ఱెక్కలమొనలవలె నైగనిగ్యము గలయయ్యాకాశమునందుఁ బ్రతిఫలించెనో యన్న ట్లుండెననుట.

క. ఘృణిగణవిహారణఁ జివికిన
మణిధనువునఁ దొరఁగు నుసి స•మానములై ద
ర్పణనిభనభమునఁ బరిణత
శణకణహారిణములు పాండు • జలదము లొలసెన్. 141

టీ. ఘృ...ణన్-ఘృణి = నుసిపురుగులయొక్క, గణ = సమూహముయొక్క, విహారణన్=సంచారముచేత, చి...సన్-చివికిన=వానలకుఁదడిసి శిథిలమయిన, మణి

ధనువునన్ = ఇంద్రధనువునందుండి, తో...లు ఐ-తోరఁగు = పడుచున్నటువంటి, నుసిస మానములై = పరాగసదృశములై, పరి...లు-పరిణత = పరిపక్వములయిన, శణ = జనపనారయొక్క, కణ = లేశములవలెను, హారిణములు = తెల్లనైనటువంటి, పాండుజలదములు = తెల్ల మబ్బులు, ద...నన్-దర్పణ = అద్దముతోడను, నిభ = సమానమయిన, నభమునన్ = ఆకాశమందు, ఒలసెన్ = సంచరించెను. శరత్కాలమేఘము లను మణిధనువుయొక్క పరాగములని యుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

క. రవిశశిముకురములు శర
ద్వ్యవతి మెఱుఁగుఁబెట్టుభూతి • యో యనఁ బర్వెన్
బవనాహతసప్తచ్ఛద
నివహాపరాగంబు దివికి • నిర్మలకాంతిన్. 142

టీ. ర...లు-రవిశశి = చంద్రసూర్యులనియెడు, ముకురములు = అద్దములను, శరద్వ్యవతి = శరదృతువనుజవరాలు, మెఱుఁగుఁబెట్టు = కాంతిఁగలుగఁజేయునట్టి, భూతి యో యనన్ = భస్మమో యనఁగా, ప...బు-పవన = వాయువుచేతను, ఆహత = ఎగురఁగొట్టఁబడిన, సప్తచ్ఛద = ఏడాకుల యరంట్లయొక్క, నివహ = సమూహముయొక్క, పరాగంబు = పుప్పొడి, దివికిన్ = అంతరిక్షమునకు, ని...తిన్-నిర్మల = స్వచ్ఛమయిన, కాంతిన్ = తేజస్సుచేతను, పర్వెన్ = వ్యాపించెను. ఉత్ప్రేక్షాలంకారము.

తా. లోకమునం దద్దమునకు వచ్చిన మాలిన్యమును భస్మముచేతఁ దుడుచుట ప్రసిద్ధముగాన నటు వర్షాకాలమందుఁ జంద్రసూర్యు లనునద్దములకు నైర్మల్యము దక్కువ పడఁగా వానికి మెఱుఁగెక్కించి చక్కఁబఱచుటకై శరద్వనిత యుంచిన విభూతియో యనునట్లాసమయమందు సప్తచ్ఛదపరాగములు గాలిచేత నెగరఁగొట్టంబడి యంతరిక్షమున వ్యాపించె ననుట.

స్రగ్ధర. సంభూతజ్ఞప్తివాతా • శనశయనము వి • శ్వంభరుం డూఁదిలేవం
గంభీరప్రక్రియామ • గ్నత డిగు జగతిం • గ్రందుగాఁ దోఁచు వర్షా
దంభోళిస్థూలరంధ్రో • ద్గతసితపృథుపా • తాళజాతాంబుధారా
స్తంభంబు ల్పోలె నెన్ను • ద్ధవళరుచిశర • స్తంభపఙ్క్తిం జనించెన్.

టీ. స...ప్తిన్-సంభూత = జనించినట్టి, జ్ఞప్తిన్ = మెలఁకువచేతను, వాతాశన శయనమున్ = శేషపర్యంకమును, విశ్వంభరుండు = శ్రీమహావిష్ణువు, 'విశ్వంభరః కైటభజి ద్విధుశ్శ్రీవత్సలాంఛనః' యనియమరము. ఊఁదిలేవన్ = ఊనికొనిలేవఁగా, గం...తన్-గంభీరప్రక్రియా = నిమ్న ప్రకారమగునట్లు, మగ్నతన్ = మునుంగుటవల్లను, డిగు = క్రిందికినడఁగినట్టి, జగతిన్ = భూమియందు, క్రందుగాన్ = దట్టముగా, తో...న్-తోఁచు = కానవచ్చుచున్న, వర్షా = వానకాలమందలి, దంభోళి = పిడుగులయొక్క, స్థూలరంధ్ర

= గొప్ప బెజ్జములవలన, ఉద్గత=బయలుదేఱిన, పృథు=గొప్పలైన, సిత=తెల్లనైన, పాతాళజాత = పాతాళలోకమందుఁబుట్టిన, అంబుధారాస్తంభంబుల్ పోలెన్ = స్తంభములవంటి యుదకధారలవలె, శరస్తంభపఙ్క్తిన్=ఱెల్లుకోడలపరుసయందు, ఎన్నుల్=కంకులు, ధవళరుచిన్=తెల్లనికాంతితో, జనించెన్=పుట్టెను. ఇందు ఱెల్లు యొక్క యెన్నులను బిడుగులరంధ్రములనుండి బయలువెళ్ళినట్టి పాతాళజలధారాస్తంభములుగా నుత్ప్రేక్షించినందున నుత్ప్రేక్షాలంకారము.

తా. ఆశరదృతువునం దేదిక్కునఁ జూచినను ఱెల్లుపొదలు ఎన్నులు దీసి తెల్లగాఁ బ్రకాశించుచుండె ననుట.

తే. నీరజేక్షుణుఁ డవ్వేళ • నిద్ర దెలిసి
యడుగుఁ దనమీఁద మోప నో•యవనిరమణి
కంటకితగాత్రి యయ్యె నాఁ•గా విపాక
పరుషకంటకశాలిమం•జరులు వొలిచె. 144

టీ. నీరజేక్షణుఁడు=విష్ణుదేవుఁడు, అవ్వేళన్ = ఆ శరత్సమయమునందు, నిద్ర దెలిసి=నిదుర మేల్కొని, అడుగున్ = పాదమును, తనమీఁదన్ = భూమిపైని, మోపనో=ఉంచఁగానో, అవనిరమణి=భూదేవి, కంటకితగాత్రియయ్యెనాఁగాన్ = పులకితాంగియయ్యెనన్నట్లు, విపాక=పండుటచేత, ప...లు - పరుష = వాఁడియై యున్న, కంటక=ముండ్లుగల, శాలిమంజరులు = సన్నవరియెన్నులు, పొలిచెన్ = ఒప్పెను. హేతూత్ప్రేక్షాలంకారము.

తా. పండి ముదురైనందున వాఁడిమి గలిగియున్న ముండ్లతోనుండు సన్నవరి యెన్నులం జూడఁగా నా శరదృతువునందుఁ గమలాక్షుండు నిద్ర లేచి యడుగుఁ దనమీఁద నుంచుటచేత నాభూదేవి కంటకితగాత్రి యాయె ననునట్లుండె ననుట.

మ. స్ఫుటభూయోహ్పృతిశంక వార్ధి నినర•శ్మ్రల్మిన్ను చేర్పం దటి
చ్ఛట లౌర్వంబుగఁ గారుగొంచు ఘనమై • త్మ్రాఁ దీర వర్షింప న
చ్చొటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీ•సూనుండు గాకున్న నో
క్కొటఁ దారాగ్రహభాస్కరేందుమణిశు•క్త్యుల్వ్యక్తమై తోఁచునే.

టీ. స్ఫు...కన్ - స్ఫుట=వ్యక్తమైన, భూయోహ్పృతిశంకన్=అగస్త్యుండు మరలఁబానముఁజేయు ననుభయముచేత, 'శంకావితర్కభయయోః' అని యమరము. ఇనరశ్ముల్=సూర్యకిరణములు, వార్ధిన్=సముద్రమును, మిన్నుచేర్పన్ = అంతరిక్షమును బొందింపఁగా, (సూర్యకిరణములు సముద్రోదకములను మేఘములందుఁ జేర్పఁగా ననుట.) తటిచ్ఛటలు=విద్యుత్సమూహములు, ఔర్వంబుగన్ = బడబాగ్నిగా,

కాఱుకొంచున్=నల్లనిదై, ఘనమై=మేఘమై, క్ష్మన్ = భూమిని, తీరవర్షింపన్ = ఉదకమంతయు వానలుగురియఁగా, అవ్యోమ్నన్=ఆ యాకాశమునందును, కలశీసూనుండు = అగస్త్యుఁడు, తోఁచి=కనుపించి, గ్రసింపఁబోలున్ = సముద్రోదకమును పానముఁజేసెఁగాఁబోలు, కాకున్నన్=అట్లుగాకుండెనేని, ఒక్కటన్=ఏకరీతిఁగా, తా...ల్ - తారా = చుక్కలును, గ్రహ = అంగారకాదిగ్రహములును, భాస్కర=సూర్యుఁడును, ఇందు=చంద్రుఁడును, (అనియెడు) మణి=రత్నములును, శుక్తుల్=ముత్యపుచిప్పలును, వ్యక్తమై=స్ఫుటమై, తోఁచునే=కానవచ్చునా, కానరావనుట

తా. శరత్సమయమున నంతరిక్షమందు మేఘములు లేక, నక్షత్ర సూర్యేందువులు స్ఫుటముగఁ బ్రకాశించుటను నగస్త్యోదయంబగుటను జూడఁగా బూర్వ మగస్త్యునికి వెఱచి మేఘరూపమును వహించి యాకాశమును జెందియున్న సముద్రుని నగస్త్యుండు మరలఁ బానముజేసియుండును. లేకపోయెనేని యందుండు తారాగ్రహములనియెడు రత్నములును సూర్యచంద్రు లనుముత్యపుచిప్పలును గానవచ్చుటకుఁ గారణంబు లేదనునట్లు తోఁచుచుండెననుట.

చ. అలమలయాద్రిఁ గుంభభవుఁ • డన్కతకంబు శరర్తుకుండమం
డలిఁ బ్రతిబింబకైతవము • నం దమ కిచ్చిన వారిదేవత
ల్తోలఁకుల కేలఁ దాఁప నిడి • తోమఁ గలం కడఁగెం దదీయత
త్ఫలతకు హ్రస్వ మౌటె కరి • తారక లంబువుఁ దేర్చునే యనన్.

టీ. అ...న్ - అల=ప్రసిద్ధమైన, మలయాద్రిన్=పటీరపర్వతమునందున్నట్టి, కుంభసంభవుఁడు=అగస్త్యుఁడని, 'అగస్త్యః కుంభసంభవః' యని యమరము. అన్కతకంబు=అనుచిల్లగింజను, 'చక్షుష్యః కతకః కాంతికృ' త్తనిరత్నమాల. శ...న్-శరర్తు=శరదృతువను, కుఁడమండలిన్=సరస్సమూహములందు, ప్రతిబింబకైతవమున్=ప్రతిఫలనవ్యాజముచేతను, తమకున్=ఆవారిదేవతలకు, ఇచ్చినన్=ఇయ్యఁగా, వారిదేవతల్=జలదేవతలు, తోలఁకులకేలన్=తరంగములను హస్తములచేతను, తాఁపనిడి=మెట్టురాతిమీఁదఁ బెట్టి, తోమన్=అరగఁదీయఁగా, కలంకడఁగెన్=కాలుష్యము దీఱెను, తదీయ=ఆ యగస్త్యుని సంబంధియైన, తత్ఫలతకున్ = ఆ చిల్లగింజౌటకు, హ్రస్వమౌటె = చిన్నదౌటయే, కరి = సాక్షి, (చిల్లగింజ గనుకనే ఊచినందున హ్రస్వమాయె ననుట.) (అట్లుగాకుండెనేని) తారకలు=నక్షత్రములు, అంబువున్=ఉదకమును, తేర్చునే=తేటగాఁజేయునా, చేయవనుట. అనన్=అనునట్లు, కలంకడఁగె నని క్రిందికన్వయము. రూపకానుప్రాణితాపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్షాలంకారము.

చ. ఇలకు సుధాసమత్వము వ*హింప శరజ్జలజాక్షి కుండమం
డలి సలిలంబు కల్మష మ*డంగ మొగుల్విరియెండ గాయుచో
జిలుకు నిశారజఃపటలి * చెన్ను వహించెఁ దరంగపఙ్క్తిపై
దళదరవిందకైరవక*దంబకడారపరాగపూగముల్. 147

టీ. తరంగపఙ్క్తిపైన్=కెరటముల బంతిమీఁద, ద...త్ - దళత్=వికసించుచున్న, అరవింద=పద్మములయొక్కయు, కైరవ = కలువలయొక్కయు, కదంబ=సమూహములయొక్క, కడార=పచ్చనైనటువంటి, 'కడారఃకపిలఃపింగః' యని యమరము. పూగముల్=సమూహములు, 'పూగోవితానంప్రకరః' యని యమరము ఇలకున్=భూమికి, సుధాసమత్వము=అమృతసామ్యము, వహింపన్=పొందునట్లు, శరజ్జలజాక్షి=శరత్కాలమనుస్త్రీ, కుండమండలిన్=కొలంకులయందు, 'కుండంపిఠరేతోయాధారవిశేషేచవహ్నిగర్తేచ, కుండోజారాజ్జాతస్సభర్తృకాయాం కమండలౌ కుండీ' యని రత్నమాల. సలిలంబు=ఉదకము, కల్మషమడంగన్ = కలుషముపోవుటకు, మొగుల్=మబ్బులు, విరి=విరిసిన, ఎండగాయుచోన్=ఎండతపింపఁగా, చి...లి-చిలుకు=చల్లఁబడినటువంటి, నిశారజఃపటలి = పసుపుపొడిరాశియొక్క, చెన్ను=సౌందర్యమును, వహించెన్=పొందెను.

తా. ఆసమయంబున వికసించిన తామరలయొక్కయుఁ గలువలయొక్కయుఁ బరాగములు తరంగముల పైఁ బడి శరదృతు వనుస్త్రీ యుదకములోని కల్మష మడఁగించి రుచిఁబుట్టించుటకొఱకుఁ జల్లిన పసపుపొడివలె నుండె ననుట.

ఉ. హెచ్చినమైత్త్రిఁ బద్మినుల * కెల్ల ఘనాత్యయకారకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయుటకు * నై యలక్రౌంచనగంబు పేరిక
మ్మచ్చున నీడ్చుశర్వగిరి * యందలి వెండిశలాకపిండు నా
వచ్చి మరాళమాలికలు*వ్రాలెఁ గొలంకులఁ జక్రఝుంకృతిన్. 148

టీ. హెచ్చినమైత్త్రిన్=అతిశయించినస్నేహముచేత, పద్మినులకెల్లన్=తామరకొలంకులను (పద్మినీస్త్రీల) కంతయును, ఘనాత్యయ = మేఘావసానము నెడు (అనఁగా శరదృతువనుట.) కారకుండు=అగసాలవాఁడు, సొమ్ము = భూషణము, అచ్చుపడంగన్=సమముగనుండులాగున, చేయుటకునై=తీఁగెగా నొనరించుటకై, అల=ప్రసిద్ధమైన, క్రౌ...నన్ - క్రౌంచనగంబు పేరి = క్రౌంచపర్వతమనియెడు మిషగల, కమ్మచ్చునన్ = వెండిబంగారు తీఁగెతీయునట్టి యుక్కుకమ్మచ్చుయొక్క బెజ్జమందు, ఈ...నాన్-ఈడ్చు=లాగెడు, శర్వగిరియందలి = కైలాసపర్వతమునందున్న, వెండిశలాకపిండునాన్=రజతపుతీఁగసమూహమో యనునట్లు, మరాళిమాలి

